# భారతి

మాసపత్రిక



శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938–1972)



నవంబరు 1973

సంపుటము : 50 : సంచిక : 11 :

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## నవంబరు 1973

# ఆంధ్ర సౌందర్యలహరి

శ్రీ పమిడికాల్వ చెంచు నరసింహ శర్మ

చ॥ శివుఁడును శక్తి యుక్తి విరచింపఁగఁ జాలు జగత్సమూహముల్
సువిహిత లీలఁ; గాని యెడ సుంత చలింపఁగ నోపఁ డట్టి నిన్,
భవ పురుషోత్తమాబ్జభవ వంద్యను, సన్నుతిసేయ, మ్రొక్కఁగా
నెవఁడు సమర్థుఁడౌ సుకృత మెన్నఁడుఁ జేయని వాఁడు శాంకరీ!॥

తే॥ గీ॥ బ్రహ్మ నీ పదపద్మ పరాగ లేశ
మున్ గొని సృజించుఁ జక్కఁగ భువనరాశి;
మోయు హరి దాని శ్రమఁ బూని వేయి తలల,
దానినే బూదిఁ గల్పి భూతపతి దాల్చు॥

తే॥ గీ॥ అజ్ఞహృత్తమ మడఁప నర్యముని ద్వీప
పురము, నవివేకులకుఁ దెల్వి పూవుఁ దేనె
వాక, చింతామణియుఁ బేద వారలకును,
నాది సూకర దంష్ట్రి భవాబ్ధి మగ్న
జనుల, కగుచు నీ పాద రజంబు వొలుచు॥

ఉ॥ అంబ! త్వదన్యదేవ నివహంబు వరాభయ ముద్రలాత్మ హ
స్తంబులఁ దాల్చుఁ దాల్పవు గదా యవి నీవను చింత యేల? స
త్యంబుగ సర్వలోకముల కాశ్రయమైన భవత్పదాబ్జ యు
గ్మంబె యభీప్సితాధిక సుఖప్రదమున్, భయహారి యౌట చేన్॥

మ॥ నత సౌభాగ్యదవైన నిన్, దొలి రమానాథుండు సేవించి మో
హితుఁ జేసెన్ జెలియై పురాంతకుని; బుష్పేషుండు పూజించి నిన్
రతికాప్రిల్ గన్నుల జుఱ్ఱుకోదగిన విన్నాణంపు రూపమ్ముతో
నతి మోహమ్ము ఘటింప నోపుఁ గద మాతా! మౌని వర్యాళికిన్॥

చ॥ ధనువు ప్రసూన సంఘము, మద భ్రమరంబులు నారి, పంచ మా
ర్గణములు, మంత్రి చైత్రుఁడు, సుగంధ సుశీతల మారుతంబు తే

రును, గల శంబరారి యొక రుండె భవత్కారుణా కటాక్ష వీ
క్షణ విలసత్ప్రభావమున సర్వ జగంబుల గెల్వఁ జాలెడిన్॥

సీ॥ ఘల్లుఘల్లని మ్రోయు కనకంపు గజ్జెల
మొలనూలు కటి భాగమున వెలుంగ,
మదకరి కలభకుంభప్రాయ కుచభార
మున వంగి మైదీవ మురువు సూపఁ
బరిక్షీణ మధ్యంబుఁ, బరిణత శరదిందు
విభ వదనంబును నీటు గులుక,
వరధనుశ్శరజాల పాశాంకుశంబులు
కర చతుష్టయమునఁ గ్రాలుచుండఁ,
తే॥ గీ॥ త్రిపురవైరి—యహంకార దీప్తమూర్తి,
విశ్వజనసంఘ నిత్యభావిత సుకీర్తి,
అలజగన్మాత యెవ్వేళ లందు నాకు
మించు దయతోడ సాక్షాత్కరించు గాత!॥

సీ॥ అమృతసాగర మధ్యమందుఁ గల్పక తరు
వాటిక సమావృతమై తనర్చు
రత్నమయ ద్వీపరాజిత నీప
వనమున సత్కళా భాసితమగు
చింతామణి నికేతనాంతర స్థిత శివా
కార మంచమున నొప్పారు శివుని
యంక భాగమున సుఖాసీనవగు సచ్చి
దానంద లహరి నీవని యెఱింగి
తే॥ గీ॥ నీ పదాంబుజ సేవయే నిత్య ముక్తి
దాయకంబని నమ్మి కొందఱు మనీషు
లవిరళ ధ్యాన యోగ నిష్ఠాత్ము లగుచు
నిన్ను భజియింతురో భవానీ సతంబు॥

సీ॥ అవని తత్త్వంబు మూలాధారమున యందు,
వారి తత్త్వము మణిపూర చక్ర
మందు, స్వాధిష్ఠానమం దగ్ని తత్త్వంబు,
ననిల తత్త్వంబ నాహతము నందు,

నాకాశ తత్త్వంబు నవ్విశుద్ధంబున,
వాగ్నేయమున మానసాఖ్య తత్త్వ
మును పంచభూత తత్త్వావళి భేదించి, సు
షుమ్న మార్గమునఁ బైఁ జొచ్చి యచట
తే॥ గీ॥ నాత్మపతి యగు త్రిపుర సంహరుని తోడఁ
గలసికొనుచు సహస్రార జలజ మందు
నతిరహస్య స్థలంబున హాయి మీఱఁ
గ్రీడ సల్పుచునుందు పెన్క్రీడ నీవు॥

ఉ॥ అంబ ! భవత్పదాబ్జ గళితా మృతధారలచేత సర్వ లో
కంబులఁ దన్పుచున్ రజనికాంతునిచే స్వగృహంబు సేర న
ర్పంబుగఁ గుండలిం గలిగి క్రాలు నిజాకృతిఁ దాల్చి సూక్ష్మ రం
ధ్రింబునఁ బోయి దాంతువు సదా తొలి చక్రమునందు నిద్దురన్॥.

---



# చేమకూర కవితా సంప్రదాయాభిజ్ఞత

శ్రీ ముదివేడు ప్రభాకర రావు

1

"ఆదిత్యవర్ణే తపసోఽధి జాతో
వనస్పతి స్తవ వృక్షోఽథ బిల్వః
తస్యఫలాని తపసాను దన్తు మాయా
అన్తరాయాశ్చ బాహ్యాః అలక్ష్మీః"
— శ్రీసూక్తము.

(సూర్యునివంటి వన్నెగల్గిన లక్ష్మీ! మొదట నీ యనుగ్రహమువలన నీ హస్తమునుండి పుష్పములు లేకుండగనే ఫలించునట్టి బిల్వవృక్షము జన్మించినది. ఆ పాదపము బాహ్యాంతరింద్రియ సంబంధమగు దారిద్ర్యమును బోగొట్టుగాక!)

కావ్య నిర్మాణమునకు కవి మనస్తత్త్వమే ప్రష్టభూమి. చేమకూర, సమకాలిక కవులలో బహు సుకుమార మనస్తత్త్వము గలవాడు. కావుననే 'విజయ విలాసము' వ్రాయగలిగినాడు. ఇది 'అర్జునుని విక్రమము' కాదు. 'విజయుని విలాసము'. ప్రబంధ నామధేయమే తత్కావ్యగత సౌకుమార్యము తెలుపుచున్నది. మనస్తత్త్వానుగుణముగా శబ్దము ప్రవర్తించును. ఆ మనస్తత్త్వమే కావ్యవస్తువును సైతము యెన్నుకొనును. కావున మనస్తత్త్వము క్షేత్రముగా సాహిత్య కేదారము పండుచున్నది.

నన్నయగారి భారతము సుకుమార లేక మధుర శైలీ ప్రధానము. ఆయనది సర్వదా ఆలంకారిక మార్గము. పెద్దన్నగారు దీనిని చక్కగా తీర్చిదిద్దినారు. ఈ మార్గమే శృంగార శాకుంతలము; విజయ విలాసాది సుకుమార కావ్యములకు యొరవడి పెట్టినది. ఒజ్జబంతియైనది. కాని నన్నయగారిలోని ఋషిత్వము, సంయమనము వైవిధ్యము తరువాతి వారిలో లేవు. భవభూతి మాట నీ రెండు తెగలవారికి నన్వయించు చున్నది. శబ్దము నన్నయ్య ననుసరించి ప్రవర్తించినది. విజయవిలాసాది కవులు శబ్దమును పలురకములుగా వాడుకొన్నారు. ఎన్నియో చమత్కారములు చేసినారు.

చేమకూర నొక భావమును బహు సుకుమారముగా ననగలడు. అంత సొగసుగా మృదువుగా చెప్పుటెట్లు? అది యాతని జీవలక్షణము. అది యట్లే ప్రసరించును. ఆతడొక విదగ్ధ శేఖరుడు 'విదగ్ధత యనగానేమి? మనస్సౌకుమార్యము; సౌకుమార్యము సత్త్వగుణాధేయము. సుకుమారత యనగా ప్రతిభావపు చిఱు కదలికను గుర్తుపట్టు నొక మహావిశిష్ట గుణము. ఈ విద్య మహాకవికిని తెలియును. ఆతడు సౌకుమార్య విధానము. కళాసేవనము సుకుమార మనః ప్రవృత్తి గలవాని సొత్తు—కారణము దానిని సృష్టించిన విధాత సుకుమారుడు కావున.' యని 'ఆముక్త మాల్యదా సౌందర్యము' పలుకుచున్నది. చేమకూరయే తన కావ్యమున రసోపగుంభిత పదవాసనలు, ప్రసన్నత సౌకుమార్యము గలదని పరోక్షముగా చెప్పికొని యున్నాడు. (1–145). అతడు 'తామరలకు కుత్తుకబంటి, గండుమీలకు తలముక్కలు' అనగలడే గాని రాయలవలె 'మలుగుమీన్ బొఱియదూఱె' అని విచిత్రముగా ననలేదు. 'కేళికాసరసిలో తేలియాడుటజేసి శైవాలలత కొంత సాటివచ్చు' అని మనసోగ వెంట్రుకలను, సొగసుగా వర్ణించునే కాని తెనాలి వలె 'మొలక చీకటి జలజల రాల్పగా రాదె వెఱులు మించిన పిరి కురులయందు' అని విచిత్రముగా వర్ణింపడు. దీనికి కారణమేమి? మనస్తత్త్వము. ఇతనిది సుకుమారశైలి.

వారిది విచిత్రశైలి. సుకుమారత్వము సౌందర్యము నపేక్షించును. సౌందర్యము హృదయరంజకమైనది. అనగా మన హృదయమందు రమించును. ఈ రమింపజేయు లక్షణమునే 'రమణీయత' యనినారు. ఇదియే కాంతా సమ్మితత్వ పద్ధతి. కేవల మిది యొకటియే చాలునా? చాలదు. మరియొక మహా విషయమున్నది. అదియే సంప్రదాయము.

సమన్వయమే సంప్రదాయమ్ము. ఇది యాంతరము కాని బాహిరము కాదు. ఎడనెడ కాలము వక్రించి మత కలహ ధూళిచే నది పొనుగువడిపోగా సంప్రదాయతత్త్వవేత్తయైన కవి ఋషి 'లోకహితనిష్ఠ'చే దానికి పులి గాపువెట్టి తళతళలాడించును' అని డా॥ టి. కోటేశ్వరరావుగా రొకచో నుడివియున్నారు. ఒక జాతి సంప్రదాయము రక్తనిష్ఠమైనది. అతి బలవత్తరమైనది. దీనిని మహాకవులే గుర్తింతురు. కావున జాతి జనుల యాంతర జీవితమునకు సంబంధించిన సంప్రదాయమే విశిష్టమని తెలియుచున్నది. ఇది తజ్జాతి జీవగత మగుటచే పరంపరాగతముగా ప్రాప్తించుచుండును. ఈ సంస్కార విశేషము కాలానుగుణముగా ప్రజల జీవన విధానము ననుసరించి మారుచుండును. ఆ ప్రాచీనతకు మారుచున్న నవీనతకుగల యాయువుపట్టును గ్రహించి—మహాకవి యైనవాడు తన కాలములో నొక మహాకావ్యమున దానిని సమన్వయించి చూపును. అతడు తన బహు జన్మగత సంస్కార విశేషముచేత యా సంప్రదాయ సూత్రమును, తద్గత జీవనాడిని పట్టుకొని కావ్యమున వివిధముగా వ్యాఖ్యానించును. సమన్వయించును. భవిష్యత్తరముల వారికా సూత్రమును యందించును. ఈ రహస్యము తెలిసినవానికే పై బాహ్యాభ్యంతర సమన్వయము కుదురును. ఒక జాతి సంప్రదాయ మెట్లు పరంపరాగతమైనదో ఆ జాతి కవితా సంప్రదాయము నట్లే నెడతెగక సాగివచ్చుచుండును. ఈ రెంటికి యవినాభావ సంబంధము ఏ మహాకవి సంప్రదాయము దేశకాలాద్యవచ్ఛిన్నమై యనుస్యూతముగా సాగివచ్చుచున్నదో ఆ సంప్రదాయమే చేమకూర చేతకు 'విజయ విలాసము' వ్రాయించినది కాని ఆతని కాలము సంప్రదాయ విచ్ఛిత్తిని సూచించు దశా విశేషము గనుకనే నా యుగమును 'క్షీణయుగ'మనినారు. అనగా కావ్యరచనా సంఖ్యలో నిది తక్కువయని గాదు. తత్కాల కావ్యగత గుణ ప్రాధాన్యవివక్షచే క్షీణమని యర్థము.

ఆ క్షీణదశకు కారణమేమి? యుగధర్మము. యుగధర్మముగా కాలధర్మము. అనంతమైన కాలమును మానవుడు ఏకరూపముగా దర్శించలేక తన విచక్షణ జ్ఞానముచే భూత భవిష్యద్వర్తమానములని విభజించుకొన్న రీతినే ఆయా కాలములలో బహుముఖముగా వెలువడిన సాహిత్యము నిశ్శేషక దేశముగా దర్శించుట సాధ్యముగాక చతుర్యుగముల వలె సాహిత్యమును కొన్ని యుగములుగా వర్గీకరించినాడు. ధర్మమనగా పురుషార్థముల లోని ధర్మము కాదు. అది కాలశక్తికి సంబంధించినది. కాలము శక్తిస్వరూపమైనది. భవభూతి యంతటి గొప్ప కవితాత్త్విక శిరోమణి

'ఉత్పత్స్యతే మమతు కోపి సమాన ధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచపృథ్వీ' అనినాడు.

అనగా నీ నిరవధికమైన కాలములో యే మహాకవి యెప్పుడు భూలోకముపై నవతరించునో చెప్పజాలము. సర్వము కాలాధీన మనినాడు. మహర్షి వాల్మీకియు 'కాలోహి దురతిక్రమః' యనినాడు గదా! కావున కాలము దైవ నియంత్రితము. అది త్వష్టయైన ప్రజాపతి బుద్ధి విలసనము. అతడు కాలశిల్పి. కాకున్న వేంకటకవి ముందు మహాసంప్రదాయవేత్తయైన రాయలు మత—రస సమన్వితమైన 'ఆముక్తము' వినిర్మించుట యేమి?! దీని తరువాత కాలమును క్షీణయుగమని, అంధ యుగమని పేర్కొను టేమి? విచిత్రముగా నున్నది. ఆ కాలమునకున్న శక్తి యంతియేయని సమాధానము. అట్టి పరిమిత ధర్మము గల కాలములోను పూర్వకవి గ్రంథపఠన మననాదులచేత, స్వప్రతిభచేత, కొలదిగా సంప్రదాయ వాసనలు గలిగిన చేమకూర రాజభక్తి గలిగి, వినయాన్వితుడై సమకాలికుల లెక్కింపక తన శక్తి సామర్థ్యముల ప్రదర్శించినాడు. క్షీణయుగపు జీవనలత

పరిపక్వమైన యౌవనదశలో 'విజయ విలాస'మను లతాంతమును పుష్పింపజేసినది. అది యానాటి ప్రజల మహోసుకుమార నాగరక జీవనము, సౌందర్య దిదృక్ష నావిష్కరించు దర్పణమువలె మన్నది.

అన్నికాలములలోను కవులున్నారుగదా? ఈ హెచ్చుతక్కువ లేమి? యనిన యీ సత్యము రెండు మూడంశములపై నాధారపడి యుండును. (1) ఒక కాలమున మహాకవి జన్మించవలెనను దైవ సంకల్ప మున్నచో అట్టిమహా శక్తిగల బీజములు యంతకు పూర్వమే నా దేశ వాతావరణమున నిక్షిప్తమై యుండును. తదనుగుణమైన సంస్కార జీవి యావిర్భవించినంతనే మహాకావ్యమవతరించును. ఇది అదృష్టమైన కాలశక్తి. (2) ప్రజాజీవనము, మన స్తత్వ ప్రమాణము ఉన్నతముగా నుండవలెను. కవి ఆ కాలమున యుత్తమ సంస్కారి గావున సరస్వతీ స్రవంతి లతని వాక్కు యనెడి నిచ్చెన నాధారముగా గొని పృథివి కవతరించును. (3) కవి స్వీకరించు కావ్యవస్తువు ఉత్కృష్టమైనదిగా నుండవలెను. బలహీనమైన కావ్యవస్తువులో బరువైన సత్యము లిముడజాలవు ఎంత ప్రయత్నించినను కాల సహాయము లేక అల్పసంస్కారియైన కవి తన కావ్యమున మహా సంప్రదాయమును వ్యాఖ్యానింప జాలడు.

మరియొక పద్ధతిగా పరిశీలింతము. చారిత్ర కముగా చూచినను తళ్లికోట యుద్ధానంతరము విజయ నగర సామ్రాజ్య మహాశక్తి యంతరించినది, దేశ విచ్ఛిత్తితోపాటు సంప్రదాయ విచ్ఛిత్తియు జరిగినది. దేశము తురుష్కాక్రాంతమైనది. అంతవరకు ధగద్ధ గాయ మానముగా ప్రజ్వలించిన యొక మహాసామ్రాజ్య పతనముతోబాటు మహాకవితా శక్తియు వణగిపోయి నది. తిరిగి తెలుగు సామ్రాజ్య స్థాపనకై నడుము కట్టిన వారిలో రఘునాథ నాయకుడు ముఖ్యుడు. దేశ మెంత విచ్ఛిన్నమైనను ప్రజల సుఖ సంపదలకు లోటు లేకుండినది. మేచ్ఛుల విజయముతో దేశ వాతా వరణము కలుషితమైనది. దానితో భౌతిక లాల సత్వము పెరిగినది. సంప్రదాయము విచ్ఛిన్నమైనను తద్వాసనలు మాత్రము సకృత్తుగా నిలచినది. కావున తత్కాలమున జనించిన విజయవిలాసమున పై రెండు విచ్ఛిత్తి విశేష గుణములు చక్కగా ప్రతిఫలించినవి. ఆ రెండు విషయములలో వివరిది పరిశీలింతము—

విజయ విలాసము సాకుమార్యమునకు పెట్టి నది పేరు. శబ్దము కవి మనస్తత్వము ననుసరించి జనించునని చెప్పబడినది. మరియు నా కాలపు జనుల సౌందర్య దృష్టియెంత నాగరకమైనదో తెలియవలెను. పైగా సంప్రదాయ వాసనలు చేమకూర కవితలో గలదని నిరూపించవలెను. వీని యన్నిటిని క్రింది పద్యమున పరిశీలింతము.

'తనకుం గౌగిలి యీ వొకప్పుడును
నాథా! నీకర స్పర్శనం
బున గిల్గింతలె' యంచు: బద్మిని
కరాంభోజమ్మునన్ మంద మం
ద నట ద్వాయు చలద్దళాంగుళులు
కన్పట్టంగ నవ్వేల్గు రా
యని 'రా! రా!' యని పిల్చె నాదగె
ద్విరేఫాత్యంత దీర్ఘధ్వనుల్'

(వి. వి. ప్ర. 139)

ఈ పద్యము ఉలూపీ —వృత్తాంతమునకు ముందున్న భుజంగ ప్రయాతపద్యమగు 'సునాసీర సూనుండు...(1–47) అను పద్యముతోను, సుభద్రా వివాహాత్పూర్వమున్న 'అద్దముఃజూచి చంద్రముఖి...' (3—92) అను పద్యముతోడను సంబంధము గలిగినది. పై నుదహరించిన పద్యమును చిత్రాంగదా వివాహాత్పూర్వము చెప్పబడినదే. ఈ మూటికిగల సంబంధమును వ్యాసాంతమున చెప్పెదను. ప్రస్తుతము పై పద్యమొక దానిని పరిశీలింతము.

విజయుని విలాసములలో రెండవ విలాసము చిత్రాంగదా వివాహము. అర్జునుడు చిత్రాంగదను దూరమునుండి చూచినాడు. చక్షుఃప్రీతిని పొంది నాడు. కాని ఆమె యతనిని చూచినదో లేదో తెలి యదు. సఖులతో యుద్యానవనము నుండి తరలినది. నాయకుడు ప్రియానుసరణము చేసినాడు. ఆమె స్నాన

వాడిన కొలను చూచినాడు. అందు తామరలు చూచినాడు. తన్మయుడైనాడు. ప్రక్కన తన చెలి కాడు విశారదుడున్నమాట సైతము మరచి పద్యము నాలాపించినాడు. పై పద్యమున నొక విధముగా రస ధ్వనియు, మరొక విధముగా అలంకారకృత వస్తు ధ్వనియు సమన్వయమగునని సహృదయులకు చెప్ప నవసరము లేదు.

ఇందు యుత్తమ శృంగారతత్త్వము నవగతము చేసికొన్న విధము వ్యక్తమగుచున్నది. శృంగారము మధురమైనది. అందు విప్రలంభము మరియు మధుర మైనదని యెల్లరు అంగీకరించినదే. పై ఘట్టమున విప్రలంభ శృంగారమే గలదు. ఇది 'నాథా! 'రారా!' యను సంబుద్ధుల వలన సుస్పష్టవ్యక్తము. విప్రలంభ శృంగారమందును నిది యభిలాష విప్రలంభమునకు చెందుచున్నది. 'కౌగిలి యీ వొకప్పుడును' 'కర స్పర్శనంబున గిల్గింతలె' యను పలుకులవలన నిది తెలియుచున్నది. పద్మిని యభిలాష యిందు వ్యక్త మగుచున్నది.

ఈ రెండవ ఘట్టమున నాయకుడు—విజయుడు. నాయిక—చిత్రాంగద. అర్జునుడు చిత్రాంగదను చూచిన వెంటనే తామరకొలనును చూచుటతో తన మనోభావమందు గోచరించింది. కాళిదాసు చెప్పినట్లు 'కామునకు ప్రియురాలి ప్రతిచేష్టయు తన నుద్దే శించియే చేసినట్లు తోచును. సర్వప్రకృతి కాముకత్వ ముతో భాసించు' ననుమాట సత్యమైనను యిట విజయుడు కేవల కాముకుడుగాక సంయముడు. స్థావరమైన ప్రకృతియందు చేతనాత్మకమైన తన మనోభావము నారోపించి తద్ద్వారమున కళా త్మకమైన సౌందర్యారాధనము చేయు 'శృంగారి' యనుట సమంజసము. అచేతనమైన ప్రకృతిని మానవీకరించుటచే యతడుత్తమ నాయకు డగు చున్నాడు. 'శృంగారీ చేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్' అని అగ్నిపురాణము. కావున విజయుడే యిట 'కవి' యగుచున్నాడు. ఆతనియందు కవి హృదయము గలదని వ్యక్తమగుచున్నది.

చిత్రాంగద ముగ్ధ యని కవియే నిరూపించి నాడు. కావున యామె తటిల్లతవలె నాయకుని ముందు మెఱసి వెళ్లినది. అది యామె స్వభావము. నైజగుణము. దీనిని ముందే నిరూపించు టెటు? కవియైన నాయకుడు ఆమెను పద్మినీజాతి స్త్రీగా యూహించినాడు. పద్మమునందు నిక్షిప్తపరచినాడు. పద్మము సుకుమారమైనది—ముగ్ధమైనది. కావుననే తుమ్మెద రొదలచే చలద్దళాంగుళులచే రారా యని సూర్యుని పిలుచుచున్నది. ఇది నాయిక స్వభావమునకు అచ్చముగా సరిపోవుచున్నది. నాయకుని మనోభావ మును మెఱుగు బెట్టుచున్నది. చిత్రాంగద యుత్తమ నాయిక.

ఈ యొక పద్యమునందే నాయికా నాయకుల యిరువురి విప్రలంభము గమ్యమాన మగుచున్నది. చిత్రాంగదను చూచిన విజయుడు పై పద్యము చెప్పు టచే యాతని విప్రలంభమందలి మాటలచే ధ్వని తము. పద్మిని (చిత్రాంగద) ముఖతః పద్యము చెప్పింపబడుటచే నాయికాగత విరహ విప్రలంభము వ్యక్తము. ఇట్లు యేకపద్యమునందే యిరువురి విరహ వేదన వ్యక్తము చేయించుట కవి నైపుణ్యము.

అర్జునుని 'శృంగారి' యనినాము గదా! శృంగారియైన కవి కళ నారాధించును. 'కళ'కు శిల్పార్థ మారోపింపబడుట సంప్రదాయము. శిల్పము నుండి సౌందర్య ముద్భవించుచున్నది. దీనినే పాశ్చా త్యులు Beauty యనియు దీనికి రసస్పర్శ యుండిన Aesthetic Beauty యనియు వ్యవహరింతురు. ఇంతకు సౌందర్య మనగా నేమి? అంగ ప్రత్యంగము లెచ్చట యథోచితముగా సమావేశమై యుండునో యట్టి సుస్నిగ్ధ సంధి బంధమును సౌందర్య మందుదు రని భరత మహర్షి. జార్జి సాంతాయనగారు 'Beauty is objectified pleasure' ఆనంద వ్యక్తియే సౌందర్య మనినారు. 'Beauty is unity and totality' అని E. D. Puffer గారి మాట. Certainly poetry was regarded as a force for elevation as well as for charm but as it reaches these

objects through Aesthetic Beauty' — అని శ్రీ అరవిందులు చెప్పినారు.

సౌందర్యమున జీవుడు రమించును. అట్టి రమణీయ, సుందర భావముల సాధించు నేర్పు శిల్పము. దానిని రసముఖముగా సాధించుట రసశిల్పము. ఇదియే ఉత్కృష్టమైనది.

చిత్రాంగదా విజయుల వివాహము వెనుక భగవత్సంకల్ప మున్నది. అది యీశ్వర సంకల్పము. చిత్రాంగద పాండ్యరాజు కులమున 'వెంగడమై' జన్మించినదని కవియే చెప్పినాడు. ఈ వెంగడమైన లక్షణముయొక్క స్వరూప స్వభావాదులను మరియొక వ్యాసమున విశదీకరింతును. ఈ భగవత్ప్రచోదన నాయకుని జీవితము మొత్తమువిూద పఅచికొన్న విషయము. లేకున్న యప్రతిహతమైన శంకరుని వరము వ్యర్థమైన చిత్రాంగద జన్మించుటేమి ? అంతకుముందు ఉలూపిని వివాహమాడిన విజయుడు చిత్రాంగదను చూచుటతోడనే తనను తానే మరచి మోహావేశుడగుటేమి ? అప్సరసయైన ఊర్వశి కోరికను నిరాకరించి 'నీ యింద్రియ జయము కీర్తనీయము తండ్రీ! యని యింద్రునిచే ననిపించుకోగల సంయముడు అర్జునుడు. అట్టివాడు సామాన్య రాజకుమార్తెను చూచి తన్మయుడగుటలో బలవత్తరమైన కారణ ముండవలెను గదా ! ఇది శంకర వరప్రభావము ! విజయుని భవిష్య జ్జీవితమునకు సంబంధించిన విషయము. ఈ చిత్రాంగదా విజయుల వివాహము కొంతవరకు నలదమయంతుల వివాహమును, 'శిఖండీ వృత్తాంతమును తలపింపజేయుచున్నది. అందు మొదటిదానిలో శివుడే 'సంగమ కారణ దూతయైన కలహంసగా యవనీ తలంబున కవతరించినాడు.' రెండవదానిలో శిఖండికి యీఖరి క్షణములో స్థూలకర్ణుడను గంధర్వునిచే పుంస్త్వ ప్రదానము చేయించి, కుబేరుని రాకచే యా గంధర్వుడు శప్తుడగునట్లుజేసి, శిఖండిని జీవితాంతము పురుషుని చేసినాడు. ఇది భగవత్కార్యము ! శివలీల ! అది యొకవేళ వెంగడమైన దానికేదో విశిష్ట ప్రయోజనమ్ముండును. దీనికి ప్రత్యక్షముగా బాహిరమైన కారణము కన్పడదు. ఈ హేతువు ఆంతరమైనది. అది బభ్రువాహనునిచే అశ్వమేధ పర్వమున అర్జునుని నరకలోక ప్రాప్తిని నివారించుట. ఇది సంప్రదాయాంత స్తత్వము. దీనిని సంపూర్ణముగా మననము చేసినవాడగుటచే చేమకూర పై పద్యమట్లు యల్లినాడు. ఈ 'వెంగడ' మను శబ్దమును (2—8) మరొక పద్యములో పేర్కొన్నాడు. ఇట్లు విజయునకు అకారణ మోహము గల్గుటకు కారణమేమి ? దీనికి భవభూతి కవితాత్త్విక శిరోమణి గావున యెప్పుడో సమాధానము చెప్పియున్నాడు.

శ్లో॥ 'వ్యతిషజతి. పదార్థానాంతరః కోఽపిహేతుః
నఖలు బహిరుపాధీన్ ప్రీతయ స్సంశ్రయన్తే
వికసతి హి పత జ్గ స్యోదయే పుండరీకమ్
ద్రవతి చ హిమ ర శ్మా వుద్గతే చంద్రకాంతః'
—ఉ. చ. 6—12

(వస్తువులను గూఢమగు హేతువు యేదో యొండొంటిం గూర్చును. ప్రీతి బయటి కారణములం బట్టి యుండదు. ప్రొద్దు పొడువగనే పుండరీకము పూచును. చంద్రుడు తోవగనే చంద్రకాంతము కరుగును.)

స్నేహము నిమిత్త సాపేక్షము గాదు. ఈ యహేతుక మిత్రత్వము, అవినాభావసంబంధము. తద్గత తాత్త్విక రహస్యము యిచ్చటి వాయికా నాయకుల యందున్నది. కవియే దీని తరువాతి పద్యమున నిట్లని యున్నాడు.

'వెల యుదయించు నప్పుడల నీరజముల్
కుముదంబు లౌను రేల్
కలువల దాయ రాకకు బగల్
కుముదంబులు నీరజంబు లౌ
దలపగ వింత వింత గలదా ?!'

అని యాశ్చర్య పడినాడు! మరి యిది మహాద్భుతము గదా !

ఒక సుభాషితము స్పష్టతము దీనినే చెప్పుచున్నది.

శ్లో॥ గిరౌ మయూరారా గగనే పయోదా
లక్షాంతరేర్కశ్చ జలేషు పద్మమ్
ఇందుర్ద్విలక్షం కుముదస్య బంధుః
యో యస్య మిత్రం న హి తస్యదూరం.'

(స్నేహమునకు దూరములేదు. కొండలమీది నెమళ్లకు ఆకాశమున మేఘమునకు స్నేహము. 'ఒక లక్ష' దూరమున నున్న సూర్యునికి నీటిలోని పద్మముంకు స్నేహము. 'రెండు లక్షల' దూరముననున్న చంద్రుడు కలువలకు యాప్తుడు.)

దీనికి కారణ మన్యూహ్యాము. కవి కుల గురువు కాళిదాసు మానవప్రకృతి యీవైచిత్రికి కారణ మూహించినాడు.

'...తచ్చే తసా స్మరతి నూన మబోధ పూర్వమ్
భావస్థిరాణి జననాంతర సౌహృదాని.'

(అ. శా. 5- 2)

అని మానవునిలోని యీ 'జీవుని వేదన'కు కారణము పూర్వజన్మ వాసనలను స్మరించుటవలన యనినాడు. భవభూతి దీనికి 'తారామైత్రకము' 'చక్షూరాగము' 'జన్మాన్తర నిబిడ బద్ధ పరిచయము' కారణము లనినాడు.

కావున తత్త్వరహస్యములను స్ఫురింప జేయు నటుల సూర్య పద్మ సంబంధమ్ము నర్లికజేసి చిత్రాంగదా విజయుల సంబంధమ్ము జన్మాంతర సంబంధమని తాత్త్వికపు పునాదిపై నిల్పి యుదాత్త శృంగారము ధ్వనింపజేసిన చేమకూర నేర్పు నిరుపమానము. కాంతా సమ్మితత్వ పద్ధతికిది నికషోపలము. చేమకూర క్షీణయుగములో చివరి మెఱుపు. తాను దర్శించిన సౌందర్యము (Beauty) ను సత్యము (Truth) తో ముడిబెట్టినాడు. దీనితో పద్యము భావగంభీరమై శృంగార ముత్తమ యువప్రకృతిక మను యాలంకారిక సత్య మన్వర్థమై కావ్యార్థమునకు మెఱుగు బెట్టుచున్నది.

2

మరియొక భావశిల్పమిట స్మరింపదగినది. ప్రకృతియందు స్త్రీత్వ మారోపించి సౌందర్యము నావిష్కరించు నైపుణ్యము మహర్షి వాల్మీకినుండి కవులందఱికి యామసూత్యముగ వచ్చు సంప్రదాయమే. భారతీయ సంప్రదాయములోని యనేక తాత్త్విక శిల్ప రహస్యములను కాళిదాస మహాకవి సుందరమైన కావ్య శిల్పములలోనికి పరివర్తన జేసియున్నాడు. ఆ యనంత శిల్పములలో ప్రకృతిని మానవీకరించుట, యొకటి. అందలి సౌందర్యా విష్కరణములో తరువాతి కవులు తమ 'ఆత్మీయత'ను ప్రదర్శించియున్నారు.

పై కవితా సంప్రదాయమును చేమకూర సైతము పాటించియున్నాడు. వాల్మీకినుండి రాయల వరకు పరిశీలించిన చేమకూరలో గల కవితా సంప్రదాయ మెంత ప్రకృష్టమైనదో విదితమగును.

శ్లో॥ 'చంచ చ్చంద్ర కరస్పర్శ హర్షోన్మీలిత తారకా
అహో! రాగవతీ సంధ్యా జహాతి స్వయ మంబరమ్.'

శ్లో॥ రాత్రి శ్శశాంకోదిత సౌమ్య వక్త్రా
తారాగణోన్మీలిత చారు నేత్రా
జోత్స్నాంశుక ప్రావరణా విభాతి
నారీవ శుక్లాంశుక సంవృతాంగీ.'

—శ్రీమద్రామాయణము.

మొదటి శ్లోక ముత్తేజితానురాగమైన కాముకీ వృత్తాంతము సూచించుచున్నది. 'అహో!' యను మాటలో తన్మయత్వము, భావోన్మీలత సాధింపబడినది. రెండవ శ్లోకమున 'రాత్రికాంత యుదయించిన చంద్రుడను వక్త్రముగఁదై తారాగణ చారునేత్రయై వెన్నెలయును ప్రావరణముగలదై శ్వేతాంబర ధారిణి యైన యంగనవలె భాసించు చున్నది.' అని చెప్పబడినది. ఇట్లు వర్ణించుట యంతర్ముఖుడైన మహర్షి యొక్క దార్శనిక ప్రతిభ.

కాళిదాస మహాకవి కావ్యశిల్ప మర్మజ్ఞుడు గాన ప్రకృతియందు లేని చేతనత్వము,చలనత్వము మానవతా దృష్టితో నారోపించి శాకుంతఁమున ఋషికుమారుని చే నిట్లనిపించుచున్నాడు.

శ్లో ॥ 'అంతర్హితే శశి నిశైవ కుముద్వతీయమ్
దృష్టిం ననందయతి సంస్మరణీయ శోభా

ఇష్ట ప్రవాస జనితా న్యబలా జనేన
దుఃఖాని మానమతి మాత్ర దురద్వహాని'
(అ. శా. 4—2)

ఈ శ్లోకము సౌందర్యమయము. కుముదమునకు స్త్రీత్వ మారోపించి 'కుముద్వతి' యనినాడు. నాటకమున 'కుముద్వతి' యనగానే శకుంతల మన మనోఫలకముపై భాసించును. ఈ శకుంతల విశ్వవ్యాప్తమైన స్త్రీత్వమునకు ప్రతీక (Universal Womanhood) దీనిని 'సంస్మరణీయ శోభా' యను మాటచే కవి యన్వర్థ మొనర్చినాడు. కావ్యపరముగా, ప్రకృతి పరముగా సంస్మరణముచే నీ భావన శోభావహమని కవి సూచన. ఇష్టజన విరహము రెంటను సమానము కావున మహాకవి యీ శ్లోకమున రసశిల్పముతోబాటు విశ్వజనీన సత్యము (Universal Truth) నావిష్కరించినాడు.

దిఙ్నాగాచార్యుడు తన కుందమాల నాటకములో సూర్యపద్మ సంబంధమును విరహ వర్ణనముతోడనే చెప్పియున్నాడు.

శ్లో॥ ప్రియజన రహితా నా మాంగులీ భిర్యధానా
మవధి దివసి సంఖ్యా ప్రతాభః సహైవ
వ్రజతి కిరణమాలిన్య స్తమేకైక శోష్మిన్
సరస కమల పత్రశ్రేణయః సంకుచంతి
(కుం. 4–22)

అని నాటకమున విదూషకునితో శ్రీరామచంద్రుడనుచున్నాడు. విజయ విలాస పద్యముకూడ సఖుడైన విశారదునితో విజయుడు చెప్పినదే. పై శ్లోక భావము వట్టిదే. సూర్యుడు అస్తాచలముపై పోగ తన భర్త దూరదేశాంతర గతుడైన తఱిని ప్రోషిత భర్తృకయైన నాయిక యొకటి. రెండు దినములు లెక్కించు విధమున తామరరేకు లొకటొకటిగా ముడుచుకొనుచున్నవి. అట్లే సూర్యుడు కిరణోప సంహారము చేయుచు యస్తమించుచున్నాడు. ఇంతటి లెక్కించు విధానమును తామరరేకుల చలనమున చూపించుట దిఙ్నాగుని కల్పన. కథాపరముగానిది సీతాదేవి విరహమును స్ఫురింపజేయుచున్నది. విజయ విలాసమందలి పద్యములోను చిత్రాంగదా విరహము ధ్వనితము. కాని యివి నాయకుని ముఖతః చెప్పించుట కవి శిల్ప నైపుణ్యము.

గురుకుల క్లిష్టుడు, ప్రశస్త వాగ్విలక్షణుడైన మురారిభట్టు తన యనర్ఘ రాఘవ నాటకమున నిట్టి వర్ణనమునే చేసియున్నాడు.

శ్లో॥ ఏకద్విత్రి చతుః క్రమేణ గణనా
మేషా మివాస్తంగతాం
కుర్వాణా సుముకోచయద్ద శ
శతాన్యం భోజ సంవర్తికాః
భూయోశ క్రమశః ప్రసార యతి
తా స్సరప్రత్య మూద్యత
స్సంఖ్యాతుం సకుతూహలేవ
నళినీ భాస్వ స్సహస్రం కరాన్
—అ. రా.

కనుచాటగుచున్న సూర్యుని వేయి కిరణములను క్రమముగా లెక్కించుచున్నట్లు తమ్మి వేయి రేకులు సాయంవేళ ముడుగును. వేకువను తిరిగి లెక్కించుచున్నట్లొక్కొక్కటిగా విడును. ఇందుకు రేకులకు లెక్కించు విధానము సచేతనముగ నుత్ప్రేక్షించుట గమనార్హము.

పై కవులందు ఊహా నిర్మాణము, భావవిన్యాసముచే శిల్ప సౌందర్యము సాధింపబడినది. కాని కాళిదాస మహాకవి కుమార సంభవమున గౌరీ కల్యాణ ఘట్టములో గౌరి మునుల ముందు నిలుచుకొని తన తండ్రిచే వివాహ విషయమును విను సందర్భమున—యిట్లనినాడు.

శ్లో॥ 'ఏవం వాదిని దేవర్షౌ పార్శ్వే పితురధో ముఖీ
లీలాకమల పత్రాణి గణయామాస పార్వతీ'
(కు. సం. 6–84)

'...అల్లనల్లన లెక్కించుచు నుండె పాణి సవలీలా పద్మ పత్రంబులన్' అని శ్రీనాథుని హరవిలాసము. ఈ క్రియ పార్వతీదేవి హృదయ శోభమాత్రము,

ముగ్ధత్వము తెలుపుచున్నది యామె మనోభావములగు అవహిత్థ, వ్రీడ యను సంచారి భావములను వ్యక్తమానము చేయుచున్నవని మల్లినాథుల వ్యాఖ్య. పై నుదహరించిన శ్లోకములందును, ఈ శ్లోకములోను 'తెక్కించుట' యను క్రియ సమానమైనను యిట నిది కేవల యాంత్రికమైనది. భావగోపనమునకై స్త్రీ యొనర్చు అజ్ఞాయుత చేష్టలోనిది వర్ణన సేంచినది. కాని మిగిలిన శ్లోకములలో ఈ గణనమను క్రియ ప్రకృతి సహజమైనదానిని శిల్పముఖముగా చెప్పుటలోనిది.

ఇక శిల్పపు లేమగుతోటయైన తిక్కన యెంతటి కళావిదుడో ఈ క్రింది పద్యము తెల్పుచున్నది.

'తన కరముల్ విగిడ్చి యుచితంపు మెయిం
గొనియాడి యంతటం
దనియక లీల కేరి నముదంబుగ
బద్మిని బొందె భాస్కరుం
డనుటకు దావలంబయి జనాధిప
చూడ సమంత పంచకం
బున విరిదమ్మి తీవియల బొల్పెసగెం
బ్రతి బింబ మెంతయున్'

—కర్ణపర్వము

ఇందున సూర్య—పద్మ సంబంధము చెప్పబడినది. అది యెట్లున్నది? హృదయ విదారకమైన యుద్ధ రంగములం దిట్టి మనోహర వర్ణనము చేయుట తిక్కన గారికే చెల్లును. భారతమున ప్రధాన రసము శాంతము. దాని నక్కడక్కడ కవి పోషించవలెను. ఇది రస సూక్ష్మము నెఱిగిన మహాకవియే నిర్వహింప గలడు. లేకున్న వీర-రౌద్రములు విజృంభించి ప్రధానరసము దెబ్బతినును. తిక్కనగారు మహారససిద్ధివేత్త.

ఇట్టి రస సూక్ష్మముల నెఱిగినవాడే యనన్య కృతి ప్రబంధుడైన శ్రీ కృష్ణదేవరాయలు కూడ. ఆతడు ప్రకృతి సౌందర్య పిపాసువు. తాత్త్విక, రస రహస్య వివేచనశీలి. గ్రీష్మర్తు వర్ణనములో—

'అతివృష్టిమ్మును వార్ధి గూర్చు
నెడకాడొలం దముం గూర్చు న
వ్మతి లంచంబుగ హేమటంకములు
మింటం బొల్చు పర్జన్య దే
వత కీ నెత్తిన కేలనా బొలిచె
నిర్వారి స్రవంతి న్వయ
శ్చ్యుతి న్నమచ్చద దృశ్య కర్ణికములై
యున్నాళ నాళీకముల్.'

—(ఆము. 1—52)

ఈ పద్యమునందలి రసశిల్ప మనన్యమైనది. గ్రీష్మ మతిశయించుటగ మేఘుడు వర్షించెను. సముద్రమునకు నదులకు సంధానము చేసెను. మరల నాలాగు చేయునని పద్మములు పర్జన్యునకు లంచమిచ్చుటకై బంగారు నాణెములు చేతులంబట్టి నెత్తినవో యను నటులనుండు నదులయందున్న నీరింకగా కాడలు హస్తములవలెను రేకులు వేళ్లవలెను తమ్మిమధ్యగల దిమ్మ వరాలవలెను నొప్పుచుండెను.

ఈ పద్యము వ్యస్తముగా ఋతువర్ణనమందలి దయ్యైనను మహాప్రబంధ గతమైన నాయిక గోదాదేవి విరహారము సూచించుచున్నది. ఇట్టిది విప్రలంభ శృంగార పోషకమై యొప్పునట్లు వ్రాయుట కష్టము. పైగా కవితావస్తు వెట్టిది? కవి మనోహర భావ పరికల్పనకు పుష్టిని, సౌష్ఠవమును గూర్చినది కేవలమొక ఎండి తామరకాడ. ఎండకు వడలిన పుష్పము. దీనినుండి కవి రసశిల్ప మావిష్కరించినాడు. ధనంజయుని 'రసవ్యంజాగుప్సిత...' ఆనంద వర్ధనుని 'శృంగారీ చేత్కవిః...' 'భావాన చేతనానపి..' ఇత్యాది శ్లోకములలో పై పద్యము సమన్వయించిన కవియొక్క ఆలంకారిక వేత్తృత్వము, తద్రహస్యము విదితమగును. పై పద్యమందలి భావము చేమకూర కూహాపద్ధతికి సన్నిహితము, ప్రోద్బలకము.

రాయల తరువాత చేమకూర వేంకటకవి లబ్ధ ప్రతిష్ఠుడు. కవులందరు పై విధముగా వర్ణించి యుండగా యిందు వేంకటకవి ప్రత్యేకత యేమి? శిల్పమనిన సృష్టి! అది ప్రతిభా సముద్భవము కదా! యనవచ్చును. దీనికి కవితా సంప్రదాయ మనుసరించుటలో తప్పు లేదనియే సమాధానము. కేవల మనుకరణ

ణము చేసినాడని చెప్పవా రిట్లు తృప్తిపడవచ్చును. 'Imitation begets pleasure' అనుకరణ జ్ఞానమే యానంద జనకము' అను నాంగ్ల సూక్తి ననుసరించి శిల్పమును కొంత యనుకరణము వలనను సాధింప వచ్చును. ప్రతిభావంతులైన వ్యాస, కాళిదాసాదులు వాల్మీకి ననుసరించి యున్నారు. 'Imitation is the only highest reverence that a poet shows on the other poet' అనుకరణమే యే కవియైనను పూర్వ కవిపై ప్రదర్శింపగల యత్యుత్తమ గౌర వము—అను సూక్తితో యే వాఙ్మయములోని కవి నైనను సమర్థింపవచ్చును.

ఒక చేమకూర ప్రదర్శించిన శిల్ప సౌందర్యము పరిశీలింతము. వేంకటకవి పూర్వకవులందరిని యనుస రించి యున్నాడు. పూర్వకవి గ్రంథ పఠనము తదర్థ మననము, స్వీయ ప్రతిభతో శాబ్దిక చమత్కారమును సైతము ప్రదర్శించి యున్నాడు. ఆతని అనుకరణ విధానమును మూడు విధములుగా విభజింపవచ్చును.

(1) మొదటి విభజనలో వాల్మీకి—భవభూతి—కాళిదాసుల యనుకరించుట.

(2) రెండవ విభజనలో కాళిదాసు—మురారి—దిఙ్నాగ—రాయల ననుకరించుట.

(3) మూడవ విభజనలో చేమకూర స్వీయ చమత్కార ప్రయోగము.

పై విభజన కనువుగా పద్య పాదముల నిటు విభజింపవచ్చును.

(1) 'తనకుం గౌగిలి యీ వొకప్పుడను నాథా! నీ కరస్పర్శనంబున గిల్గింతలె...'

(2) 'యంచు పద్మిని కరాంభోజమ్మునన్ మందమంద నటద్వాయు చలద్దళాంగుళులు సన్న ట్టంగ నవ్వేల్గ రాయని...'

(3) 'రా రా' యని పిల్చెనాదగె ద్విరే ఫాత్యంత దీర్ఘధ్వనుల్.'

మొదటి విభజనలో 'నాకు' అనుటకు బదులు కవి 'తనకు' యని వాడియున్నాడు. రాయలు సైతము ఆముక్త పంచమాశ్వాసమున 41, 48, 52, 54 పద్యములలో 'తాను పురవారాని' 'తన సౌందర్యము' 'తను నంటన్' 'తనకు నంధలు' యిత్యాదిగా వాడి యున్నాడు. 'నాకు' 'తనకు' అనుపదములు ఏకార్థద్యోత కములే యైనను నాగరికులు 'తనకు' అనియే వాడు దురు. 'తనకు' అనుటచే పద్మిని (చిత్రాంగద) మృదుస్వభావ సౌందర్యములు వ్యక్తము. వక్తయైన విజయుని మానసిక సౌకుమార్యము ద్యోతకము. నాథా! యనుమాట వాల్మీకి చెప్పిన 'అహో! రాగవతీ సంధ్యా' అనుదానిని కాళిదాసు చెప్పిన 'సంస్మరణీయ శోభా' అను మాటలలోని తన్మయత్వముతో తులతూగు చున్నది. ప్రకరణార్థమున శృంగార రసమును కది ప్రోద్బలకమై యున్నది.

'కరస్పర్శ' యనునదికూడ నిట్టిదే. ఇది వాల్మీకి శ్లోకములోని 'చంచచ్చంద్ర కరస్పర్శ' యను మాటను తలపించుచున్నది. 'గిల్గింతలె' యను మాట వాల్మీకియొక్క 'హర్షోన్మీలిత' యను మాటను సూచించుచున్నది. ఇది ప్రకరణోచితార్థమున సంభోగ శృంగారమందలి కిలికించిత చేష్టను స్పృశించు చున్నది. మరొక విధముగా చూచిన 'గిల్గింతలె' యను మాట 'వికసనము' యను నర్థమిచ్చును. ప్రకృ తిలో సూర్యకిరణములు పద్మముపై పడుటతోడనే దానియందొక విద్యుత్ప్రసరణ మయ్యదానితముగా ప్రస రించి పుష్పము హాసించునట్లు మెల్లగా రేకులు విచ్చుచున్నది. ఇది ప్రియురాలి (చిత్రాంగద) ముఖ పద్మ వికసనము. భావుకుడైన విజయుని హృత్పద్మ వికసనము. తత్ఫలితము సౌరభము. అనగా సంతో షము. కావుననే పిమ్మట ద్విరేఫము లత్యంత దీర్ఘ ధ్వనులతో చుట్టుముట్టినవి.

రెండవ విభజనమున 'పద్మిని' కాళిదాసు 'కుముద్వతి'ని తలపించుచున్నది. 'కరాంభోజము' అనుమాట సొగసైనది. కమలములవంటి చేతు కమలము లనెడు యని వాచ్యార్థము. అది నిజముగా అంభోజమే. దానిని 'కర' మనినాడు.

తిరిగి కరాంభోజమనుట సౌందర్యమును సౌందర్యతర మొనర్చుట. 'దశాంగుళులు కన్పట్టంగ' అను మాట రాయ లనిన 'దృశ్య కర్ణికములై' యను మాటను స్ఫురింప జేయుచున్నది. 'వెల్గ్గరాయని' యను మాట సాభిప్రాయమైనది. 'రాయ' శబ్దము శ్లేష వాచకము విశిష్టార్థ ద్యోతకము. 'రాజ' శబ్దమే 'రాయడు'గా 'తేడు'గా మారినది. శృంగార పరముగా 'రాయ' శబ్దమందు 'రతి' 'ప్రీతి' ద్యోతక మగు చున్నది. ఆముక్తమాల్యద పీఠిక 14 పద్యములో ఆంధ్ర మహావిష్ణువు '...అప్పిన్నది' అని చెప్పిన మాటలో నాయకునకు నాయికపై గల 'రతి' భావము వ్యక్తమగుచున్నదని డా॥ కోటీశ్వరరావుగారు నిరూపించియున్నారు. అదియే యిచటను వన్వయించును. 'వెల్గ్గరాయని' అనగా 'సూర్యు డనెడు తేజః సహితు డగు రాజును' అని యర్థము. కావున 'వెల్గ్గరాయని' లోని ప్రత్యక్షరము నాయికకు నాయకునిపై గల 'రతి' భావమును గూఢముగా వ్యంజింప జేయుచున్నది.

మూడవ విభజనము చేమకూర స్వీయ చమత్కారమునకు నిదర్శనము. దీనిని శ్రీ తాపీ ధర్మారావు గారు తమ వ్యాఖ్యలో పుష్కలముగా యావిష్కరించి యున్నారు. దాని నట చూచుకొనవచ్చును.

## 3

స్థిర పదార్థ, చర పదార్థ, ప్రాణుల మానసిక స్థితి వర్ణనలలో యొకదానికంటె మరియొకటి కష్టతరము ఇవి వరుసగా దేహ, మనః, హృదయ దశలకు సంబంధించినవి. 'ఏ కళయందు సౌందర్యము చలించునో అది 'గుణాతిశాయి' యని చెప్పవచ్చును. చలనము సౌందర్యమునకు మోహనత్వము నాపాదించును. విశ్చల జలపూర్ణమైన యొక సరస్సు విచ్చిన తామర పూలతో నిండి చూచుట కెంతో సుందరముగా నుండును. తలవని తలంపుగా యొక సన్నని మంద వాయువు వీచి యా సరస్సులో చిన్నచిన్న కెరటములు పుట్టింపగా యా నీటి కదలికతో తామర లూగు చుండగా నా సరోవర సౌందర్యమంతయు చలితమై యంతకు ఘుందులేని మోహనత్వము దాల్చును. ఈ యతిశయానందమునకు కారణము సౌందర్య చలనము' అని సాహిత్య శిల్ప సమీక్ష చెప్పుచున్నది.

వేంకట కవి పద్యమందు సరోవరము గలదు. తామరలు గలవు. 'మందమంద నటద్వాయువులు' గలవు 'చలద్దశాంగుళులు గలవు. ఇట్టి ప్రకృతి సహజత్వమున సుందరమైన హృద్గత భావ మ్మారోపితమైనచో నెట్లుండును? బంగారమునకు తావి యబ్బినట్లుండును. చేమకూర పద్యమందు చలనాత్మక సౌందర్యము గలదు. స్థిర పదార్థ స్వభావములో ప్రాణి మానసిక భావము ప్రతిక్షేపించినచో చలనాత్మక సౌందర్యం (Dynamic Beauty) ముద్భవించుచున్నది. విన్యాస వైవిధ్య మనునది (Dynamic Pose) ఏకైక విన్యాసము (Static Pose) కంటె కష్టతరము. చిత్రకారుడు రెండవదే గీయగలడు. కాని కవి మొదటి దానిని శబ్ద చిత్రణమున నిపుణముగా ప్రదర్శించ గలడు.

పాత్ర మనస్తత్త్వానుగుణముగా ఛందము మత్తేభ విక్రీడితమే యైనది. విజయుడు జితకాశి. ఆతని వీర లక్షణ మెచ్చటికి పోవును? ఇదియే చిత్రాంగద చెప్పియుండినట్లైనచో కవి యుత్పల, చంపకములను వాడియుండెడివాడు. పద్యము యుదార మధుర భావము కలది గావున మత్తేభము వాడినను మందమంద నటద్వాయువుల వలె నడచినది. మొదటి రెండు పాదములలో దీర్ఘాక్షరములకు యతిచెల్లుటచే పద్య మంతటికి సమాహార భావమైన పిలుపు, ప్రార్థనము యిత్యాది భావము నన్వర్థ మొనర్చుచున్నది. రెండవ పాదమున 'భో'కు యతి (కరాంభోజమున) చెల్లుటలో పద్మిని చేయెత్తి పిలుచుటను సూచించుచున్నది. మందమంద నటత్ వాయు చలత్ దశాంగ్ గుళులు' అను మాటలను ఊనిక (stress) తో చదివిచో మృదంగముపై ముక్తాయింపులవలె సొగసుగా మృదంగ తాళముల స్ఫురింపజేయుచున్నది.

పై పద్యమునందలి పద్మమును ప్రబంధమున కవి మూడు చోట్ల నిక్షేపించినాడని ముందే చెప్ప బడినది. ఉలూపీ వృత్తాంతమునకుముందు నీ పద్మము

గంగానదిలో నున్నది సమయము ప్రాతఃకాలము. పద్మమప్పుడే మెల్లగా విచ్చుకొనుచున్నది. దానియందలి నల్లని తుమ్మెదలు స్నానమాచరించుచున్న వారి పాపములవలె యెగిరిపోవుచున్నది. ఆ పద్మమే చిత్రాంగదా వృత్తాంతమున పునర్దర్శన మిచ్చినది. అది వికసిత పద్మము. చిన్ని వాళ్ళగనోయట్లు వికసించి తిరిగి ముకుళించుకొని పోవుచున్నది. ఆ పద్మిని విరహిణి. ఆమెయే చిత్రాంగద. కవి సూర్య పద్మ సంబంధము నిరూపించి చిత్రాంగదా యభిలాషను పరోక్షముగా వ్యక్తపరచినాడు. ఈ పద్మముతోడనే తిరిగి కవి సుభద్రా వివాహాలంకరణము పోల్చినాడు.

'...తమ్మిపూ ముద్దియ గద్దియం బొలుచు
ముద్దియ యుద్దియనన్ శుభోన్నతిన్'

ప్రబంధ ప్రారంభమున 'హాటకాంబురుహ చంచచ్చంచరీకోత్కరములు' ఆకాశగంగయందున్నట్లు కవి చెప్పినాడు. అవి హిరణ్మయ పదములు. సామాన్యములు గావు. ఉలూపి వృత్తాంతమున వికసించినవి భూలోక గంగానదీ పద్మములే. అవి యప్పుడే వికసించి ప్రబంధ మధ్యమున వెల్గురాయనిపై యమరక్తిని వహించి ప్రబంధాంతమున పద్మస్థిత లక్ష్మీదేవివలె విలసిల్లినది. గంగానదిలో వికసించిన పద్మము ఉలూపి. ఆమె సంజవేళలో విజయునిపై మాయను ప్రయోగించి కొనిపోయినది. సంజవేళలోనే గదా తుమ్మెదలు పద్మమున చిక్కుపడి పోవును. అర్జునుని విషయమునను యట్లే జరిగినదని ధ్వని. ఇక రెండవ పద్మము చిత్రాంగదయని చెప్పనవసరము లేదు. మూడవ పద్మముపైనున్న లక్ష్మి సుభద్రయే. ఆమె పద్మ కర్ణిక కొలువున్న పద్మవోలె నున్నది. దీనిచే కవి సుభద్రా వివాహమునకే ప్రథమస్థాన మొసగినట్లు తెలియుచున్నది. ఏలన ప్రబంధ ప్రారంభ పద్యమున 'చంద్ర ప్రస్తర సౌధశేలన పరశ్యామ'లను కవి చెప్పినాడు. వారెవరోకాదు. ప్రబంధమందలి ముగ్గురు నాయికలే. అచ్చట ఆకాశగంగ—బంగారు పద్మములు తుమ్మెదలు గలవు. ఉలూపి—చిత్రాంగదా విషయముల తోడ యివి గలవు. కాని సుభద్రా విషయమునందు సరికి కవి సూటిగా పద్మాసనియైన లక్ష్మితోడకు సుభద్రను పోల్చుటచే తుమ్మెదలు మాయమైనవి. దానితో సుప్రతిష్ఠిత నాయిక సుభద్రయే. ఆ పద్మమే హిరణ్మయ పద్మమని విదితమగుచున్నది. దీనిని కవియే మరియొక చోట చెప్పియున్నాడు.

(3–229) 'కలుముల్ కన్నుల జిల్కు కల్కి మరునిం గన్నట్టి చందాన...'

కలకంఠీకుల రత్నమైన సుభద్ర కులదీపకుడగు అభిమన్యుని గనెనట! దీనిచే ప్రబంధ సామాజిక దృష్టితో నాయకుడు—అర్జునుడు, నాయిక—సుభద్రయని నిర్ధారితమగుచున్నది, విజయ విలాసమునకు సుభద్రా కల్యాణమను నామాంతర మేర్పడుట కిదియొక కారణము గాబోలు!

ఈ పద్మ విషయము ఉత్తరోత్తరోత్కర్షగల్గి సుభద్రా వివాహము వచ్చునప్పటికి పద్మాసనియైన లక్ష్మితోడను, పిదప లక్ష్మిమరుని గన్నట్టి విధము తోడను పోల్పబడుటచే కవియాది మధ్యాంతముల నిర్వహించిన శిల్పనైపుణ్యము, సమన్వయ మార్గము వ్యక్తమగుచున్నది.

ఉలూపి వివాహముకంటె చిత్రాంగదా వివాహముత్తమమైనది. చిత్రాంగదా వివాహముకన్న సుభద్రా వివాహము విశిష్టమైనది. ఉలూపి ప్రౌఢ, చిత్రాంగద ముగ్ధ. సుభద్ర మధ్య. ఉలూపీ చిత్రాంగదా వివాహముల వెనుక భగవత్ప్రచోదనా రహస్యమున్నది. ఇటు నాయికానాయకులు కేవల నిమిత్తమాత్రులే. భగవత్సంకల్పము నిర్విఘ్నముగా ప్రవర్తించినది. ఇక సుభద్రా వివాహము సాక్షాత్ శ్రీకృష్ణ పరమాత్ముడే జరిపించినాడు. ఈ వివాహము చేతనే పాండవ వంశాభివృద్ధియు జరిగినది. లీలామానుష విగ్రహుడు జరిపించిన వివాహము గాన బహుచమత్కారముగా ప్రవర్తిల్లినది. ఇట్లను ప్రధాన నాయిక సుభద్రయే. ఈ ప్రబంధములో గర్భీకృతమైన వివిధాంశములను తద్రహస్యములను సంపూర్ణముగా మరికొన్ని వ్యాసములలో నావిష్కరింతుము. ప్రస్తుత మిట చేమకూర సంప్ర

దాయ వాసనలు గల్గినవాడని, ప్రబంధ వినిర్మాణ దక్షుడని గ్రహించిన చాలును.

ఇంతకు నీ పద్మ మనగా నేమి? మన సారస్వతము సర్వము విచారించినచో విష్ణునాభి పద్మము. బ్రహ్మ పుట్టినది పద్మమునందు. హృదయము పద్మము, లక్ష్మీదేవి పద్మమునుండి పుట్టినది. ఈ పద్మము యొక్క నిజమైన యథార్థమేమో తెలియదు. ఒకటిగా భాసించుచున్నది. ఇది సర్వజ్ఞానముయొక్క జనిస్థానము. సర్వజ్ఞానము దేనినుండి పుట్టుచున్నది? తపస్సునుండి పుట్టుచున్నది. తపస్సు మృణాళ నాళాంకురము. అయథార్థమైన జగత్తు అహి వంటిది. తపస్సు మృణాళనాళము వంటిది. దీని చివర మున్నది పద్మము. ఆ పద్మమే సర్వజ్ఞాన భూమి.

శ్లో॥ ఈశానాం జగతో஽స్య వేంకటపతే
ర్విష్ణోః పరాం ప్రేయసీమ్
తద్వక్షస్స్థల నిత్యవాస రసికాం
తత్క్షాంతి సంవర్ధనీమ్
పద్మాలంకృత పాణి పల్లవ యుగాం
పద్మాసనస్థాం శ్రియమ్
వాత్సల్యాది గుణోజ్జ్వలాం
భగవతీం వందే జగన్మాతరమ్.

---



# అనలధ్వజం

శ్రీ కె. శివారెడ్డి

మంట నా కిష్టం
మండటం నా ధ్యేయం—
రక్తం అంటేమంటే
మండటం నా బతుకు.

ఒక జాతి బతుకు అడుగంటటాన్కి కారణం
సెగ ఎక్కువయ్యికాదు - అసలు సెగలేకనే—
రాత్రిని కప్పుకుంటాన్ని ఒప్పుకున్నజాతి
నుదురెప్పుడూ మంచుగడ్డే—
పాలిపోయిన మంచు మదుళ్లకింద
పిరికితనం ప్రవహిస్తుందే మోకానీ
ధైర్యంశాంటి రక్తం,
మండే ఉదయంలాంటి రక్తం
స్పందించి నేత్రం విప్పదు

శత్రువుకీ చీకటికీ మంట ఇష్టముండదు
కోటి చేతులెత్తి ఎగబడే
అణు హృదయ సూర్యబింబమూ ఇష్టముండదు--

నా కిష్టం మంట
నా ధ్యేయం మంట
నా రక్తం మంట
నా బతుకుమంట

నా తరం బతుకు శ్వాసమంట
రాత్రినీ రాత్రించరుల్నీ దహనం
చేసే మంట
ఈ యుగపు పంట

# సిగిరెట్టు

## శ్రీ కె. ఎస్. వి. నరసింహామ్

మురారికి చాలా ఇబ్బందిగా ఉంది.

తల తిరిగి పోతోంది.

ఉక్కిరి బిక్కిరిగా ఉంది. మెదడంతా శూన్యంగా ఉంది. ఏం చెయ్యడానికీ తోచడం లేదు.

గదంతా చాలా ఇరుకైపోయినట్లనిపిస్తోంది. గదిలోని వస్తువులన్నీ వాటంతటవే కదిలి ఒక దానితో ఒకటి కొట్టుకుని అంతా గజిబిజి అయిపోతున్నట్టుంది.

కిటికీ ప్రక్కనే ఉన్న కుర్చీలో దిగాలుగా కూర్చున్నాడు మురారి.

ప్రహరీ గోడమీద పిచి కొకటి కూర్చుంది. ఇంకో పిచిక (బహుశా అది పెంటి కాబోలు) దాని చుట్టూ బుర్రుబుర్రు బుర్రుబుర్రు మంటూ తిరుగుతోంది. తమలో తాము కూడబలుక్కుంటున్నట్లు రెండు పిచికలూ కొంతసేపు కువకువలాడి, క్షణంలో బుర్ర్ర్రుమని గాలిలో పైకి లేచి, చిత్రంగా, ఒయ్యారంగా, దూరానికి ఎగిరి వెళ్లి, మాయమైపోయాయి.

పక్కింటి ప్లీడరుగారి పనిమనిషి, ఆరగట్టిన బట్టలు తీసి మడతలు పెడుతోంది. ఆ వెనుక కనిపించే బాదంచెట్టు కొమ్మల్లోంచి, సూర్యాస్తమయంతో ఎర్రబడుతోన్న ఆకాశం, ప్రకృతి దేవి పావటమీది కుంకుమబొట్టులా కనిపిస్తోంది. ఆ ప్రక్కన డాబా మీద, కాలేజీ స్టూడెంటొకడు, పిట్టగోడమీద వాలుగా కూచుని, వీధిలోంచి వినిపిస్తూన్న సినిమా పాట గ్రామఫోన్ రికార్డు సంగీతానికి అనుగుణంగా, లయబద్ధంగా ఒక కాలు ఆడిస్తూ, పారవశ్యంగా సిగిరెట్టు కాల్చుకుంటున్నాడు.

సిగిరెట్టు!!

మురారి తల తిప్పుకున్నాడు—

సిగిరెట్టు!!!

మురారికి ఇప్పుడర్జెంటుగా ఒక సిగిరెట్టు కావాలి, ఒక్కటంటే ఒకే ఒక్క సిగిరెట్టు—

ఏ బ్రాండ్దైనా సరే.

కాని, సిగరెట్టు ఎలా వస్తుంది? వెళ్లి తెచ్చుకోవాలి—

వంటింటి నేపథ్యంలోంచి పాత్రల చప్పుడు వినిపిస్తోంది. పాత్రల చప్పుడు సంగీతమైతే, అసలు పాటకూడా వినిపిస్తోంది. పాట పాడుతున్నది లీల. పాటంటే అది పూర్తిగా పాట కాదు. కేవలం కూని రాగం. నిజానికి పాటలుకూడా బాగా పాడగలదు లీల.

లీల పాటంటే మురారి కిష్టం.

లీలన్నాకూడా ఇష్టమే మురారికి.

ఇష్టపడ్డాడు కాబట్టే కట్నం తక్కువైనా ఆమెనే చేసుకున్నాడు.

ఎప్పుడు? ఏడాది క్రితం.

లీల మురారి యొక్క ధర్మపత్ని.

సహధర్మ చారిణి.

లీల అనే పేరు ఎంత మెత్తగా ఉందో, ఆమె, మనిషిగా అంత 'గట్టిది', అంటే ఆమె చూసేందుకు మొరటుగా, వస్తాదులా కనిపిస్తుందని కాదు. ఆమె మనసు చాలా గట్టిది. ముక్కుకు సూటిగా పోయే రకం. ఎంత ఘాటైనా ఫెడేల్మని ముఖమ్మీదే అనేసే రకం. ఇంక డబ్బు విషయం వచ్చిందా—

పైస పైసా, ఆలోచించి, బేరీజువేసి ఖర్చుపెట్టి, జమా ఖర్చుల జాపితా ఎప్పటికప్పుడు రాస్తూ. నెలాఖరున అవి సరిపోయేదాకా వేళ్లుమడిచి లెక్కలు వేసే రకం.

ఆడవాళ్లలోకూడా అఖండులుంటారని తన పెళ్లయేదాకా మురారికి తెలియదు. తెలిసొచ్చాక అతను చాలా ఆశ్చర్యపోయాడు. లీల తెంపరితనం ఆమె పొదుపరితనం, ఆమె జాగ్రత్తచూసి, మొదట మొదట చాలా హడలిపోయాడు. 'ఇంత కత్తిమీద సాములా (బతికే మనిషితో) కాపరం చెయ్యడం ఎట్లారా బాబూ'—అని కొంత బెదిరిపొయ్యాడు కూడా. కాని, అతని సందేహాలు అలా ఎన్నో దినాలు నిలవలేదు. భార్య కాపురానికొచ్చిన వారం రోజులకే ఆమె మనస్తత్వపు అసలు రూపం అతనికి అర్థమై పోయింది.

ఆమెకు మొగమాటం నచ్చదు. ఆడంబరాలు నచ్చవు. అతివ్యయాలు నచ్చవు. అన్ని విషయాల్లోనూ ఆమె ఖచ్చితమే! కాని, ఆమె మనసుమాత్రం మంచిది.

భార్య కాపురానికి వచ్చాక మురారికి జీవితంలో చీకూ చింతా లేకపోయాయి. తనకన్నా పొదుపుగా ఖర్చు పెడుతుందని, జీతం రాగానే అంతా ఆమె చేతుల్లో పోసేసేవాడు. ఇంటికీ వంటకూ అన్ని సరుకులూ తెప్పించడం, అవి సరిచూచుకోవడం, వాటి లెఖ్ఖలు వ్రాసుకోవడం—అంతా ఆమే! అంతా బాగానే ఉంది. అంతా సవ్యంగా ఉంది. కాని, మురారికొక తెగని చిక్కొచ్చి పడింది. అదేమిటయ్యా అంటే— సిగిరెట్లు!

అవును, మురారి సిగిరెట్లు తాగుతాడు.

సిగిరెట్లు తాగం దెవరు? చాలామంది తాగుతారు. ఎంతోమంది తాగుతారు, కాలేజీ చదువుల వాళ్లు, కాలేజీ చదవనివాళ్లు, అన్నిరకాల కార్యాలయాలు, అన్నిరకాల ఉద్యోగులూ, అన్నిజాతుల వారూ, అన్ని మతాలవారూ—అందరూ సిగిరెట్లు తాగుతారు.

కాని, అందరూ తాగడం వేరు, మురారి సిగిరెట్లు తాగడం వేరు.

అదంతా చెబితే ఒక పెద్ద కథవుతుంది

—అని మురారి సిగిరెట్ల అలవాటు గురించి చెప్పకునే వీలులేదు. అందుకే మనం ఇక్కడ దాన్ని గురించి కొంచెం చెప్పకోవచ్చు.

అప్పుడు మురారి హైస్కూల్లో ఆరో ఫారం చదువుతూండేవాడు. అప్పటికే అతను తండ్రిని పోగొట్టుకున్నాడు. తల్లికి అతను ఒక్కగా నొక్క సంతానం. అందుచేత తల్లి అతణ్ణి గారాబంగా చూసుకునేది. అది వొట్టి గారాబం కాదు. అతి గారాబం. 'ఆడది తిరిగి చెడింది—మగవాడు తిరక్క చెడ్డాడు'—అనే సామెత ఆమెకు తెలుసునో తెలియదో గాని, ఆమె మాత్రం కన్న కొడుకును ఇల్లు వదలి కదలనిచ్చేది కాదు. ప్రొద్దున్న పదికి స్కూలుకు వెళ్లడం, మధ్యాహ్నం వచ్చి భోంచేసి వెళ్లడం, మళ్లీ సాయంత్రం అయిదు కొట్టేలోపల ఇల్లు చేరడం—అంతే కాని, మరింకే వేళల్లోనూ మురారి ఇంకెక్కడికీ తల్లి అనుమతి లేకుండా వెళ్లేందుకు వీలులేదు. తల్లి అనుమతితోనైనాసరే—వెళ్లే వీలుండదు—ఎందుకంటే తల్లి ఎన్నడూ అనుమతించేది కాదు కనుక!

నిజానికి, తల్లి అనుమతించడంతోనూ, అనుమతించక పోవడంతోనూ మురారికి ప్రమేయం ఉండేది కాదు. తల్లి అదుపాజ్ఞలు అవసరం లేని ప్రకృతి అతనిది.

లోకంలో కొన్ని విషయాలకు కారణా లుండవు. లేదా, కారణా లున్నట్లు కనిపించవు. అలాంటి విషయాల్లో మురారి ముభావం ఒకటి.

పుట్టి బుద్ధెరిగి నప్పటినుంచి మురారికి ముభావం అంటేనే ఇష్టం. అతనంతట అతను వెళ్లి ఇతరుల్తో ఎన్నడూ కలిసేవాడు కాదు. అతని ముఖంలోనే అలాంటి లక్షణం ఉండేవోగాని, అతని ఈడు పిల్లలు కూడా, అతన్తో ఎక్కువ కలిసుండే వారు కారు.

స్కూల్లో జరిగే ఆటల్లోగాని, దెబ్బలాటల్లో

గాని ఆతను పాల్గొనేవాడు కాదు. 'మేష్టార్లని వెక్కి రించే వాడు కాదు. అల్లర్లకి తన గొంతు ఏమాత్రమూ అరువిచ్చేవాడు కాదు. ఎప్పుడో ఎక్కడో ఏదో పారేసు కున్నట్టు, ఆ పారేసుకున్న దేమిట్టో కూడా మరిచి పోయినట్టు, అత నెప్పుడూ ఎందుకో దిగులుగా ఉండే వాడు.

కాని, ఇంతలా చిన్నతనపు టల్లరి చిల్లర తనాన్ని పట్టించుకోకుండా పెరిగిన అతని మనస్సులో ఆయా చాపల్యాల పట్ల కోరిక లేదందామా? ఉహుం— అలా అనేందుకు వీలులేదు.

తను నిశ్శబ్దంగా ఉన్నా, అందరి అల్లరీ గమ నించేవాడు. తను బుద్ధిమంతుడుగా ఉంటూ ఇతరుల ఆకతాయి తనాన్ని చూస్తూనే ఉండేవాడు.

ఆటలో పాలుపంచుకోకపోయినా, ఆటను మాత్రం ఉత్సాహంతో చూసే ప్రేక్షకుడిలా; అతను తోటిపిల్లల గందరగోళపు టల్లరిని గమనిస్తూండే వాడు.

ఆరో ఫారం పిల్లలంటే స్కూలుపిల్లల్లో 'మేజర్ల కిందే లెక్క. వాళ్ళుచేసే సందడికి అంతూ దరీ ఉండేవి కావు. కొందరు స్కూలుకని చెప్పి, స్కూలుకే వచ్చి, మధ్యాహ్నం మ్యాట్నీలకు చెక్కేసే వారు—మ్యాట్నీలకు చెక్కే పద్ధతులు రకరకాలుగా ఉండేవి. టీచర్లని పర్మిషన్లడిగేవారు కొందరు, 'ఇంట్లో బంధువులు వచ్చా'రనో, తమకే—తలనొప్పిగా ఉందనో—ఇలా ఏవో వంకలుపెట్టి పర్మిషన్లు కొట్టేసే వారు. కొందరు మెతక మాస్టార్ల క్లాసుల్లోనైతే (—సోడబుడ్డీ కళ్ళద్దాల హిందీ మాస్టారి క్లాసులో మరీని—) ఆటెండెన్సు వేసుకునే దాకా ఉండి, పాఠం మొదలుపెట్టేవేళకి, వెనక బెంచీల ప్రక్కగా నక్కుతూ మరో గుమ్మం గుండా నిష్క్రమించే వారు. మరీ కొందరు సాహసవంతులైతే, నల్లబల్లమీద రాసేందుకు మాస్టారు అటు తిరగ్గానే, ఎకాయెకి ముఖద్వారం గుండానే రైరెక్టుగా నిష్క్రమించేవారు. ఆడపిల్లలు క్లాసులు ఎగ్గొట్టడం అంతగా ఉండేదికాదు గాని, మగపి ... మాత్రం, సగానికి సగంమంది—వీలు వెంబడి క్లాసులు ఎగ్గొట్టి మాట్నీలు చూసేవారు. మ్యాట్నీలకు కాక, ఇంకొకందుకు కూడా కొందరు క్లాసులు ఎగ్గొటే వారు—అది—సిగరెట్లు తాగేందుకు!

స్కూలు పిల్లల అల్లరి మూకల్లో, క్లాసు లెగ్గొట్టి మ్యాట్నీలు చూసేపాటివాడు సామంతరాజైతే, సిగరెట్లు తాగేవాడే రాజు! 'సిగరెట్లు తాగడం, స్కూలు జీవితంలో ఒక ఘన కార్యం. దమ్ములున్నవాడే రౌడీ, వాడే రాజు. మరి దమ్ములు లేనివాడు సిగరెట్లు కాల్చలేడు కదా!

మురారి క్లాసులో ఒక పదిమంది పిల్లలు మహాజోరుగా సిగరెట్లు తాగుతూండేవారు. టీచర్లంద ర్లోకీ అతిభయస్థురాలైన సోషల్‌స్టడీస్ టీచర్ క్లాసులు అలవాటుగా ఎగ్గొడతూండేవారు. స్కూలు దొడ్డి గుమ్మాని కవతల బ్రహ్మాండమైన తోట ఒకటుండేది. దాన్లోపల పగలుకూడా రాత్రిలా ఉండేది. ఎండైనా అతికొంచెం కొంచెం మాత్రమే లోపలికివస్తూ, 'అది ఎండా లేక వెన్నెలా?' అని పించేలా ఉండేది. క్లాసు ఎగ్గొట్టే ముఠా అంతా అందులోకి చేరడం, చెట్లకొమ్మలమీద ఒక్కొక్కడూ ఒక్కొక్క శేషశాయిలా శయనించి, ఊసులు చెప్పు కుంటూ బూతులు తిట్టుకుంటూ వరస వరసగా సిగిరెట్లు కాల్చడం—అదీ అక్కడ జరిగే కార్యక్రమం.

మురారి ఆ తోటలోకి ఎన్నడూ వెళ్ళలేదు. ఒకనాడు వెళుతూ వెళుతూ ఒక మిత్రుడు హృదయ పూర్వకంగా ఆహ్వానించినా, రానని భయం భయంగా సమాధానం చెప్పాడు ఆ తోటలో జరిగేదేమిటో మురారికి తెలుసు.

సిగరెట్లు కాల్చడమంటే అదేదో మహాపరాధ మని (పెద్దలు చెప్పడంచేత) మురారి భావిస్తూండే వాడు. సిగరెట్లు తాగేవాళ్ళ 'చెడిపోతా'రని కూడా పెద్దలు చెప్పడం చేత, చెడిపోవడమంటే ఏమిటో ఎరగని మురారికూడా 'మనుషులందరూ చెడిపోకుండా ఉండాలి' అని భావించేట్టు, సిగరెట్లనే వాటిని అంట రాని వస్తువులుగా ఎంచుతూండే వాడు.

నిర్బంధాలనేవి ఎప్పుడూ ఒక నవివట్ల ఉత్సుకతను అధికం చేస్తాయేగాని, తగ్గించవని మురారికి తెలియదు. అందుచేతనే, సిగిరెట్లును అంటరాని వస్తువులుగా తను భావించే కొద్దీ తనకు తెలియకుండా తనలో వాటిపట్ల ఆసక్తి ఎక్కువైపోతోందని చాలా దినాలవరకూ మురారికి తెలియదు. తీరా తెలిసొచ్చేసరికి అతనికి సిగరెట్లపట్ల కేవలం ఆసక్తే కాదు, (ఒక్కసారి సిగిరెట్టు తాగి చూడాలనే) కోరికకూడా పుట్టుకొచ్చేసింది. అప్పటికి అతనిలో శతధా గింజాకుంటున్న సందేహం ఒక్కటే— తన మిత్రులంతా ఇక్కడ—స్కూలు వెనక — తోటలో సిగిరెట్లుతాగుతున్నారన్నసంగతివాళ్ల వాళ్ల తల్లిదండ్రులకి తెలుసా?తెలిస్తే వాళ్లు తాగనిస్తారా? సిగిరెట్లు తాగే వీళ్లనోళ్లు కంపుకొట్టవా? వీళ్లు పెద్దలెదుట మాట్లాడేప్పుడు ఆ సంగతి బయటపడిపోదా? — ఇలాంటి ప్రశ్నలు మురారిని చాలా వేధించేవి. ఈ ప్రశ్నలైనా తనకు కలగడానికి తల్లి అంటే తనకున్న భయం, లేదా తల్లిపట్ల తనకున్న విధేయత—కారణం అని మురారికి తెలియదు. సిగిరెట్లు తాగే మిత్రుణ్ణి ఒకనాడు కదిలించి, చల్లగా సంగతులు వెలుపలికి లాగాడు మురారి'—'నువ్వు తోటలో సిగిరెట్లు తాగుతావని మీ ఇంట్లోవాళ్లకి తెలీదురా?'—, అని అడిగాడు.

'ఊఁ హుఁ—తెలీదు—ఎవరొచ్చి చూస్తారు?'

'చూడకపోతేనేం—నీ నోరు వాసన కొట్టదూ?'

మిత్రుడు నవ్వేశాడు —'ఆ మాత్రం తెలీదురా మురారిగా?—సిగిరెట్లు తాగేశాక, స్కూల్ పంపు దగ్గర నోరు కడుక్కునేస్తాంగా—ఆ తరువాత—కొంచెం వక్కపొడి కూడా నమిలేస్తాం—అంతే—ఇంక వాసనా గీసనా జాన్తానై—'

సిగిరెట్టు వాసనను పోగొట్టే సాధన మేమిటో అలా తెలుసుకున్నాడు మురారి. దుర్గంధాన్ని మూపడానికి ఒక సుగంధం— అంతే సూత్రం!

సిగిరెట్టు కాలిస్తే ఎలా ఉంటుంది?—ఆ ప్రశ్న మురారి మెదడులో ఎంతగానో తిరుగుతోందల్లా, సిగిరెట్టు గురించిన కొత్త పరిజ్ఞానంతో కొత్త ధైర్యం లభించింది. సిగిరెట్టు కాలిస్తే ఎలా ఉంటుందో తెలియాలంటే మరో మార్గం లేదు—సిగిరెట్టు కాల్చి చూడాలి!! అసలింతకీ సిగిరెట్టు కాల్చడ మెలా?— అదేం బ్రహ్మవిద్యా? కాదు. ఇతరులు సిగిరెట్లెలా కాలుస్తారో ఇంతకుముందు చూసే ఉన్నాడు మురారి.

మొదట ధైర్యం చాల్లేదు. ఎవరైనా చూసి తల్లికి చెబుతారేమోనని ఒక వంక భయం, ఎలాగైతేనేం ఒకనాడు తెగించాడు మురారి.

ఆ దినం ఆఖరు పీరియడు మాస్టారు రాలేదు. లైబ్రరీ కెళ్లి చదువుకొమ్మని పిల్లల్ని వదిలేశారు. ఆ దినం కొత్త మ్యాట్నీ రావడంచేత ఆకతాయి ముఠా సభ్యు లెవరూ అప్పటిదాకా ఇంకా స్కూల్లో లేరు.

ఎలాగో, స్కూల్ కాంపౌండ్ నుంచి బయట పడ్డాడు మురారి. అటుప్రక్కని సందుమొగలో ఉన్న బడ్డీదగ్గర ఆగాడు. సిగిరెట్టిమ్మని బడ్డీవాణ్ణి అడిగాడు.

'ఏ సిగిరెట్టు?'

సిగిరెట్లలో రకాలుంటాయని అప్పటిదాకా తెలీదు మురారికి. అందుచేత, బడ్డీవాడి కేం చెప్పాలో వెంటనే తోచలేదతనికి. క్షణం ఆగి ఏదో ఒక సిగిరెట్టిమ్మన్నాడు. బడ్డీవాడు తనని నిందిస్తాడేమోనని చెప్పరాని భయం ఏదో కలిగింది మురారికి. కాని అలాంటిదేమీ జరగలేదు. సిగిరెట్టు, అగ్గిపెట్టె, వక్కపొడి పొట్లాం —మూడూ తీసుకున్నాడు మురారి. మూడూ చప్పున పుస్తకాల సంచీలో పెట్టేసుకుని, కాంపౌండ్ వెంటే నడుస్తూ స్కూలు వెనక భాగం చేరుకున్నాడు.

జడలు విరబోసుకున్న బూచాడిలా ఉందప్పుడు తోట. తెలియరాని భయం కలిగింది మురారికి. కాని, చేతిలో ఉన్న సంచి, సంచిలోని సిగిరెట్టు, వింతగా తొందరపెట్టాయి.

సిగిరెట్టు కాలిస్తే ఎలా ఉంటుంది?

ఆ అనుభవం ఏమిటో తెలుసుకోవాలనే ఆరాటం అంతకంతకూ అధికమౌతోంది. ఆ ఆరాటం ముందు అంత భయమూ ఏమైందో ఎటు పారిపోయిందో, పారిపోయింది.

ధైర్యవంతుడు కానివాడికైనా ధైర్యం, ఏదో ఒక ధైర్యం, కనీసం మొండిధైర్యం, కలిగించే క్షణాలు అవి.

మొండిధైర్యంతోనే తోటలోకి ప్రవేశించాడు మురారి. ఇన్ని దినాలుగా స్కూల్లోనే ఉంటున్నా ఇంతకు ముందెప్పుడూ కాలుమోపని చోటు అది.

ఆ దినం కొత్త మ్యాట్నీ కావడంచేత, అలవాటుగా అక్కడికి వచ్చేవాళ్ళంతా మ్యాట్నీకి వెళ్ళిపోవడం చేత కాబోలు, తోటంతా నిర్మానుష్యంగానూ నిశ్శబ్దంగానూ ఉంది.

తడబడే అడుగులతో వెళ్ళి ఒక మామిడిచెట్టు మొదట్లో కూచున్నాడు మురారి. ఒక్కసారి తోటంతా కలయజూశాడు. పంచెలోంచి సిగిరెట్టూ, అగ్గిపెట్టీ తీశాడు.

ఎలా అంటించుకోవాలి?

అందరూ సిగిరెట్టు నోట్లో ఉంచుకుని, అగ్గిపుల్ల వెలిగించి, దాన్ని సిగిరెట్టు దగ్గరికి తీసుకుని, అంటించుకోవడం అతను చూశాడు.

తనకలా చేతకాదని ఎందుకో అతనికి తోచింది.

ఇంకెలా వెలిగించుకోవాలి?

దేవుడిపటం ముందు తల్లి సాంబ్రాణికడ్డీలు వెలిగించడం గుర్తొచ్చింది మురారికి.

అలాగైతేనేం—సిగరెట్టు అంటుకుంది.

ఇహ—దాన్ని పెదవులకు చేర్చుకోవడం—పీల్చడం - అదే తరువాయి.

క్షణంపాటు చేతులు వణికాయి.

చేతిలోఉన్న సిగిరెట్టు విసిరవతలపారేసి లేచి చక్కా పోదామా అనిపించింది మురారికి.

పరిగెత్తి పోలేక పోయాడు మురారి. ఆఖరు సారిగా గుండె నిబ్బరం చేసుకున్నాడు.

ఒకటి—రెండు—మూడు—

గొంతుమీద మొక్కపోయిన కత్తితో కోసినట్లయింది మురారికి.

పొరబోయినట్లయింది.

ఊపిరి తిత్తుల్లోకి పిడకల పొగ వెళ్ళినట్లయింది.

పెదవులు వణికి పోయాయి.

కళ్ళంట నీళ్ళు కమ్ముకొచ్చాయి.

మరి గట్టిగా పీల్చాడేమో—ఫటుకి తల తిరిగిపోయింది.

ఎదురుగా కనిపిస్తూన్న తోట దృశ్యమంతా గజిబిజి గజిబిజిగా తికమకతికమకగా కలగాపులగమై పోయి, కెమిరా—'షేక్'వల్ల చెదిరిపోయిన ఫొటోగ్రాఫ్‌లా కనిపించింది మురారికి.

—సిగిరెట్టుతో మొదటి అనుభవం అలా అయింది మురారికి.

మొదటి సిగిరెట్టు సగంమాత్రం కాల్చి, మిగిలింది పారేసి, అగ్గిపెట్టె అక్కడే వదిలేసి, మిత్రుడు చెప్పిన ఉపాయంమేరకు మళ్ళీ స్కూలుకువెళ్ళి, నోరూ పళ్ళూ అమిత శుభ్రంగా కడుక్కుని, వక్కపొడి నోట్లో పోసుకుని నమిలేశాడు మురారి. సాయంత్రం మామూలు వేళకి, సాధ్యమైనంత మామూలుగా ఇల్లు చేరుకున్నాడు. తల్లి ఎక్కడ అనుమానించి పోతుందో అని, తన ముఖ కవళికల్లో కొత్తదనం కనిపిస్తే ఎక్కడ నిలదీసి అడుగుతుందోనని, ఆ రాత్రి పడుకునే దాకా పుస్తకాల్లో జాగ్రత్తగా ముఖం దాచుకున్నాడు.

సిగిరెట్టుతో తన మొదటి పరిచయం, అదే ఆఖరి పరిచయంగాకూడా ఆగిపోవాలని కోరుకున్నాడు మురారి. కాని, అతని ఆ కోరికమాత్రం నెరవేర లేదు. దినాలు గడిచే కొద్దీ సిగిరెట్టుతో అతని సాన్నిహిత్యం పెరిగిందేకాని, తగ్గలేదు. కాని, 'పిచ్చి

కైనా పద్ధతి ఉండా'లన్నట్లు, అతని సిగిరెట్లు పిచ్చికి ఒక పద్ధతి, ఎలా ఏర్పడిందో తెలీదుగాని, ఏర్పడింది. అతను రోజుకు ఒక్క సిగిరెట్టేకాని, అంతకు మించి తా—గ—డు. అదీ, ఎవ్వరికీ తెలియకుండా, ఎవ్వరికీ కనిపించకుండా, ఒంటరిగా తాగుతాడు. స్కూల్లో ఉన్నన్ని దినాలూ, ఆ తోటలోనే, ఎవ్వరూ లేకుండా చూసి తాగేవాడు. కాలేజీకి వెళ్ళాక, ఊళ్ళో ఎక్కడా కాకుండా, ఊరికి దూరంగా దాదాపు మైలున్నర షికారు వెళ్ళి, రోడ్డు దిగి, అక్కడెక్కడో కాల్చుకునేవాడు కాలేజీ చదువు ముగిసిపోతూ ఉండవంగా అతను తల్లిని పోగొట్టుకున్నాడు. ఆ తర్వాతైనా ఇంట్లో సిగిరెట్టు కాల్చేవాడు కాడు మురారి. కాలేజీలో అతనితో చదువుకున్నవాళ్ళూ, టీచర్లూ, అతన్నెరిగిన పెద్ద మనుషులూ, అతని ఆఫీస్‌లో అతనితో పనిచేసే ఉద్యోగులూ, అతనికి లీల నిచ్చి పెళ్ళిచేసిన మామగారూ—అందరూ—అతణ్ణీ, అతని 'సిగిరెట్లయినా తాగని' గుణాన్నీ తెగ మెచ్చుకునేవారు.

తను లోకాన్ని మోసం చెయ్యడంలేదు కదా—అని చాలాసార్లు తనను తాను ప్రశ్నించుకునేవాడు మురారి.

'నేను సిగిరెట్లు తాగుతానండోయ్', అని అతను ఎవ్వరితోనూ చెప్పలేదు.

అతను చెప్పలేదు కాబట్టి, వాళ్ళ చూస్తూండగా కాల్చలేదు కాబట్టి, అతను సిగిరెట్లు తాగడని వాళ్ళూ వాళ్ళూ చెప్పుకున్నారు.

'నేనూ సిగిరెట్లు తాగుతానండోయ్' అని అందరికీ ప్రకటించి మరీ అతను సిగిరెట్లు తాగలేదు. అదేనా అతని తప్పు?

'అది నా తప్పు కాదులే'—అని తనని తాను సమాధానపరచుకున్నాడు మురారి.

పెళ్ళయి వేరే ఊరు బదిలీ అయ్యాకకూడా అతని అలవాటు అలాగే సాగింది. రోజూ సాయంత్రం ఆఫీసు వదిలాక ఇంటికొచ్చి, మళ్ళీ షికారువెళ్ళే నెపం మీద ఇల్లు వదలడం, తిన్నగా పెద్దబజారు మలుపు తిరగడం, అటుపైని వీధి మలుపు దగ్గర బడ్డీలో ఒక్కసిగిరెట్టు కొనుక్కొని, దాన్ని అక్కడే కిరసనాయిలు బుడ్డీ దీపంతో వెలిగించుకోవడం, ఆ ప్రక్కనే ఉన్న పబ్లిక్ పార్కులో ప్రవేశించి, అనువుగా ఉంటుందని ఎన్నిక చేసుకున్న ఒక మూల చెట్ల గుబురు మధ్యనగల సిమ్మెంటు బెంచిలో కూచోవడం, అపురూపమైన స్వప్నదృశ్యాన్ని ఆనందిస్తున్నట్టు, ఆ పచ్చపచ్చని మొక్కల్లోకి చూస్తూ, ముసురుకొస్తూన్న ఒక్కొక్క ఆలోచననూ పలకరిస్తూ, సిగిరెట్టుని చివ్వరి దాకా కొంచెం కొంచెంగా పీలుస్తూ తాగడం, ఆ తరువాత యథాప్రకారం వక్కపొడి నోట్లో వేసుకుని నములుతూ ఆసనంనుంచిలేచి, మళ్ళీ రేపు వస్తాను గదా అన్నట్టు ఆ ప్రదేశంకేసి ఒక్కసారిచూసి, మెల్లగా వెనుదిరిగి ఇంటిదారి పట్టడం—అదంతా ఒక అలవాటుగా మారిపోయి అది అలాగే సాగుతోంది.

ఆదినుంచీ ముభావానికి అలవాటుపడిన మురారి, ఆఫీసులోకూడా అదే ముభావాన్ని అలాగే కొనసాగించడంచేత, అతనికి చెప్పకోదగ్గ మిత్రులంటూ లేకపోయారు. ఆఫీసువాళ్ళేకాక, పైవాళ్ళు, అతన్నెరిగిన వాళ్ళు, ఆ ఊళ్ళో ఆట్టేలేరు. అందుచేత పార్కులో సిగరెట్టు తాగుతూండగా ఎవరైనా చూసి పోతారేమోననే భయం (లేదా, సందేహం) మురారికి ఏ మాత్రమూ లేదు.

ఇక, భార్య విషయం—

మిగతా విషయాలెలా ఉన్నా డబ్బుదగ్గర లీల చాలా నిక్కచ్చి మనిషి. ఎంత నిక్కచ్చి మనిషో పెళ్ళయాక మొదటిసారిగా తన నెలజీతం ఆమె చేతికి ఇచ్చినప్పుడుగాని తెలిసి రాలేదు మురారికి. భర్త ఇచ్చిన నోట్లని వెంటనే లెక్కపెట్టి—'మీ జీతం మూడువందలా యాభై అన్నారే?' అంది.

'అవును—' అన్నాడు మురారి.

'మరి, మూడువందలా నలభయ్యే ఉన్నాయే?' అని అడిగింది లీల.

పది రూపాయలు 'జేబు డబ్బు' (పోకెట్‌మనీ)గా తీసుకున్నానన్నాడు మురారి. ప్రొద్దున్న టిఫిన్, మధ్యా

హ్నం భోజనం, సాయంత్రం టిఫిన్, రాత్రి భోజనం అన్నీ ఇంట్లోనే అవుతాయి గదా—ఇంకా పాకెట్‌మనీ అవసర మేముంటుంది లీల, మురారి ఆశ్చర్యపోయాడు. ఎప్పుడైనా కాఫీ, టీ వగైరాలకు కావలసొస్తా యన్నాడు. లీల నవ్వింది. నవ్వినా, సీరియస్‌గానే నవ్వి నట్టనిపించింది మురారికి. వేళకాని వేళల్లో కాఫీ-టీ-వగైరాలు తాగితే ఆరోగ్యం చెడిపోతుంది—సాధ్య మైనంతవరకూ తగ్గించండంది లీల. బ్రతికించింది కాఫీ—టీలు ఇంట్లోకాక తను మరెక్కడా తాగడు—ఇంక 'వగైరా' లేమిటో అడక్కుండా విడిచిపెట్టి లీల మహోపకారం చేసిందనుకున్నాడు మురారి. ఆ తరువాత కూడా నెలనెలా పదిరూపాయలు 'పాకెట్ మనీ'గా ఉంచు కుంటూ ఉంటే, అందుకు లీల అభ్యంతరం చెప్పక పోవడం అటుంచి, అదేమిటని కూడా అడగలేదు.

పక్కింటి ప్లీడర్‌గారికి సిగిరెట్లు కాల్చడం బాగా అలవాటు. వాళ్లావిడ ఆ విషయమై లీల దగ్గర చాలా విసుక్కుంటూ ఉంటుంది. 'మీకేం—అదృష్ట వంతులు—మీ ఆయన సిగిరెట్లు కూడా కాల్చరు—' అని కూడా అంటుందట.

'ఏమండోయ్—విన్నారా—నేను చాలా అదృష్ట వంతురాల్నట' అంది ఒకమారు లీల.

'ఎందుకట?' మురారి అడిగాడు.

'మీవంటి సిగిరెట్లు తాగనిభర్త నాకు దొరి కాడట—అందుకు' అంది లీల.

'ఎవరు చెప్పారు నీకు?' అన్నాడు మురారి.

అప్పుడు పక్కింటాయన కథంతా చెప్పింది లీల, 'ఏమైనా మావారు మంచివారు' అంటూ ముగిం చింది.

ఆ క్షణాన లీలకు తన సిగిరెట్ల రహస్యం చెప్పెయ్యాలనిపించింది మురారికి, ఎంతో ప్రయత్నం మీద నిగ్రహించుకున్నాడు. ఒకసారి మంచివాడని పేరు తెచ్చుకున్నాక ఆ పేరు నిలబెట్టుకోవడానికి నరక యాతనలు అనుభవించాల్సి ఉంటుంది, మంచితనంతో ఉన్న చిక్కే అది!

రోజూ సాయంత్రం షికారు పేరిటవెళ్లి, అదొక రహస్యం కాకపోయినా దాదాపు అలాంటి సంగతి గానే భావిస్తూన్నట్టు, పార్కులో సిగిరెట్టు—ఒకే ఒక్క సిగిరెట్టు, కాల్చుకునివస్తూ ఉండేవాడు మురారి. అందుకు దాదాపు ఒక సంవత్సరం దినాలూ ఏనాడూ ఏరకమైన ఆటంకమూ కలగలేదు. కాని, హఠాత్తుగా—అనుకోని ఆటంకం వచ్చిపడింది.

ఏమైంది?

మురారికి జబ్బు చేసింది. అలా ఇలా కాదు, చాలా సీరియస్‌గా జబ్బుచేసింది. హాస్పిటల్‌లో చేర్పిం చాల్సినంత ప్రమాదమేమీ కలగలేదుగాని, దాదాపు ఇరవై దినాలు, ఇంట్లోనే బెడ్‌మీదే ఉండిపోవాల్సి వచ్చింది. అన్నిదినాలూ మురారి ఎంత బాధపడ్డాడో అంతకు రెండింతలు బాధపడింది లీల, తీరా తనకు వ్యాధి నయమయేవేళకి ఆమెకు జబ్బు పట్టుకుంటుం దేమోనని భయపడ్డాడు మురారి. పగల్లంతా అతని పక్కనే కూర్చుంది. రాత్రిళ్లు నిద్రలు మేలుకుంది. అతను చిన్నబాధతో మూలిగితే ఎక్కడలేని ఆదుర్దా పడింది. ఎలాగైతేనేం—జబ్బు నెమ్మది నెమ్మదిగా తగ్గుముఖం పట్టింది. డాక్టర్‌వచ్చిచూసి, ఇంకో వారం రోజులైనా ఇంట్లోనే విశ్రాంతి తీసుకోవా లన్నాడు. 'డాక్టర్లకేం—అలాగే చెబుతారు—మరేం ఫరవాలేదు—నేను ఆఫీసుకి వెళతాను—' అన్నాడు మురారి. కాని వెళ్లనివ్వలేదు లీల. దాదాపు సత్యా గ్రహం చేసినంత పని చేసింది. తప్పనిసరై మరో వారం రోజులు శెలవు కావాలని ఆఫీసుకి శెలవు చీటీ పంపించాడు మురారి.

వారంలో మూడు రోజులు గడిచిపోయాయి. అది నాలుగో రోజు. అన్నిదినాలూ. సాయంత్ర మయేసరికి తల దిమ్ముగా ఉన్నట్లు తోచేది మురారికి. గాలిలేని గదిలో ఉన్నట్లుగా తోచేది. ఎంతో ఆలో చించాడుగాని, కారణమేమిటో తోచలేదతనికి. చివరికి స్ఫురించింది—

సిగిరెట్టు!—

అదీ కారణం!

రోజూ సాయంత్రం సిగిరెట్టు తాగడం అల వాటు. జబ్బు రావడంతో ఆ అలవాటుకి బ్రేక్‌పడింది. కాని శరీరం ఊరుకుంటుందా? అసంతృప్తిని ప్రక టిస్తుంది మనస్సుకి దిక్కుతోచదు.

అలాగే ఉంది మురారికిప్పుడు.

ఎలాగైనాచేసి ఒక్క సిగిరెట్టు కాల్చాలి. కాని— ఎలా?

నిన్న సాయంత్రం ధైర్యంచేసి 'అలా ఊళ్లోకి వెళ్లొస్తానని' బయల్దేరబోతే వద్దని అడ్డగించింది లీల. వారం రోజులవరకూ ఇల్లొదిలి వెళ్లేందుకు వీల్లేదంటే వీల్లేదంది, మళ్లీ ఆమెకు తెలీకుండా ఎక్కడ అతను వెళతాడో అని—'నాతో చెప్పకుండా వెళితే నామీద ఒట్టు—' అని ఒట్టేసి పెట్టింది కూడాను.

ఇప్పుడెలా?

ఒక సిగిరెట్టు కావాలి—ఒక్కసిగిరెట్టు—

కాని—ఎలా వస్తుంది?—

* * *

ముందు గదిలోంచి మాటలు వినిపించాయి. ఎవరాని విన్నాడు మురారి. లీలే మాట్లాడుతోంది. ఎవరితో—ఏమిటి మాట్లాడం అనుకున్నాడు. అంతలో లీలే గదిలోకి వచ్చింది. 'ఏమండోయ్—ఎలా ఉంది' ఉంది.

'బాగానే ఉంది—'

'అదేమిటలా ఉన్నారు — తలనొప్పిగా గాని ఉందా?' అంటూ నుదుటిమీద చెయ్యేసి చూసింది, 'వేడిగా ఏంలేదే—ఏమిటి 'చెప్పండి—' అంది.

'ఏంలేదు—' అన్నాడు మురారి.

'సుబ్బణ్ణి బజారుకు పంపిస్తున్నాను—ఎలాగూ మళ్లీ సోమవారం దాకా మీరు వెళ్లాల్సిన పనుండదు—' అంది లీల.

సుబ్బడు పక్కింటి ప్లీడర్‌గారింటి పనివాడు. అప్పుడప్పుడూ మురారి వాళ్లక్కూడా ఇంటిపనుల్లో సాయపడుతూంటాడు.

'మార్కెట్‌నుంచి మీకక్కూడా ఏమైనా ఇంటి పనుల్లో సాయపడుతూంటాడు.

'మార్కెట్‌నుంచి మీ క్కూడా ఏమైనా కావాలా?' అంది లీల.

'నాకేం కావాలి?' అన్నాడు మురారి—'నాకేమీ అక్కర్లేదు—' అన్నట్టుగా, చప్పున అతన్లో ఏదో కారణం తెలియని ఉక్రోషం పుట్టుకొచ్చింది. 'ఏం కావాలంటావా?—ఒక ప్యాకెట్ సిగిరెట్లు తెప్పించు—' అందామనుకున్నాడు ఆమాట అతనివాలుక చివరిదాకా వచ్చింది. అటుపైని కదల్లేక పెదవుల వెనుకే ఆగి పోయింది. 'నాకేం వొద్దు లెద్దూ' అన్నాడు మళ్లీ.

'అదేమిటి?—మొన్న మీ షేవింగ్‌సోప్ అయి పోయిందన్నారుగా?' అంది లీల.

అన్నాడేమో, గుర్తులేదు మురారికి.

'ఊ—' అన్నాడు మురారి, 'ఊఁ?' అంటు న్నట్లు.

'మీ టూత్‌పేస్ట్ కూడా అయిపోయిం దన్నారే? —'

'ఆఁ—'

'అంతేనా ఇంకేమైనా, కావాలా?'

'ఇంకేం కావాలి? — '

'బాగుంది—నన్నా అడుగుతారు?' అంది లీల అతని పరధ్యానానికి నవ్వుతూ.

మురారి ఆమె కళ్లలోకి చూశాడు. ఆమె పెదవులతోనేకాక కళ్లతోనూ నవ్వుతోంది—'ఏమిటి— అలా చూస్తున్నారు?'

'ఏమీలేదు—'

'పాపం మీరు—'

'ఏమిటి?'

'ఏం లేదు—మీరు చాలా చిక్కిపోయారు'— అంటూ గదిలోంచి వెళ్లిపోయింది లీల.

మురారికి నవ్వు వచ్చింది. తను చిక్కిపోవడం ఆమెకు ఇప్పుడేనా కనిపించింది?— అనుకున్నాడు.

చీకటి పడింది. గదిలో దీపం లేదు. లేచి స్విచ్చి వేద్దామనుకునికూడా అలాగే కూచుని ఉండిపోయాడు మురారి.

చీకటి గదిలో మరీ ఉక్కిరి బిక్కిరిగా ఉంది.

సిగిరెట్టు—సిగిరెట్టు—

మురారి మెదడులో అగ్గిపుల్లలు వెలుగుతున్నాయి. అంతలో ఆరిపోతున్నాయి.

కిటికీలోంచి వెలుపలికి యథాలాపంగా చూశాడు మురారి. ప్రహరీ కవతల కనిపించిన దృశ్యం అతణ్ణి ఆకట్టుకుంది.

పూల మొక్కలమధ్య ఈజీ ఛైరుంది. ఈజీ ఛైరులో విందుగా ఉన్నారు ప్లీడరుగారు. ప్లీడరుగారి కళ్లు ఆకాశంవేపు చూస్తున్నాయి. ప్లీడరుగారి పెదవులమధ్య గుప్పుగుప్పుమని వెలుగుతుంది—సిగిరెట్టు!

ప్లీడరు గారింట్లో లైట్లు అప్పుడే వెలిగాయి. ప్లీడరుగారు కూచున్న చోట, తోటలో, చీకటిగానే ఉంది. అముదురుతూన్న చీకటిలో, ప్లీడరుచేతి కదలికకు అనుగుణంగా పైకీ కిందికీ కదులుతూంది సిగిరెట్టు కొనమీది నిప్పు.

చీకట్లో నిప్పు చిత్రంగా మెరుస్తోంది.

చీకట్లో నిప్పు పగడపు చిగురులా ఉంది.

చీకట్లో నిప్పు చాలా మనోహరంగా ఉంది.

అహో! ఇప్పుడా ప్లీడరుగారు ఎంత ఆనందంలో ఉంటారో! అతిజాగ్రత్తగా సిగరెట్టుని పెదవులమీద అమర్చుకుంటూ, అపురూపంగా ఒక్కొక్క గుక్క పొగా పీలుస్తూ, పీల్చిన పొగని హృదయ పూర్వకంగా అనుభవిస్తూ, మళ్లీ ఆ పొగను వెలుపలికి రింగులు రింగులుగా వదులుస్తూ—ఏయే భావాంబర వీధుల్లో విహరిస్తూ ఉంటారో!!

ప్లీడరుగారి వాలు కుర్చీ ప్రక్కనే చిన్న స్టూలొకటి ఉన్నట్టుంది. సరిగ్గా కనిపించడం లేదు గాని, దానిమీద ఒక అందమైన, సగంమాత్రమే మూసిన సిగిరెట్లపెట్టె ఒకటుంటుంది. ముద్దులు మూటగట్టే సిగరెట్లు అందులోంచి సగం సగం తొంగి చూస్తూనే ఉంటాయి. ఆ సిగిరెట్టు పెట్టె ప్రక్కనే ఒక చిన్ని అగ్గిపెట్టె. 'ఎవరక్కడ' అంటే? 'చిత్తం మహాప్రభో' అని పలికేభృత్యుల్లాగా,అందులో అటెన్షన్‌లో ఉన్నట్టుండే అగ్గిపుల్లలూ ఉండే ఉంటాయి. ఆహా! దర్జా అంటే ప్లీడర్‌గారిదే దర్జా! భోగం అంటే ఆయనదే భోగం!!

'ప్లీడర్‌గారూ!— సార్—ప్లీడర్‌గారూ—ఒక్క సిగిరెట్టియ్యండి సార్—ఒక్కటంటే ఒకే ఒక్క సిగిరెట్టు—'అని కేకెయ్యాలనిపించింది మురారికి, అనిపించిందే గాని, అలా చెయ్యలేకపోయాడు మురారి (ఎందుకు చెయ్యలేకపోయాడు? ప్లీడర్‌గారితో పరిచయం లేదన్న సంగతి అటుంచి, తను సిగిరెట్లు కాల్చగల ప్రదేశం అది కాదన్న సంగతి బహుశా అతనికి గుర్తొచ్చి ఉంటుంది)

అలాగే చూస్తూ కూచున్నాడు మురారి.

లాభం లేదు.

ఆశపడి లాభంలేదు.

ఈరోజు, ఈరోజే కాదు రేపు, రేపేకాదు ఆ మర్నాడు—ఇంక సోమవారం ఆఫీసు కెళ్లేదాకా తను సిగిరెట్టు కాల్చలేదు అసాధ్యం, అసలిక్కడ తను సిగిరెట్టు తాగలేడు.

చాలా సేపైంది—

మురారి మనస్సులో భావాలు తిరుగుతున్నాయి తిరుగుతునే ఉన్నాయి—

తనిక్కడ సిగరెట్టుతాగడం వీలుపడదు—కాక పడదు–ఏదైనా ఒక మంచికలవస్తే, మరి అందులో—తాగితే తాగొచ్చు—

కల—

కలలు నిజంకానీ, కాకపోనీ,

నిజంగా—కలలు కావాలనుకున్నప్పుడు పోనీ—అయినా –కలలో తనకు ఏం కావాలి?

సరీగ్గా ప్రస్తుతం తను కూచునిఉన్న గది లాంటి గదే—అవును— ఇదేగదే— సరిగా తను ఇప్పుడు కూచున్నట్టే కూచుని ఉండాలి—అవును తను కూచునే ఉన్నాడు — ఎదురుగా తన మేజాలాంటి మేజాయే ఉంది—అవును—తన మేజాయే ఉంది—గదిలో ప్రస్తుతం చీకటి— అంతలో ఒక్కసారిగా గది వెలుతురుతో నిండిపోయింది.

కళ్లు తెరిచి చూస్తాడు గదా — మేజామీద చిన్న రత్నాల పెట్టెలాంటి పెట్టె—ఏం—పెట్టె చెప్మా— అది—అవును—సిగిరెట్టుపెట్టే! అద్దానిపైన ఒక చిన్న ముచ్చటైన చీటామార్కు అగ్గిపెట్టె! అవును—అగ్గిపెట్టే!!

చూస్తాడా తను— చూశాడా తను—పెట్టె తెరిచి ఆత్రంగా ఒక్క—ఒక్క సిగిరెట్టుని తీసి పెద వుల మధ్య పెట్టుకున్నాడా—అగ్గిపుల్ల వెలిగించాడా—సిగిరెట్టు అంటించుకున్నాడా—

ఆనక—ఆప్యాయంగా — అపురూపంగా, అతి భద్రంగా—ఒక్కసారి ఒక్కపీల్పు పీల్చాడా—

పీల్చాడు—

వలయాలు వలయాలు వలయాలుగా కలల పొగతేర్ల చక్రాల్లా సిగిరెట్టు పొగవదిలాడా—

వదిలాడు—

ఆ ధూమ వలయాల వెనుకనుంచి వన్నటి కొంటెనవ్వు తుంపర్లు విరుస్తున్నాయేమిటి చెప్మా?

ఎవరామె?

ఎంత అందంగా నవ్వుతోంది?

అసలెందుకు నవ్వుతుంది??

అరె—ఆమెనెక్కడో చూసినట్టుందే!—

—ఉలిక్కిపడ్డాడు మురారి.

కల చెదిరిపోయింది—చెదిరిపోయినదను కున్నాడు.

కాని, చెదిరిపోలేదే!

కనురెప్పలు విదిలించి చూశాడు—

కలా— నిజమా—కలా నిజమా కలా—

చేయిగిల్లి చూసుకున్నాడు—

నిజమే!

ఇప్పుడు గదిలో లైటు వెలుగుతోంది—మేజా మీద తెరచిన సిగిరెట్టుపెట్టే, తెరచిన అగ్గిపెట్టే పడున్నాయి; తనచేతిలో ఒక దమ్ము మాత్రమే అనుభ వించబడిన సిగిరెట్టు సన్నగా రాజుకుంటోంది—

గుమ్మంలో నిలుచుని కడుపు చేతోపట్టుకుని నవ్వుతోంది లీల.

ఆ నవ్వుచూసి ఆశ్చర్యపడి, తికమకపడి, నివ్వెరపడి పోయాడు మురారి.

'లీలా—లీలా—' అంటూ అప్రయత్నంగా గొణుక్కున్నాడు.

జరిగిన సంగతేమిటో అతనికి కొంచెం కొంచెంగా అర్థమవుతూ వచ్చింది, పూర్తిగా అర్థమయే సరికి అతని కళ్లలో ఆనందపు రేఖలు ఒక్కసారిగా వెలిగాయి.

'లీలా—నువ్వెంత మంచిదానివి!—' అనాలను కున్నాడు.

అందుకు మారుగా మరోమారు సిగిరెట్టుని పెదవులకు చేర్చుకుని హృదయ పూర్వకంగా ఇంకో పీల్పు పీల్చాడు.

పొగ వదిలాడు—

వలయాలు వలయాలుగా అతని కళ్లముందు లేచిన పొగలోంచి కనిపించింది—ఇంకా నవ్వుతూ నవ్వుతూ ఉన్న లీలముఖం కదిలే కదిలే అలల నీటి మీద జాబిలి ప్రతిబింబంలా—

———

# ధరల పెరుగుదల

డా. ఎమ్. ఎల్. కాంతారావు

(గత సంచిక తరువాయి)

## ధరల పెరుగుదలను అరికట్టే ద్రవ్య విధానము, కోశ విధానము

(Monetary and Fiscalpolicies)

డిమాండ్ పెరుగుదలవల్ల ఏర్పడే ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి, సాధారణంగ ప్రభుత్వాలు రెండు పద్ధతులను అవలంభిస్తాయి. ఒకటి డిమాండ్‌తగ్గించ యత్నించేది. రెండవది సప్లయిని హెచ్చింపప్రయత్నించేది. కాని సప్లయి పెరుగుదల కాలక్రమేణాగాని జరుగదు. సరైన చర్యలు తీసికొంటె డిమాండ్‌ను శీఘ్రంగా తగ్గించుటకు అవకాశాలున్నాయి.

అభివృద్ధి చెందిన దేశాలలోకన్నా అభివృద్ధి చెందుతున్న దేశాలలో వస్తూత్పత్తి రేటు పెంచుటకు ఎక్కువ అవసరం ఉంది. కాన అవకాశాలను కలుగచేసుకోవాలి. అదేవిధంగా అభివృద్ధిచెందిన దేశాలలో డిమాండ్ పెరుగుదలంటె, సాధారణంగా విలాసాలు, సౌఖ్యాలు ఒనగూర్చె వస్తువులకు డిమాండ్ పెరుగుదల అన్నమాట కాని భారతదేశంలో, అందరూ రెండు పూటలా సక్రమమైన తిండి కావలెననుకొన్నా చాలినంతబట్ట కట్టాలన్నాకూడ డిమాండ్‌లో చాల పెరుగుదల కనిపిస్తుంది. వస్తూత్పత్తిని పెంచడానికి ప్రభుత్వం ఇంతవరకు చేసిన కృషి చాలకపోవడం చేతగాని, ఫలితానికి రాకపోవడంచేతగాని వస్తువుల కొరత ఏర్పడిందని పైన గమనించాం.

డిమాండ్ తగ్గింపుకు సాధారణంగ ప్రభుత్వాలు ద్రవ్యవిధానాలను, కోశవిధానాలను అనుసరిస్తాయి. ద్రవ్యరాశిని హెచ్చించుటద్వారా, తగ్గించుట ద్వారా రిజర్వ్‌బాంకు మిగిలిన బాంకులకు ఇచ్చే ఋణాలపై వసూలుచేయు వడ్డీ రేటును పెంచుటద్వారా, తగ్గించుట ద్వారా, ధరల స్థిరీకరణ మున్నగు లక్ష్యాలను చేరుకొనుటకు ప్రయత్నించడాన్ని ద్రవ్యవిధాన మంటారు. ప్రభుత్వ ఆదాయాన్నిగాని, వ్యయాన్నిగాని, పన్నులనుగాని హెచ్చించడం, తగ్గించడం ద్వారా, ఋణం చేయడం ద్వారాగాని, తీర్చడం ద్వారాగాని, ద్రవ్యోల్బణ నివారణ ఉత్పత్తి పెరుగుదలమున్నగు లక్ష్యాలకోసం యత్నించడాన్ని కోశవిధాన మంటారు.

ద్రవ్యవిధానం ద్వారా, కోశవిధానం ద్వారా, వస్తూత్పత్తిని పెంచడం ద్వారా ధరలను అదుపు చేయడమే ప్రభుత్వ లక్ష్యమని మొదటి పంచవర్ష ప్రణాళికలో (1951–56) చెప్పబడింది. దీనికి అనుగుణంగానే, 1935 నుండి నిలకడగా 3శాతంగా ఉండిన వడ్డీరేట్‌ను రిజర్వ్‌బాంకు వారు 1951 నవంబరులో $3\frac{1}{2}$ శాతానికి పెంచారు. అనేక రకాలైన అనుకూలతలవల్ల మొత్తంమీద మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ధరలు అంతగా పెరగలేదు సరిగదా కొన్ని సంవత్సరాలలో తగ్గాయి.

ఈ విజయోత్సాహంతో ఏర్పడిన మత్తు బహుశా రెండవ పంచవర్ష ప్రణాళికలో (1956–61) ధరలగురించి అంతగా ప్రస్తావించకపోవడానికి కారణం కావచ్చు కాని ఈ నిర్లిప్తత, నిస్తబ్ధతలకు ప్రతీకారంగానా అన్నట్లు రెండవ ప్రణాళికా కాలంలో ధరల పెరుగుదల ప్రారంభమైంది. 1955-56 లో టోకు ధరల సూచీ సంఖ్య 92.5 కాగా 1960–61 లో 124.9 కి పెరిగింది. బాంకులిచ్చే ఋణాలను తగ్గించి, ధరలను అదుపుచేసే

ఉద్దేశ్యంతో రిజర్వ్‌బాంక్, 1957 లో వడ్డీ రేటును $3\frac{1}{2}$ శాతంనుండి 4 శాతానికి పెంచింది. అంతేగాక ధరల పెరుగుదల నరికట్టే ఉద్దేశ్యంతో రిజర్వ్ బాంక్ తనకున్న అన్ని సాధనాలను ఉపయోగించింది. గాని ఫలితం మాత్రం దక్కలేదు. రెండవ ప్రణాళికా కాలంలో ద్రవ్యం సప్లయి సుమారు 650 కోట్లు పెరిగింది. అంతేగాక లోటు ద్రవ్యవిధానంవల్ల ఒనగూడిన ధనం మొదటి ప్రణాళికా కాలంలో కంటే రెట్టింపుకన్నా ఎక్కువగా పెరిగింది.

మూడవ పంచవర్ష ప్రణాళిక (1961-66) దేశంలోని ద్రవ్యోల్బణాన్ని డిమాండ్ పరమైనదిగా గుర్తించి అత్యవసర వస్తువుల ఉత్పత్తిని పెంచాలని సరైన కోశవిధానం ద్వారా ద్రవ్యవిధానం ద్వారా డిమాండ్ పెరుగుదలను అరికట్టాలని నొక్కిచెప్పింది. అధికధరలను అరికట్టే ఉద్దేశ్యంతో రిజర్వ్‌బ్యాంకు వారు 1963–65 మధ్య వడ్డీ రేట్‌ను 3 దఫాలుగ 4 నుండి 6 శాతానికి పెంచారు. కాని ప్రభుత్వం లోటు ద్రవ్య విధానంద్వారా సేకరించిన ధనం సగటున సంవత్సరానికి 227 కోట్ల రూపాయలకు పెరిగింది. ప్రణాళికా కాలంలో ద్రవ్యం సప్లయి సుమారు 50 శాతం పెరిగింది. 1965, 1966 లలో జాతీయాదాయంలో పెరుగుదలకు బదులు తరుగుదల ఏర్పడింది. ధరలు విపరీతంగ పెరగడంవల్ల ప్రణాళికలను తాత్కాలికంగానైనా నిలిపివేయమని చెప్పినవారు లేకపోలేదు.

1966–69 మధ్య ద్రవ్యం సప్లయి పెరుగుదల 1251 కోట్లు. లోటు ద్రవ్యం మొత్తం సగటున సంవత్సరానికి 335 కోట్లకు పెరిగింది. 1965–66 లో ఆహారోత్పత్తి బాగా దెబ్బ తినింది. 1966–67 లో కూడ పెద్ద పెరుగుదల లేదు. పన్నులద్వారా సేకరించిన మొత్తం ఆశించినదానికన్నా తక్కువగానే ఉండినది. కరవుభత్యం తరచు పెంచవలసి వచ్చినందున ప్రణాళికేతర వ్యయం కూడ పెరిగింది. ఇవన్నీ ధరల పెరుగుదలకు దోహదం చేశాయి.

నాల్గవ పంచవర్ష ప్రణాళికలో (1969–74) ధరల పెరుగుదలను అరికట్టాలనీ ముఖ్యంగా ఆహార ధాన్యాల స్థిరీకరణకు కృషి చేయాలని, ద్రవ్యోల్బణానికి దారి తీయని విధంగా ప్రణాళికకు కావలసిన వనరులను సేకరించాలని ప్రకటించడం జరిగింది. లోటు ద్రవ్యం మొత్తాన్ని 850 కోట్ల రూపాయలకు పరిమితం చేస్తామని చెప్పారు. కాని నాల్గవ ప్రణాళికలోని మొదటి నాల్గు సంవత్సరాలలోనే లోటు ద్రవ్యం 2000 కోట్ల రూపాయలకు మించింది. బాంకుల నుండి, ప్రభుత్వాలు తీసికొన్న నికర ఋణాలు సుమారు 3000 కోట్లు ఉండవచ్చునని ఒక అంచనా. ద్రవ్యం సప్లయి సుమారు 3500 కోట్ల రూపాయలకు పెరిగింది. (1969 నుండి 1973 మార్చి వరకు) జాతీయాదాయంలో 1969–71 మధ్య ఉన్న పెరుగుదల కూడ 1971–73 ల మధ్య లేకుండాపోయింది. 1972 లో ఆహారోత్పత్తి బాగా తగ్గింది. ప్రభుత్వ వ్యయం, లోటు ద్రవ్యం మాత్రం, ప్రణాళికా లక్ష్యాలతోను, ఆశయాలతోను నిమిత్తం లేకుండ మితిమీరి పెరిగాయి. వస్తువుల ధరలు మున్నెన్నడు లేనంతగా పెరిగాయి. రానున్న మాసాలలో ఈ పెరుగుదల తగ్గిపోతుందని ఆశించడానికే అవకాశాలు లేకున్నాయి. ఈ పరిస్థితికి ప్రభుత్వం అనేక కారణాలు చెబుతుంది. అననుకూల వాతావరణం, 1971 యుద్ధం వగైరా ప్రణాళికా సంఘం ఒకటి తలిస్తే ప్రకృతి వేరొకటి తలచుటచే ప్రణాళికా ఫలాలు పూర్తిగ అందలేదన్నమాట. ఐతే వర్షాలు ఎల్లప్పుడు సకాలంలోనే రావని, ఒకొక్కసారి రాకపోవచ్చని, పంటలు ఆశించినట్లు పండకపోవచ్చునని మనకు గతానుభవం చెబుతున్న దాన్ని విస్మరించి, ఈ పరిస్థితులకు ఎందుకు తయారుగ లేమన్నది ప్రభుత్వానికి చిక్కు ప్రశ్న.

1972–73 లో ద్రవ్యం సప్లయి, బాంకులిచ్చే ఋణాలు లోటు ద్రవ్యం మున్నగునవి విపరీతంగా పెరుగుటచే ధరలను ఋణాలను అదుపుచేసే ఉద్దేశ్యంతో, 1973 జూన్ 1 నుండి రిజర్వ్ బాంకు వడ్డీ రేటును 6 నుంచి 7 శాతానికి

పెంచింది. వ్యాపార బాంకులు, రిజర్వ్ బాంకులో ఉంచవలసిన రిజర్వ్‌ల శాతం 3 నుంచి 5 కు పెంచబడింది. అంటే వ్యాపార బాంకులు 100 కోట్ల రూపాయల డిపాజిట్లకు మునుపు 3 కోట్లు రిజర్వ్ బాంకులో ఉంచవలసి యుండగా ఇప్పుడు 5 కోట్లు ఉంచవలెనన్న మాట. రిజర్వ్ బ్యాంకుయొక్క ఈ చర్యలవల్ల బాంకులు అప్పులు ఇచ్చే అవకాశం తగ్గింది. అప్పులు తీసికొనేవారు చెల్లించవలసిన వడ్డీ రేటు పెరిగింది. రిజర్వ్‌బాంకువారి ఈ చర్య సక్రమ మార్గంలోనే ఉన్నప్పటికీ తృప్తికరమైన ఫలితాలు ఉంటాయని ఊహించడం కష్టం. బాంకు రేటు పెరుగుదల ఒక హెచ్చరిక మాత్రమే. బ్లాక్‌మనీ విచ్చలవిడిగా ఉండే ప్రస్తుత పరిస్థితులలో ఈ హెచ్చరిక ఎంతవరకు ఎంతవరకూ లెక్కచేయ బడుతుందనేది ప్రశ్న. 1951–73 మధ్యబాంకు రేటు 3 నుండి 7 శాతానికి అంటే 133 శాతం పెరిగింది. అయినా ఋణాలు పెరుగుతూనే ఉన్నాయి.

అంతేగాక ద్రవ్యం మార్కెట్‌లోని ఒక ముఖ్యరంగము (అవ్యవస్థిత రంగం) పై రిజర్వ్‌బాంకు అధికారము గాని ప్రభావముకాని తక్కువ. పొదుపును పెంచాలంటే బాంకులు డిపాజిట్లపై ఇచ్చే వడ్డీలనుకూడ పెంచడం అవసరమనిపిస్తుంది. ఆర్థికాభివృద్ధిదృష్ట్యా ప్రాముఖ్యం గల రంగాలకు అంటె అధికోత్పత్తికి దోహదంచేసే రంగాలకు, వస్తువుల ఎగుమతులకు తోడ్పడే రంగాలకు ఋణాలను అధికంగ లభింపచేయుట ప్రాముఖ్యత లేని రంగాలకు ముఖ్యంగా వస్తువుల ధరలను పెంచే ఉద్దేశ్యంతో వస్తువుల నిల్వలను పెంచుటకై ఋణాలను కోరేవారికి ఋణాలను తగ్గించుట రిజర్వ్‌బాంకు లక్ష్యం. దీనినే నియంత్రిత విస్తరణ విధానమంటారు. (Policy of Controlled Expansion) ఈ లక్ష్యంకూడ సంపూర్ణముగ సఫలం కాలేదు.

సరియైన సమయంలో సరైనచర్య సరియైన పరిమాణంలో తీసికొనకపోవుట ద్రవ్యవిధానం సఫలత

పొందకపోవుటకు కారణమనిపిస్తుంది. అంకంచేచేను మేసిందన్నట్లు ద్రవ్యం సప్లయిని పరిమితంగా ఉండునట్లు చూడవలసిన రిజర్వుబాంకు ప్రభుత్వానికి లోటు ద్రవ్యాన్ని అపరిమితంగా సప్లయిచేసి ద్రవ్యం సప్లయి పెరుగుటకు దోహదం చేసింది. కాని ఇందుకు రిజర్వుబాంకు కన్నా ప్రభుత్వబాధ్యత హెచ్చు. రాజకీయ రంగంలోని నియమరహిత ప్రవర్తన క్రమశిక్షణా రాహిత్యం ఆర్థికరంగంలో కూడ ప్రవేశించి చాలవరకు కోశవిధానాన్ని కొంతవరకు ద్రవ్యవిధానాన్ని ధరల పెరుగుదలకు దోహదకారులుగ చేసినట్లనిపిస్తుంది.

## 1.1 ఆదాయాల విధానము

(Incomes Policy)

భారతదేశంలో ద్రవ్యోల్బణాన్ని అరికట్టడంలో కోశ విధానం, ద్రవ్య విధానం విఫలమైనాయని పైన గమనించాం. ద్రవ్యోల్బణాన్ని అరికట్టే సాధనాలుగ, వీటిని చిత్తశుద్ధితో, విశ్వాసంతో అమలు జరుపక పోవడమే ఈ విఫలతకు ముఖ్యకారణములు గాని, విధానాల నిష్ప్రయోజకత మాత్రం కాదు. ఐనప్పటికి నేటి ద్రవ్యోల్బణ నివారణకు, ఆదాయాల విధానము క్రొత్త విధానము అవసరమైనట్లు ప్రణాళికా సంఘం భావిస్తున్నది. ఆదాయాల విధానమంటే ఏమిటి? ఇతర దేశాలలో ఈ విధానంవల్ల సత్ఫలితాలు కలిగాయా? భారతదేశంలో ఇది ఎంతవరకు ఉపయోగకరంగా ఉండగలదు అనే అంశాలను ప్రస్తుతం పరిశీలిద్దాం.

వస్తువుల ఉత్పత్తి ఖర్చు పెరగడంవల్ల ముఖ్యంగా వేతనాలు (Wages) పెరగడంవల్ల ద్రవ్యోల్బణం ఏర్పడవచ్చునని గమనించాం. ప్రస్తుత కాలంలో కార్మికులు, కార్మిక సంఘాలను ఏర్పరచుకొని ఉన్నారని, ఈ సంఘాలు కార్మికుల జీతభత్యముల పెరుగుదలకు, ఉద్యోగాల భద్రతకు మున్నగువాటికై కృషి చేస్తాయని అందరికి తెలిసిన విషయమే. యజమానులతో పోల్చినప్పుడు సాధారణంగా కార్మికులు బలహీనులని, కార్మికులందరు ఐక్యంగా పోరాడకుంటే కష్టనష్టములు కలుగుతాయనే ఉద్దేశ్యంతో ఇవి ఏర్పడ్డాయి. కాని కాలక్రమేణా ఈ సంఘాలు బాగా బలపడిపోయి ఎక్కువ జీతభత్యములు పొందుటచే వస్తువుల ఉత్పత్తి ఖర్చులు పెరుగుచున్నవి. కార్మిక సంఘాలు బలపడడానికి ప్రజాస్వామ్య దేశాలలో వాటికి లభించిన రాజకీయపార్టీల మద్దతు కూడ కొంత కారణం. కార్మికుల కోరికలు సబబైనవి అయినా, కాకపోయినా, ఉత్పాదకతతో నిమిత్తం లేకుండ వేతనాలను పెంచుటవలన కలిగే దుష్పరిణామాలను కూడ విస్మరించి, కార్మికుల ఓట్లను సంపాదించే యత్నంలో వారి కోరికలను బలపరచేవారు తీర్చేవారు ఉన్నందున వేతనపరమైన ద్రవ్యోల్బణం ఏర్పడే అవకాశాలున్నాయి. సప్లయి పరమగు ఈ ద్రవ్యోల్బణాన్ని అరికట్టుటకు కోశ విధానము ద్రవ్య విధానము అంతగా ఉపయోగకరములు కానందున ఆదాయముల విధానము అవసరమనే అభిప్రాయము ఏర్పడినది.

కార్మికుల వేతనాలు పెరగకుండా తాత్కాలికంగా స్తంభింప చేయుటయే ఈ సందర్భంలో ఆదాయాల విధానమునకు అర్థము. ఉదాహరణకు అమెరికా అధ్యక్షుడు శ్రీ నిక్సన్, కార్మికుల జీతభత్యముల స్తంభింప చేయవలెనని 1973 జూన్‌లో ఉత్తరవు చేసినాడు. కార్మికులు ఉత్పత్తిచేయు వస్తువుల సగటు సంఖ్యగాని విలువగాని పెరిగినప్పుడు హెచ్చువేతనాలను కోరుట సహజమేగాని, ఉత్పాదకతలో పెరుగుదల లేనప్పుడు వేతనాలను పెంచరాదని ఈ ఆదాయాల విధానం ఉద్దేశ్యం. ఉత్పత్తి ఖర్చుల పెరుగుదలకు వేతనాల పెరుగుదలే గాక లాభాల పెరుగుదలకాని, ఇతర ఉత్పత్తి కారకుల పెరుగుదల కాని కారణం కావచ్చు. కాబట్టి అన్నిరకాల ఉత్పత్తి కారకుల పెరుగుదలకాని కారణం కావచ్చు. కాబట్టి అన్నిరకాల ఉత్పత్తి కారకుల ఆదాయాల స్తంభన ఆదాయాల విధానమేనని విస్తృతార్థంలో చెప్పవచ్చు. సాధారణంగ సప్లయి డిమాండ్‌లనుబట్టి వస్తువుల ధరలుగాని, ఉత్పత్తి కారకుల ధరలుగా నిర్ణయమైనప్పుడు అవి న్యాయంగా ఉంటాయని

విశ్వాసం. కాని శ్రామికులు మున్నగువారు డిమాండ్‌ని బట్టిగాక. తమ సంఘాలకున్న బలాన్నిబట్టి వేతన నిర్ణయానికి ప్రయత్నించుటచే, మార్కెట్ యంత్రాంగాన్ని తాత్కాలికంగా నిలుపుదలచేసి, ఇతర మార్గాల ద్వారా ప్రభుత్వ ఉత్తర్వులుద్వారా ఆదాయాలను స్తంభింపచేయుట అల్పకాలంలో ఆదాయాల విధాన లక్ష్యం. కార్మికులు మున్నగువారు, యజమానులు అధిక వేతనాలను లాభాలను ఆశించడంవల్ల కలిగే దుష్పరిణామాలను వారు బాగా గ్రహించునట్లు చేయుటద్వారాను, మరికొన్ని మార్గాల ద్వారాను ఆదాయాల పంపిణీలో సముచితత్వాన్ని, న్యాయాన్ని సాధించుట, దీర్ఘకాలంలోని ఆదాయాల లక్ష్యం. ఆదాయాల విధానమంటె అల్ప ఆదాయాలను పెంచటమని గాని లేదా ఆదాయాలలోని అసమానతలను తొలగించుటమని గాని, ఒక అభిప్రాయం భారతదేశంలో ఉంది. కాని ఈ అర్థంలో ఈ పదాన్ని పశ్చిమదేశాలలో ఎక్కడా ఉపయోగించినట్లు కనపడదు. దీనికి ఈవిధంగా నానార్థాలు ఉన్నాయి కాబట్టి ఏవేవి సముచితమైన ద్రవ్య కోశవిధానాలు అను విషయంపై ఏకాభిప్రాయంఉన్న అర్థశాస్త్రవేత్తలు కూడ ఏది సముచితమైన ఆదాయాల విధానమను విషయంపై ఏకాభిప్రాయానికి రాలేకున్నారని శ్రీ సామ్యూల్‌సన్ అభిప్రాయం.

వ్వయిపరమైన ద్రవ్యోల్బణాన్ని అరికట్టడానికి సాధనంగా మాత్రమే దీనిని పశ్చిమదేశాలలో ఉపయోగించారు. ఉదా: అమెరికా, ఇంగ్లండ్, నెదర్‌లాండ్స్ బలమైన కార్మిక సంఘాలు ఈ దేశాలలోని ద్రవ్యోల్బణానికి ఒక ముఖ్యకారణంగ పరిగణింప బడుచున్నది. ఈ దేశాలలో వేతనాలపై ఆధారపడేవారి సంఖ్య ఎక్కువ. అయినప్పటికి ఈ దేశాలలో కూడ ఆదాయాల విధానము ఆశించిన ఫలితాలను ఇచ్చినట్లు కనిపించదు. వేతనాలను ఎప్పుడెప్పుడు ఎంతమాత్రం హెచ్చింపవచ్చును అనువిషయంపై ఆదేశ సూత్రాలను నిర్ణయించడంలోను, వాటిని అమలు జరుపడంలోను అమెరికాలో ఇబ్బంది లేర్పడినట్లు అధికారులు అంగీకరించారు. చాలకాలంగా అమలులో ఉన్నప్పటికి ఆదాయాల విధానం ఇంగ్లాండులోకూడ స్పష్టమైన ఫలితాలను సాధించలేదు. వేతనాల నిర్ణయంలోకూడ దీని ప్రభావం అంతంత మాత్రంగానే ఉండిపోయింది. ఉత్పాదకతలో పెరుగుదలఉంటే తప్ప, జీవనవ్యయ సూచికలోని పెరుగుదలకంటె వేతనాల పెరుగుదల హెచ్చుగా ఉండరాదన్న లక్ష్యంకూడ సాధింపబడలేదు. వేతనాల నిర్ణయానికై వేరవాడే ఏజన్సీ, కేంద్రీకృతమై ఉన్నప్పటికి నెదర్‌లాండ్సు దేశంలోకూడ ఈ విధానం పూర్తి సఫలత పొందలేదు. సమిష్టి డిమాండ్‌ను తగ్గించేయత్నం చేయకుండా ఆదాయాల విధానంద్వారానే ద్రవ్యోల్బణాన్ని అరికట్ట ప్రయత్నించడం ఉపయోగ రహితమని పారిశ్రామికంగా వృద్ధిచెందిన పశ్చిమ దేశాలుకూడ భావిస్తున్నాయి.

పశ్చిమ దేశాలలోని అనుభవం దృష్ట్యా ఆదాయాల విధానం భారతదేశంలోనూ మాత్రం ఎంతవరకు ఉపయోగపడగలదన్నది ముఖ్యమైన ప్రశ్న. భారత దేశంలోని ద్రవ్యోల్బణం ప్రధానంగా సప్లయి పరమైనది కాదు. ఈ దేశంలోని కార్మిక సంఘాలు పశ్చిమ దేశాలలోని కార్మిక సంఘాలంత బలమైనవికావు. ధరలు పెరుగుచున్నందున తమ వాస్తవిక వేతనం తగ్గకుండా చూచుకొనుటే ఈ సంఘములకు కష్టంతోకూడిన పనియైనది. 1961–70 మధ్య ద్రవ్యరూపంలో వేతనాలు 75 శాతం పెరిగినప్పటికి వాస్తవిక ఆదాయం (Real Income) రెండు శాతం తగ్గినట్లు చెప్పబడుచున్నది. 1960–72 మధ్య ద్రవ్యం రూపంలో జీతాలు పెరిగినప్పటికి నాల్గవ తరగతి ఉద్యోగులుతప్ప మిగిలిన అందరూ వాస్తవిక ఆదాయంలో కొంత కోల్పోయారే గాని లాభపడలేదని మూడవ కేంద్ర వేతన సంఘంకూడ చెప్పిఉన్నది. ఉత్పాదకతతో నిమిత్తం లేకుండా వేతన వృద్ధి పొందిన వర్గాలు భారతదేశంలో చాల తక్కువ. (బహుశా బాంకు ఉద్యోగులు మున్నగువారు) అంతే కాదు దేశంలోని నికర జాతీయోత్పత్తిలో వేతనాలు 6 శాతం మాత్రమే. ఈ 6 శాతానికి మాత్రం

ఆదాయాల విధానాన్ని వర్తింపజేసి మిగిలిన 94 శాతాన్ని వదలివేయుట న్యాయమా? ఆర్థిక వ్యవస్థకు సంపూర్ణంగ ఈ విధానాన్ని వర్తింపచేస్తే దీన్ని అమలు జరపడానికి కావలసిన గణాంక వివరాలు, యంత్రాంగం తయారుగ ఉన్నవా? నూటికి నలభై మందికి కనీస అవసరాలకు చాలినంత ఆదాయంలేని ఈ దేశంలో, ఈ విధానం ద్రవ్యోల్బణాన్ని అరికట్టుటకు ఎంత ఉపయోగకరమన్నది మరో ప్రశ్న.

కాబట్టి పరిస్థితులు మరింత విషమించక ముందే, వట్టి మాటలను, కొత్త వివాదాలను కట్టి పెట్టి, అవసరమైన మేరకు ద్రవ్య విధానాన్ని, కోశ విధానాన్ని ఉపయోగించి ప్రస్తుత ధరలలో వస్తు సేవ లకు గల సప్లయి డిమాండ్ల అంతరాన్ని తగ్గించ డానికి చిత్తశుద్ధితో కృషి చేయడం అత్యవసరం. ఆదాయాల విధానమను మంత్రాన్ని వల్లించినంత మాత్రాన ధరల పెరుగుదల నిలిచిపోదు, నేటి ద్రవ్యో ల్బణం సప్లయి పరమైనది కూడ అని ఋజువు అయి నప్పుడు, రాజకీయాలతో నిమిత్తం లేకుండా అన్ని వర్గాల ఆదాయాలను—కేవలం రాజకీయంగా బలహీన మైనవారి ఆదాయాలనే కాదు—క్రమబద్ధం చేయాలి. ఆదాయాల విధానం, సమర్థవంతమైన ద్రవ్య, కోశ విధా నాలకు అనుబంధమే గాని ప్రత్యామ్నాయం కాదని గ్రహించాలి. ధరల పెరుగుదల ఆర్థిక సమస్య మాత్రమే కాదు. మానవతా సమస్య కూడ. ఆర్థిక అసమానతలు, ఆర్థిక అస్థిరత్వం ప్రభుత్వాల పత నానికి, సాంఘిక అశాంతికి అనేక మారులు దారి తీశా యని గ్రహించాలి. ఇకనైనా మితిమీరిన లోటు విధా నానికి స్వస్తి చెప్పి సరియైన ఆర్థిక విధానం ద్వారా సమిష్టి డిమాండ్ పెరుగుదలను అదుపుచేసి అధికో త్పత్తికి వస్తువుల సక్రమం పంపిణీకి, 'బ్లాక్‌మనీ' నిర్మూలనకు, ధరల స్థిరీకరణకు ప్రభుత్వం కృషి చేయడం అవసరం.

(అయిపోయింది)

---



# నిరీక్షణ

శ్రీ కళాధర్

ఎన్ని నాళ్లని
ఎన్ని నాళ్లని.........?
తృప్తి నెరుగని యెడద హోరుల
గుర్తు దెలియని అడుగుజాడల
ఎన్ని నాళ్లని
ఎన్ని నాళ్లని.........??
వాంఛనై,
సౌందర్యారాధనా ఆకాంక్షనై,
అంది అందని చందమున
అందించు ప్రకృతి అందముల
లావణ్యముల
ఆకర్షణా హృదయార్తినై,
నానాటికీ
మది కారజాలని
దాహమై—వ్యథనందగా,
ఏనాటికీ
మధు వేదనా
సంగీతమై—నే నిల్వగా,
ఆరాటమే
అన్వేషణే
ప్రభావమై,
నవజీవమే
అనురాగమే
ఎదగానమై,
విరహాగ్ని పుష్పపరాగమై
మధుకీలనై
ఆంతర్య సంధ్యారాగమై
క్షణ భోగమై
నిర్వ్యాజమే
ఆనందమే
ఆదర్శమై
చాలి చాలని తృప్తితో
సద పైకి చూచెడి కల్వలా
వృథ పిక్కటిల్లిన కేకతో
దరి దప్పి జారెడి ఉల్కలా
విస్మృతికినై
విస్మృతికినై—నే
నెన్ని నాళ్లని
ఎన్ని నాళ్లని ........?
తృప్తి నెరుగని ఎడద హోరుల
గుర్తు దెలియని అడుగు జాడల
ఎన్ని నాళ్లని
ఎన్ని నాళ్లని.........??

---

# భాసుని మాయా మతంగజం

శ్రీమతి కె. కమల

విఖ్యాతములైన భాస నాటకాలు, పదమూడింటిలో రెండు. బృహత్కథ మాతృకగా గలవి. అవి.

(1) ప్రతిజ్ఞా యౌగంధ రాయణము.

(2) స్వప్న వాసవదత్తము.

ఈ రెండింటిలో వాసవదత్తకు ఉదయనుడికి జరిగిన ప్రణయగాథ వర్ణింపబడింది. ఈ కథ పతిజ్ఞాయౌగంధరాయణంతో మొదలై స్వప్నవాసవదత్తంలో పరిణతిని చెందుతుంది. ఈ రెండు నాటకాలలో నాటి రాజకీయ పరిస్థితుల ఒత్తిడి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కనిపిస్తూనే ఉంటుంది. ఇందలి నాయికా నాయకులందు మానవాతీత శక్తులెచ్చట ఆపాదించబడలేదు. మానవమాత్రులై యుండి కూడా ఉన్నత ఆదర్శములు గుణములు గలవారు ఉత్సాహ ప్రభు మంత్రశక్తి సంపన్నులు సాధించలేనిదేదియు ఉండదని ఈ కథలో నిరూపించబడింది. ఈ రాజకీయములైన ఒత్తిడులయొక్క పరాకాష్ఠ స్వప్నవాసవదత్తంలో చివరిదైన ఆరవ అంకంలో మహాసేనుడు తన రాజ్యాన్ని తిరిగి పొందిన ఉదయనుడిని అభినందిస్తూ పంపిన సందేశంలో కనిపిస్తుంది.

'కాతరాయేఒప్య శక్తావా
నోత్సాహస్తేషు జాయతే।
ప్రాయేణహి నరేంద్ర శ్రీః
సోత్సాహై రేవ భుజ్యతే॥'

విజిగీషువునకు మూడు శక్తులు ఉండవలెనని రాజనీతిశాస్త్రం చెబుతుంది. ఆ మూడు ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి అనేవి. అందు ప్రధానముగా ఉత్సాహ శక్తియే తక్కిన శక్తుల నన్నింటిని కోశ దండాదికములను సమకూర్చుకొనుటకు తోడ్పడుతుందని కూడా చెప్పబడింది, కిరాతార్జునీయము మొదలైన మహాకావ్యములలో. ఈ ఉత్సాహ శక్తిని ఏఏ పాత్ర ఏఏ విధంగా చూపించిందీ ఈ నాటకాల రెండింటిలోనూ చర్చనీయాంశము.

ప్రతిజ్ఞా యౌగంధరాయణంలో మహాకవి ఒక వైశిష్ట్యాన్ని చూపించినాడు. నాటకంలో నాయికా నాయకులు మనకు కనిపించనే కనిపించరు. కాని వారిని గూర్చి చూచినదానికంటె యెక్కువ తెలుసుకుంటారు ప్రేక్షకులు. ఈ నోటా ఆ నోటా వారిని గూర్చి వినడంవల్ల, ఈ నాటకంలో నిజమైన నాయకుడు యౌగంధరాయణుడే. అతడు 'ఉదయనుడిని చెర నుండి విడిపించకుంటే నా పేరే యౌగంధరాయణుడు కాదు అని ప్రతిజ్ఞ చేస్తాడు. ఉత్సాహశక్తి సంపన్నుడైన ఈ మంత్రి చేసే ఆలోచనల పైననే నాటక గమనం ఆధారపడియున్నది. యౌగంధరాయణుడి ప్రతి స్పర్థియైన భరతరోహకుడు అనే మంత్రి మహాసేనునికి కుడిభుజము వంటివాడు. తానే సార్వభౌముడననిపించుకోవాలని ఆశయము—మహాసేనుడికి చాలా ఎక్కువగా ఉంటుంది. ఆ ఆశయసిద్ధికోసం ఉదయనుడిని మోసగించి పట్టుకోవలెనని భరతరోహకుడు ఒక పన్నాగాన్ని పన్నాడు. దానిని వర్ణిస్తూ యౌగంధరాయణు డేమంటాడో చూద్దాం.

'[1]భో: వనగజ ప్రచ్ఛాదిత శరీరం నీలహస్తిన ముపన్యస్య ప్రద్యోతః స్వామినం ఛలయితు కామయితి. ప్రవృత్తి—రూపగతాన:'

అడవి ఏనుగు చర్మంతో కప్పిన నీలహస్తిని

---

1. ప్రతిజ్ఞా యౌగంధరాయణం — ప్రథమాంకం.

నిలిపి దాని కడుపును యోధులతో నింపి ఉదయనుడిని అది నిజమైన నీలహస్తియే అని భ్రమ పడేటట్లు చేశారని వార్త వచ్చింది యౌగంధరాయణుడికి. ఈ విధముగా గజమును నిలిపి ఉదయనుడిని మోసముతో బంధించినది ఈ భరతరోహకుడే. రాజుల జయాపజయములే మంత్రుల్లు తమవిగా భావించినపుడు వారి బుద్ధి పాదరసంవలె పారుతుంది. ప్రాణాన్ని ఒడ్డి రాజసేవ చేయడానికి నిలిచినవారు నిలుస్తారు. లేని మంత్రులు తోక ముడుచుకొని పోతారు. ఉదయనుడిని విడిపించడంకోసం యుద్ధం చేసి పట్టుబడ్డ యౌగంధరాయణుడు ఇలా అంటాడు:—

'యే ప్రార్థయంతిచ మనోభిరమాత్య శబ్దం।
తేషాం స్థిరీభవతు వశ్యతు వాభిలాషః'॥

ఈ భరత రోహకుడి బుద్ధి యౌగంధరాయణుడంతటివాడితో పోటీ పడతగింది. ఇతనిలోని ఉత్సాహశక్తి మాయా హస్తిరూపంలో పరిణమించి మహాసేనుడి మెప్పును పడసింది. ఇక పోతే ఇట్లాంటి గజాన్ని తయారుచేయడ మేమిటి? అపూర్వమైన నీల గజము నాగవనంలో విడిసిందని ప్రచారం చేయడ మేమిటి. గజాలను వేటాడుతూ గజగాములవరకూ పోయే ఉదయనుడి బలహీనతను ఉపయోగించుకొనడ మేమిటి. కేవలం ఇరవైమంది అశ్వికులతో మాత్రం ఉదయనుడు బయలుదేరి నాగవనంలోకి ఘోషవతీ ద్వితీయుడై పోయేటట్లు అతనిని కవ్వించడ మేమిటి? అనే ప్రశ్నలు వచ్చినపుడు వీటన్నిటికి ఉదయనుడి తొందరపాటు, గజముల వేటయందలి మక్కువ, సంగీతంలో అతనికి గల ప్రవేశముపై గట్టి నమ్మకము అని తెలుస్తుంది. ఈ మాయ ఏనుగు ఉదంతం చదివితే ఏ కొద్దిపాటి ఇంగ్లీషు సాహిత్య పరిచయమున్న వారికైనా ట్రోజన్ యుద్ధంలోని ఉదంతం తప్పకుండా మనస్సుకు తడుతుంది. ఈ యుద్ధ గాథను వర్ణించే 'ఇలియడ్, ఒడిస్సే' కావ్యాలు గ్రీకు భాషలో మనకు మహాభారత, రామాయణాదుల వంటి గౌరవాన్ని కలిగి ఉన్నాయి. ఈ కావ్యాలలో మొదటిదైన 'ఇలియడ్' అనే కావ్యంలో హెలెన్ అనే రాణి కొరకు గొప్ప యుద్ధం జరుగుతుంది, గ్రీకులకు, ట్రోజన్‌లకు మధ్య. పదేండ్లపాటు యుద్ధం జరిగిన తర్వాత 'ట్రాయ్' నగరాన్ని చుట్టుముట్టియున్న గ్రీకు సైనికులు ఆ నగరమును జయించడానికి ఒక ఎత్తు వేస్తారు. ఒక చెక్క గుఱ్ఱాన్ని తయారుచేసి ట్రాయ్ నగరం పొలిమేరలలో నిలిపి గ్రీకు వీరులు తమ గుడారాలను ఎత్తివేస్తారు. ఈ గుఱ్ఱం కడుపునిండా గ్రీకు యోధులుంటారు. వారి యెత్తుగడ పారుతుంది. ట్రోజన్ సైనికులు శత్రుసేనలు తిరిగిపోవడం చూసి విజయలక్ష్మి తమనే వరించిందని సంతోషించి విజయోత్సాహంతో ఊరి బయట చూడ ముచ్చటగా నిలిచిన చెక్క గుఱ్ఱాన్ని చుట్టు ముడతారు. దానిని మహాకవి ఎట్లా వర్ణించాడో చూడండి.

2. "And build a horse up mountain-huage by pallas'art divine
Fair fashioning the ribs there of with timbers of the pine
And feign it vowed for safe return and let the fame fly forth
Herein by stealth a sort of men chosen for booties worth
A mid its darkness do they shut; the caverns inky lost
Deep in the belly of the things the fill with armed host."

ఈ గు న్ని "Fashioned tree" అని వర్ణించాడు మహాకవి. ఒక ట్రోజన్ వీరుడు 'Trust not the horse' అని కోపంగా అరుస్తూ ఒక బల్లెమును గుఱ్ఱం పైకి విసిరాడు. ఒక పెద్ద శబ్దం వచ్చింది గుఱ్ఱంలోనుండి. కాని ఇంతలో ఒక యువకుడు ట్రోజన్ సమ్రాట్ 'ప్రయం' వద్దకు వచ్చి తనను గ్రీకు సైనికులు, తాము తిరిగి ప్రయాణం చేయబోతూ జలదేవతకు బలిగా అర్పించదలచుకొన్నారని, అందువల్ల తాను తప్పించుకొని

2. The Aelids of Virgil " - by William Moris" Book-II, pp. 30-31.

పారిపోయి వచ్చానని, ఇకపై ట్రోజన్‌లు తనకు ఆశ్రయము ఇవ్వకపోతే తనకు మరణమే శరణ్యమని అంటాడు. అతని మాటలు నమ్మిన ట్రోజన్‌రాజా ఈ చెక్కగుఱ్ఱాన్ని గురించి వివరాలు అడుగుతాడు. అప్పుడు గ్రీకు సైనికులు ఈ గుఱ్ఱాన్ని తమకు 'యుద్ధంలో' అదృష్టం కలిసి రావడానికి నిర్మించారని కాని గ్రీకు దేవతను వారు తృప్తి పరచలేకపోగా అదృష్టం విడిచి కొట్టిందని ఆ గుఱ్ఱాన్ని కనుక ట్రాయ్ నగరం లోపలికి తీసికొని రాగలిగితే ఆ రాజా ఆసియా సంతతిని పరాక్రమంతో గెలుచుకొని రాగలడని ఆ యువకుడు నమ్మిస్తాడు.

'But, if your hands shall lead it up within the city wall.

Then Asia free and willing it to People's house shall come with mighty war'

పదేండ్లపాటు జరిగిన యుద్ధంలో ఎందరో పరాక్రమవంతులైన 'Achilis' వంటి గ్రీకు హీరురకు లొంగని ట్రోజన్‌లు, ఈ కల్లబొల్లి మాటలకు లొంగిపోతారు.

'బుద్ధిః కర్మానుసారిణీ' గదా! జరగకూడనిది జరగనే జరిగింది. ట్రోజన్ నగరపుకోట గోడలను పగులగొట్టి ఆ గుఱ్ఱాన్ని లోపలికి ప్రవేశపెడుతారు. రాత్రి కాగానే గ్రీకు వీరులంతా తాళ్ళు పట్టుకొని క్రిందికిదిగి నగర పాలకులందరిని సంహరించి ప్రమత్తులయిన ట్రోజన్ సైనికులపై దెబ్బతీసి నగరానికి నిప్పంటిస్తారు. ఇదిట్రాయ్ నగరం ధ్వంసమైన కథ. గ్రీకులకే చివరి విజయం లభిస్తుంది. ఈ కథ ఈ నోటా, ఆ నోటా 'Alexander' వెంటవచ్చిన గ్రీకులద్వారా మన దేశానికి చేరి ఉంటుంది అది భాస మహాకవిని ప్రభావితుణ్ణి చేసి భారతీయులకు విజయలక్ష్మికి ప్రతిరూపమైన గజంగా ప్రతిజ్ఞలో దర్శన మిచ్చి ఉంటుంది. కనుక ఈ కథలోని మాయా గజానికి, ఇలియడ్‌లోని మాయా అశ్వానికి ఇంకా ప్రాచీనమైన సంబంధ మేదైనా ఉంటుందని, వీటి రెండింటికిని మూలము ఎక్కడనైనా ఉండవచ్చునని ఊహించవచ్చును. దీనిని బట్టి అతి ప్రాచీన కాలంలో క్రీస్తుకు పూర్వమే భారత యవన సంస్కృతులు ఒకదానికి ఒకటి దగ్గరగా మన మనుకున్నంతటికంటె దగ్గరగా వచ్చియున్నవని అనుకోవడం సహజం. ఇలియడ్‌లో వర్ణించిన చెక్కగుఱ్ఱం గురించి మనకు ఎన్నో విషయాలు తెలుస్తున్నవి. కాని భాస మహాకవి ఈ మాయా గజాన్ని గురించి ఒకే ఒక వాక్యంలో చెప్పినాడు. దానికి కారణం నాటకంలోక ఒక సన్నివేశానికి వర్ణన కంటె ఎక్కువ ప్రాధాన్యం యివ్వాలి కనుక. ఇలియడ్ మహాకావ్యం కనుక ఎక్కువ వర్ణనాత్మకంగా ఉంది.

ఇక్కడ మనకు కనిపించే సామ్యము కేవలం యాదృచ్ఛికమే అని అనుకోవడానికి వీలులేదు. దీనికి బలమైన కారణమేదో ఉండిఉంటుంది. ఇంకా పరిశీలిస్తే భారత యవన సాహిత్యాలలో ఒకదానితో నొకటి పోల్చదగినవి ఎన్నో సాంస్కృతిక విషయాలు వెలుగులోకి రాగలవు. అతిప్రాచీన కాలంనుండి కూడా బాగా అభివృద్ధి చెందిన రాజనీతి యుద్ధ కళలకు ఈ మాయా జంతువుల సృష్టి ఒక గొప్ప నిదర్శనమై ఉంది.

---

# ది ట్రాజెడీ!

## "వైవియల్యన్"

కిటికీ కవతల దూరంగా చీకట్లో
మెరిసీ మెరియనట్లుగా మెరుస్తోందొకటి
అది నక్షత్రం—అది నా గమ్యం!

చేతికి బారెడు దూరంలో,
కాస్త చేరువలోనే;
విరిసీ విరియనట్లుగా మురిపిస్తోందొకటి;
అది విరిసే దిరిసెన పుష్పం!
అది నా ఆశల ప్రతిరూపం!

ఎట్టెదుటగా, ఎగసెగసి పడుతున్నాయి
తాకీ తాకనట్లుగా
అంబరాన్ని తాకు తలా!
అవి అలలు! అవి నా కలలు!

* * *

నా కుడి ప్రక్క నొకడు!
ఎడమ ప్రక్క నొకడు!
ఇటు వైపున పదేళ్ల పసివాడు!
అటువైపున పది ఏడుల ముసిలాడు!
ఇటు చూస్తే కోర్కెల చాపల్యం!
అటు చూస్తే కొండంత వైరాగ్యం!

* * *

మూర్ఖుడా విను!
రిక్క రాలిపోతుంది!
పువ్వు వాడిపోతుంది!
అలలు అంబరాన్నంటవు!
నీ కలలు కరిగి పోతాయి!
అనుభవించు! శాపగ్రస్తుడా! అనుభవించు!

---

# మృచ్ఛకటికము - సాంఘిక వ్యవస్థ

శ్రీ యామిజాల పద్మనాభస్వామి

ఏ శతాబ్దములో పుట్టినా యీ శతాబ్దానికి సమన్వయించుతూన్న అసాధారణ రూపకం మృచ్ఛకటికం. శాకుంతలవంటి విశ్వవిఖ్యాతి నాటకాలతో సమంగా ప్రఖ్యాతి పొందింది. ఏతత్కృతి కర్త శూద్రక మహాకవి క్రీ॥ శ॥ అయిదారు శతాబ్దాల నడుమ వుండేవాడని సందిగ్ధంగా చెప్తున్నాయి చరిత్రలు. మన దేశములో చరిత్ర దారిద్ర్యం యిలా యెందరు కవులకో పట్టివున్నదే. దాని గురించి కలవరింతలూ, పలవరింతలూ ఎందుకూ పనికిరావు. వాసటిగీత బాగా వున్న కవుల గ్రంథాలు కొన్ని బ్రతికి వున్నాయి. కొన్నిటికి ఆ సౌభాగ్యమూ పట్టలేదు. పేరు వినవస్తుంది కృతి కన్పించదు. ప్రబంధ పరమేశ్వరుని రామాయణం ఏమైనట్టు? కవి సార్వభౌముని గ్రంథాలు కొన్ని కనిపించవు. కనిపించే కొన్ని కృతులపై తగవులూ తంటాలున్నూ. క్రీడాభిరామం శ్రీనాథుడు రాయలేదు. ఏ వల్లభరాయడో రాశాడు. పల్నాటి వీర చరిత్ర కూడా శ్రీనాథుని రచన కాదు. ఏ మాచర్ల జంగమో రాశాడనే బుద్ధిమదగ్రగణ్యు లింకా వున్నారు. అంత ఉద్దండశైలికి సృష్టికర్త యింత పేలవమైన దవరా పద్యం కైతే రాశాడా? అని కొందరి హేళన! అంత సరసమైన ఉత్తర రామాయణాన్ని పాపరాజు రాయలేదు. ఆయన దగ్గర చేబదులుగా తీసుకున్న యిన్నూరో మున్నూరో రూకలు తీర్చలేక పుష్పగిరి తిమ్మన్న ఉత్తరరామాయణం వ్రాసి పాపరాజు కిచ్చినట్టూ, బుద్ధిహీనుడై పాపరాజు తన పేరుతో ఆ మహా కావ్యాన్ని తన కృతిగా చేసుకుని తిమ్మన్నని ఋణవిముక్తుణ్ణి చేశాడనిన్నీ చెప్తున్న మహానుభావు లున్నారు. ఇదంతా ఎందుకు నన్నపార్యుని భారత భాగానికే 'ఎసరు' పెట్టిన విమర్శకులున్నారు. అతని సహపాఠి నారాయణభట్టు రాశాడని వారి ధోరణి. ఆముక్తమాల్యద కూడా యీ రొంపిలో పడిన గోవు కాలేదా? ఆంధ్ర కవితా పితామహుడు రాసి యిస్తే సాహితీ సమరాంగణ సార్వభౌముడు తన పేరు పెట్టుకున్నాడు. అలాగే అనవచ్చు. శూద్రకుడు రాజు కనక ఆస్థానకవి యెవడో మృచ్ఛకటికం వ్రాసి శూద్రకునికి సమర్పించగా ఆ మహారాజు తన పేరు పెట్టుకున్నాడని. సవిమర్శగా చదివితే మృచ్ఛకటికం రాచకైతగానే కనిపిస్తుంది. అందులోనూ పాలకుని రచన అని స్పష్టమవుతుంది. ఈ రూపకాన్ని యీనాడు పాలకులు, పాలితులూ సాదరంగా చదవాలని నా కోరిక. గురుపాదుల ఆం॥ కృతి ఆధారంగా యీ వ్యాసాలు వ్రాస్తున్నాను.

శూద్రకుడు క్షత్రియుడు. పరిపాలన భారం వహించినవాడు. సామాన్యుడుకాడు. సుశిక్షణగా వేద వేదాంగాలు అధ్యయనం చేసిన ద్విజుడు. గణితము వైశికవిద్య. దంతిశిక్ష. అతని ప్రత్యేక విద్యలు. శివానుగ్రహమును పొందిన జ్ఞాని. ఆత్మజ్ఞానం శివుని యనుగ్రహంవల్ల కలుగుతుంది.

శివరూపాత్ జ్ఞాన మహం త్వత్తో
ముక్తిం జనార్దనాకారాత్,
శిఖిరూపా దైశ్వర్యం
భవత శ్చారోగ్య మిచ్ఛామి'

అని ద్వాదశార్యాస్తోత్రం చెప్తుంది. శూద్రకు డెంత రాజయినా ఆత్మజ్ఞాని.

అశ్వమేధంచేసి సురలను, క్షితిసురులను పనియించినవాడు. శత్రుగజములం గూల్చు చేలావు గల

వాడు. ఇంకొక విశేషం. విశేషమేమిటి పూర్వజన్మ సుకృత ఫలం. నూరేండ్లపైె పదిదినాలు బ్రతికిన పుణ్యజీవి. తరువాత శరభంగ మహాముని లాగా మేను అగ్నిలో వ్రేల్చి దివ్యపదం చూరగొన్న ధన్యజీవి.

శూద్రకునకు తెలిసిన విద్యలలో 'వైశికం' ఒకటి. వేశ్యా జీవితానికి సంబంధించిన విద్య. వాత్స్యాయనుడు తన కామసూత్రాలలో వైశికం చెప్పి వున్నాడు. దాన్ని పురస్కరించి భాసుని 'చారుదత్తం' ఆధారంగా పాత్రసృష్టికి తన అప్రతిమాన ప్రతిభ నుపయోగించి సార్వకాలికము, విశ్వజనీనమూ అయిన 'మృచ్ఛకటికం' సంతరించాడు.

'బ్రాహ్మణుడు పేదవడిన వ్యాపారివడుచు
చారుదత్తుడనంగ నుజ్జయినిఁ గలడు
కలదు వేశ్య యొకర్తు చక్కదనమున వ
సంత శోభనుబోలు వసంతసేన,
'వారి యిరువుర ప్రేమానుబంధ మిందు
వర్ణనీయంబు, కలదు సర్వత్ర నీతి,
తెలియు దుర్వ్యవహారంబు, ఖల చరిత్ర
వితము, భవితవ్యతావశ్యకతయు దీన.'

అని యీ ప్రకరణం స్వరూప స్వభావాలు సూత్రధారునిచే చెప్పించాడు.

మొదటి పద్యంవల్ల నాయిక వేశ్య అయిన వసంతసేన, నాయకుడు బ్రాహ్మణుడు చారుదత్తుడును అని తెలుస్తూంది.

రెండో పద్యంవల్ల ఆ నాయికా నాయకుల ప్రేమానుబంధం, నీతి, దుర్వ్యవహారం, ఖలుల చరిత్ర, భవితవ్యత — అనేవి దీనియందు తెలుసుకోదగ్గవని గ్రహించవలసి వుంది.

నాయిక వేశ్య, నాయకుడు బ్రాహ్మణుడు వుండడం ప్రకరణం లక్షణం. నాయకుడు ధీరశాంతుడు. ధీరశాంతత్వం బ్రాహ్మణుడికే చెల్లుతుంది.

కొట్టితే తింటాడు గాని తిరిగి చెయ్యి చేసుకోలేడు. శర్విలకుడి గురించి ఏమంటావు? అవి ఆడుగుతారేమో? శర్విలకుడు జన్మనా బ్రాహ్మణుడైనా వృత్యా గజ దొంగ. కనక నాయకలక్షణం గాని, శాంతత్వం గాని అలాటి ఉపనాయకులవట్ల ఆపేక్షించ నక్కరలేదు.

చారుదత్తుడు పేదవడిన వ్యాపారి వడుచు. వ్యాపారులు పేదవడడం కేవలం స్వార్థంచేత. లేదా ప్రలోభంచేత. కాదా వ్యాపారంలో నేర్పు లేమి. చారుదత్తుడు అలాటివాడు కాడు.

'మందు వేసవిలోన నమస్త జంతు
వులకు నీరిడి యెండిన కొలను పగిది
రిక్తులమ్ర బోవ నతడు దరిద్రు డయ్యె
గాని యైశ్వర్య మదమున గాదు సూవె'—

అని సామాన్యుడైన విటుడు రాజస్యాలకునితో చారుదత్తు పేదరికాన్ని గూర్చి అభివర్ణించాడు.

ఐశ్వర్యమదం అంటే కన్నూ మిన్నూ గానక విలాసాలకూ కర్చుపెట్టుతూ భోగాలరాయళ్లయిపోడం తుదకి నెత్తినగుడ్డ వేసుకుని కాళ్లు చాచుకొని చావచుట్టులాగా తలుపు సందున కూర్చొనేస్థితికి రావడం కూడా వుంటుంది కొందరకు. చారుదత్తుడు వ్యాపారంవల్ల వచ్చే సొత్తును యాచకులకు రెండు చేతులా యిచ్చిన దానవీరుడు. కొండవంటిది ఒకొక్క రాయి తీసేస్తూ వుంటే కొన్నాళ్లకు తరిగిపోతుంది. చారుదత్తుని దావ శీలత అలాటిదై పేదనుచేసింది. కనుకనే ధనము లేదని అతడు విచారించలేదు.

'బ్రతికిచెడితి నటంచు నేవగవ; సిరులు
వచ్చియును బోయి, వచ్చుచుఁ బోవుచుండు
ధనములేకున్కి మిత్రబృందమ్ముగూడ
వదలు నను దుఃఖమే నన్ను వదలకుండె'—

అని మైత్రేయునితో అంటాడు. అలాటి పేదరికములోకూడా కులాచారాన్ని వదలలేదు. దేవతార్చన తప్పకచేసి గృహదేవతలకు బలియివ్వడం, నాలుగు త్రోవలు కలిసేచోట గ్రామదేవతలపేర భూతబలి యివ్వడం మానలేదు.

ముంగిట గృహదేవతలకు బలియిచ్చి యిటూ అటూ గుమ్మంప్రక్క పెరుగుతూన్న పచ్చగడ్డిలోంచి వచ్చి పురుగులుతింటూన్న యవలను చూసి నిర్వేదంగా నిట్టూర్చి యిలా అనుకున్నాడు పాపం!

'తొల్లి యేయింటి గుమ్మము లెల్ల నిండె
బలులు తిను హంస సారస కులముచేత
నట్టి మా గుమ్మముల బలియవలు తినునె
పెరుగు పచ్చికలోనుండు పురుగులకట!'—

ధనమున్నపుడు తామువేసినబలి ఉత్కృష్టమైనది కనుక హంసలు, సారసాలూ వచ్చితినేవి. ఇపుడు తాము రిక్తుడు. వేసేబలి యవలు. మరి పురుగులు కాక హంసలు వగైరావచ్చి అవి తింటాయా?.

అందుకే విదూషకుడు మైత్రేయు డన్నాడు. నువ్వింత భక్తితో పూజిస్తున్నా ఈ దేవతలకు నీమీద అనుగ్రహం కాకపోయెగదా, యిక వీరికి బలియిచ్చుట వలన ప్రయోజనం ఏమిటి?

ఆ మాటను చారుదత్తుడు ఖండించాడు. 'అట్లనరాదు. గృహస్థులకిది నిత్యమైన విధి.

'తపముచే వాక్కుచేత, చిత్తమ్ముచేత
బలులచేతను బూజింపబడిరయేని
సంతసింతురు వేల్పులు; శమము గల్గు
వారికేటికి నేటు విచారణములు'—

కనుక నీవుపోయి గ్రామదేవతలకు బలియొసగి రమ్ము'— అని అన్నాడు,

మానవుని పేదరికానికీ వేల్పుల అనుగ్రహానికీ సంబంధంలేదు. మానవుడు—అందునా గృహస్థుడు నిత్యనైమిత్తికములగు విధులను శ్రద్ధాభక్తులతో ఆచరించాలి. అలా ఆచరిస్తే వేల్పులు సంతృప్తులవుతారు. ఇంకోవిశేషమేమిటంటే గృహస్థుశమగుణ ధనవంతుడవుతాడు. గార్హస్థ్యాన్ని దేవతానుగ్రహావాప్తిగా నెరపేవారికిది చక్కని హితబోధ.

శూద్రకుడు రాజా కనుక కొన్ని సామాన్య విషయాలకు కూడా చక్కని సంబంధం కల్పించి చెప్తూ వచ్చాడు.

సాయంసమయమునందు నగరవీధులలో వేశ్యలు, విటులు, చేటులు, రాజానుగ్రహము గల పురుషులూ తిరుగుతూ వుంటారు. అలా తిరగడం ఆచారమవి కాదు. స్వేచ్ఛాజీవనాన్ని వాహ్యాళిరూపంగా అనుభవిస్తూ వుండడం వారి కలవాటు అని అనుకుందాము.

వాళ్లంతా తిరుగుతూవుంటారు. కనక నాకు భయం. గ్రామదేవతలకి బలియివ్వడానికి చతుష్పథానికి వెళ్లమంటాడు మైత్రేయుడు. ఆమాట కనుగుణంగానే వసంతసేనను వెంటాడుతూ విటుడు, శకారుడు (రాజుగారి ఉంపుడుకత్తె తమ్ముడు) వస్తారు.

వసంతసేన వేశ్య. శకారుడు రాజానుగ్రహం సమృద్ధిగా వున్నవాడు, కనక కప్పివిప్పి పమర్థుడు. పరమ మూర్ఖంగా వ్యవహరించే ఖలాగ్రేసర చక్రవర్తి. వీని సామర్థ్యం ముందుముందు తెలుస్తుంది. ఈ రూపకానికి వీడే ప్రతినాయకుడు. వీనితో ఒక విటుడు వుండడం తాటితో దబ్బనంలాగా సహజమే—*

వేశ్యలు దేవాలయాలలో దేవతా సేవగా నాట్యం చేయడం ఆచారం. వారు దేవాలయములో వసంతసేన నాట్యం చేసిననాడు చారుదత్తుడు మొదలైనవారున్నారు. శకారుడుకూడా వున్నాడు. వసంతసేనా చారుదత్తుల తొలివలపునకు అదే రంగం. శకారుడది గమనించి కలిమిచేగాని బలిమిచేగాని ఆమెను కైవశం చేసుకోవాలి. ఆనాటి సాయంకాలం చక్కగా ముస్తాబై వస్తూన్న వసంతసేనను చూచి వెంటపడ్డాడు. రాజునకు బావమరది. ఇక వానికి గల కలిమికీ, బలిమికీ వ్యాఖ్యానం అనవసరం. లోకంలో 'రాజు బావమరదేనా కావాలి. సానిదాని తమ్ముడేనా కావాలి' అనేమాట వుండనే వుంది. ఆమాట ఎంతవాణ్ణి బంధిస్తుంది. ప్రసక్తాను ప్రసక్తంగా చిన్నగాథ చెప్తున్నాను చదువరుల మనోరంజనానికి;—

భోజమహారాజు పట్టమహిషి లీలావతి. ఆమె గుణవంతురాలు. గుణవంతురాలు కాకపోతే భోజునంతవానికి పట్టపురాణి అవుతుందా? అది అలా వుంచుదాము. ఆమెకొక తమ్ముడున్నాడు. వాడు చదువుకొన్న మూర్ఖుడు. ఒకమారు అక్కగారిని చూదామని ధారానగరానికి దయచేశాడు. ఉందీ లేదూ అనే విచారం లేదు. సుష్టుగా విందులారగిస్తున్నాడు, అచ్చు విడిచిన ఆంబోతులాగా తిరుగుతున్నాడు. పల్లెలలో ఒకవగ ఆ దూడను ఏ పెద్దల పేరనో, గ్రామదేవత పేరనో వెన్ను చివరను ముద్రలువేసి విడిచిపెట్టడం ఆచారం. ఇప్పుడూ ఉందనే అనుకుంటాను. నాకీ యిరవైయేళ్ల మదరాసు మహానగరవాసములో అలాటి ఆచారపుబెద్దులు కనిపించలేదు. కాని కొన్ని చుంబోతులు అక్కడక్కడ కంటపడుతున్నాయి. అవి జన్మనా మేకలు. కనక అవి మొక్కుబడి బలంవల్ల తెగబలిసినా ఏమీ అపకారం చెయ్యవు. తప్పించుకొంపోతూవుంటారు. అలా పల్లెలలో వదిలిన ఆ దూడలు తెగబలిసిపోతాయి, ఏచేలుమేసినా ఏమీ అనరు వాటిని. అంత స్వేచ్ఛాజీవులు ఎక్కడో సకృత్తుగావుంటార. ప్రస్తుత గాథానాయకుడు భోజరాజుగారి దేవేరిగారి తమ్ముడు అలాటివాడు. అతగాడికి గుర్రపుస్వారీ బాగా వచ్చు. తనలాగే బాగా బలిసివున్న గుర్రాన్ని ఎక్కి రాజవీథిలో షికార్లుచేయ ప్రారంభించాడు, పోతే పోనీ మనకేమని, ప్రజలు తప్పుకొంటూవుండేవార. పొరపాటున యెవరేనా ఎదురైతే గుర్రాన్ని కొట్టే కొరడాతో చురుక్కుమనేట్టు సన్మానంచేసేవాడు. ఎవరేమనడానికి గుండెల్లేవు. రాజుగారి బావమరిది మరి... ఆ సన్మానాలూ, సత్కారాలూ మంత్రులకుకూడా అప్పుడప్పుడు యాదాలాభంగా సంక్రమించేవి. కాని ఏమి చెప్పుకుంటారు? నగరం అంతా అల్లకల్లోలం అయింది.

మంత్రులొకనాడు కాళిదాసమహాకవిని దర్శించి మనవిచేసుకున్నారు. ఆయనమాత్రం ఏమిచెయ్యగలడు? ఆలోచించాడు. ప్రజాక్షేమంకోసం కొరడా దెబ్బలు తినడానికి ఒప్పుకొన్నాడు. వీథిలోకి బయల్దేరాడు. గుర్రం హుషారుగావస్తూంది. కవిగారు ఎదురయ్యారు. ఫట్మన్నాది కొరడా. కాళిదాసుగారి మనస్సు చుర్రుమన్నాది. దెబ్బతిని ఎదురుగా నిల్చున్నాడు. గుర్రం ఆగింది. మళ్లీ కొట్టబోయాడు. ఆ మహానుభావుడు లీలావతిదేవిగారి తమ్ముడు. ఆ స్థితిలో మహాకవి ఒక పద్యం చెప్పాడు.

'చతురం తురగం పరివర్తయతః
పథి పౌరజనాన్ పరిమర్దయతః
వహితే భావభాగ్య భవోవిభవోః—
భగినీ భవ భాగ్య భవో విభవః'.

'గుర్రాన్ని బహు నేర్పుగా నడిపిస్తున్నావు. అలాగే దారిలో ఎదురైన పౌరుల్ని స్వేచ్ఛగా చిత క్కొడుతున్నావు. కాని యిదంతా నీ జన్మకి పట్టిన భాగ్యంకాదు. నీతోబుట్టువుకి సంబంధించిన భాగ్య ప్రభావం సుమా'!— అని పై పద్యానికి సారం.

'భగినీభవ' అని నేనిచ్చాను. దానికి 'వ'కి బదులు ఇంకో అక్షరముతో పాఠాంతరంవున్నట్టు పారంపర్యమైన వినుకలి.

ఆ దెబ్బతో వాడు గుర్రాన్ని వెనక్కి తిప్పాడు. అక్కగారి దగ్గరకువెళ్లి ఏడిచాడు. కాళిదాసుకి తగిలిన కొరడాదెబ్బకన్న ఘనంగా ఈ దెబ్బ ఆ అక్కకీ, తమ్ముడికీ కూడా జీవనాశాలకి తగిలింది. అక్క తమ్ముణ్ణి చీవాట్లు పెట్టింది. 'నా పరువు నడి వీధిలో తీసేశావు. బుద్ధితెచ్చుకో యికనైనా' అన్నది. ఆ రాత్రే ఆ 'స్థితప్రజ్ఞుడు' తనవూరికి ప్రయాణం కట్టాడు—

ఈ గాథ పుక్కిటిపురాణమే అనండి. మరే మనండి. ఆయన కాళిదాసే కానీయండి. మరేదాసో కానీయండి. రాజుగారి బావమరదీ అంత స్వేచ్ఛగా, కుడి యెడమ భేదజ్ఞానం లేకుండా ప్రవర్తిస్తాడనడానికి యీలాటి గాథలు వుపకరిస్తాయి.

ప్రస్తుతమైన మృచ్ఛకటికము నందలి 'శకారుడు' అలాటి బావమరది. కనక వెలయాలైనా సుగుణశీల అయిన వసంతసేనను నడువీధిలో పట్టు కోడానికి వెంటపడ్డాడు: అంతవరకూ అంగీకరించ వలసిందే వాని ప్రవృత్తిని. ఈనాటికీ యిలాటి వ్యక్తు లుంటారని తెలిసిన వారు చాలమంది వుంటారు.

ఈ రూపకం వ్రాసినవాడు ఒక మహారాజు. ఆ విషయం మరిచిపోకూడదు.

వసంతసేన ఆ నరరూపరాక్షసుని బారినుండి తప్పించుకొని వాడుచెప్పిన గుర్తునుబట్టి ప్రక్కనే వున్న చారుదత్తుని యింటికి పారిపోయి ఆత్మగౌరవాన్ని కాపాడుకున్నది.

శకారుడు చారుదత్తునింటికి వసంతసేన పోయినదని తెలిసి వెలుపలకువచ్చిన మైత్రేయునిద్వారా చారుదత్తునకొక సందేశం పంపుతూ—

'దానిం దీసికొనివచ్చి చేతులార నీవే నాకు సమర్పించితివేని నధికారములతోడి వ్యవహారము ముదర కుండ చులకనగా తేలిపోదువు. నాకును నీయందు దయ గలుగును. లేదేని నీకును నాకును బ్రతికియున్నంతవర కును విరోధము తప్పదు'—అని నా పలుకులు బోధ పఱచుము.'

అలా ఒకవేళ మైత్రేయుడు చెప్పకపోతే

'తలుపు సందుఁనపెట్టి నొక్కిన వెలగగాయ వలె నీతల మడమడ లాడించెదను.'—అన్నాడు.

'అధికారులతోడి వ్యవహారం'— తానే అధికారి నని చెప్పక చెప్పకుంటున్నాడు రాజ స్యాలకుడు. అధి కారులందరూ తాను చెప్పినట్లు చెయ్యవలసిందే. అలా చెయ్యనివాడికి ఆ క్షణంలోనే వుద్యోగం వూడిపోతుంది. 'ఈ అధికారి నామాట వినలేదు' అని అక్కతో చెప్తాడు. అక్క బావదగ్గర మూతి బిగిస్తుంది. చుర చుర చూస్తుంది. చిటపటలాడుతుంది. ఇంకా ముది రితే దిగ్బంధనాస్త్రం ప్రయోగిస్తుంది. దానితో అంతవాడూ జోహార్ !

'నీ పాదాఁ భోజ రజః ప్రసాదములు
మా ప్రాణంబు లబ్జాననా!' అన్నారు.

వలునినోట యింద్రాదులంతవారు. సామాన్యులు 'శాకాయ వాస్యాత్ లవణాయ వాస్యాత్'— విటుడు వంటివాడు చారుదత్తుణ్ణి ప్రశంసించాడు.

'రత్నము రత్నముతో కలియక గాజురాతితో కలియునా? ఈ మూర్ఖునితో నేమి? ఈమె యతని యింటికే పోవుగాక' అని తనలో అనుకున్నాడు. అంత ఉత్తముడు, ఉదారుడు చారుదత్తుడు. కాని శకారుని

దృష్టిలో చారుదత్తుడొక బీదబాపడు. స్త్రీ'దరిద్ర చారుదత్తుడు' అని ఆతనికి 'దరిద్ర' బిరుదమిచ్చిన పొగరుబోతు. అట్టిచో మైత్రేయుని తల మడమడ లాడించెద వనుటలో అబ్బురపడ నక్కర లేదు.

శకారునివంటి 'దుండగీండ్రవల్ల సామాన్యుల కేలాటి అపకారము జరుగకుండ రాత్రులందు తలారులు వీధులలో గస్తీ తిరుగుచుందురు' వసంతసేనను పంపివేసిన తరువాత తోటలోనుండి యింటికిపోతూ చారుదత్తుడిలా అంటాడు మైత్రేయునితో—

'కల కలము వాసె రాజమార్గంబులెల్ల
పురమునిండ తలారులు తిరుగు చుండ్రి
మోసపోకుండ పోవలె; దోసములకు
పుట్టినిల్లుగదా యెప్పడిట్టిరాత్రి—

వసంతసేన యింటికిపోయినదే గాని మనసు చారుదత్తుని పైనే. తెల్లవారాక చారుదత్తుణ్ణే తలుచు కుంటూ వరాకుగా కూర్చున్నాది. అంతలో చేటి వచ్చి 'అమ్మా! మీ అమ్మ స్నానముచేసి దేవతాపూజచేసికొమ్మని చెప్పినది' అంటుంది. ఆ మాటకి వసంతసేన 'నేనినాడు స్నానముచేయను. బ్రాహ్మణునిచేతనే పూజచేయింపుమని మా యమ్మతో మనవి చేయుము—' అని అంటుంది.

వేశ్యలు వడుపువృత్తితో కాలం గడుపుతూన్నా ఆనాడు భక్తిశ్రద్ధలతో దేవతార్చన స్వయంగా చేసు కొనేవారు. ఏమైనా ఆటంకాలు వస్తే పురోహితునిచేత ఆనాటి పూజఅయిందని పించేవారు. ఈ ఆచారం వేడుకూడా యింకా సజీవంగా వున్నట్లు వింటూ వుంటాము. మంచిదే.

ఏమిటో! బ్రాహ్మణులే పూజాపురస్కారాలు చేస్తూ మడీ, తడీ అని వుంటారని అనుకోడమేగాని ఎందరు విధిగా సంధ్యోపాసన చేస్తున్నారో గట్టిగా చెప్పలేము. బ్రాహ్మణేతరులు భక్తిపరులుగా వున్నారని చెప్పడానికి చాలా వుదాహరణలున్నాయి. కాఫీ తాగాక సంధ్యావందనం ఎందుకు చెయ్యకూడదు ? అనే మగాళ్లూ, కాఫీతాగాక దీపంపెట్టితే దేవుడు వద్దంటాడా? అనే గృహిణీరత్నాలున్నూ వున్నారు. అట్టే వివరించి చెప్పడం అంతమంచిదికాదని లోతుగవెళ్లక 'మీట వైద్యంగా' యీ విషయం విడిచి పెట్టుతున్నాము.

వసంతసేన, చెలికత్తె మదనిక మాటాడు కుంటూ వుంటారు. అంతలో ఓడిపోయిన జూదగాడు పారిపోతూవుంటే వాణ్ణి పట్టుకొండిరా ! అని ఇంకొకడు అరుస్తూ వుంటాడు. ఓడిపోయి అప్పు తీర్చకుండా తప్పించుకొని పారిపోతూన్న జూదగాడు పోయి పోయి ఒకపాడు దేవాలయము కనిపించగా దానిలో దూరి పోతాడు. తరువాత యిద్దరు జూదర్లు కలుసుకుంటూరు. వాళ్ల మాటలు, తిర్పులు చదివి ఆనందించవలసిందే గాని యిలా పొల్లు మాటలురాస్తే తీరేదికాదు. ఆ యిద్దరూ పాడు దేవాలయములో ప్రవేశించి జూదం ఆడ నారంభించారు. లోపల దూరిన మొదటివాడు వీళ్ల పాచికల చప్పుడు విని కదులుతాడు. దాని స్వభావం అలాటిది. వాడే అంటాడు.

'పైడికొండనుండి పడద్రోయు నెక్కించు
జూద మింక నాడరాదటంచు
ఒట్టు పెట్టుకొనియు మడుగడు కోకిలా
రవముం బోలు నక్షరవము విన్న,—అని.'

పాచికల చప్పుడు జూదరికి ఆడుకోయిల కూతలాగా తగులుతుంది. మరి దాగి వుండలేకపోయాడు. చప్పున బయటికి వచ్చాడు. ఇడుగో దొరికాడురా అన్నాడు. అప్పిచ్చినవాడు పట్టుకున్నాడు. పాపం! రెండోవాడు వాడికోసం సగం నేనిస్తాను. సగం వదులు కోరా అంటాడు. వదులుకున్నాడు వాడు. కాని ఆ సగం యిచ్చి వెళ్లమంటాడు. నా దగ్గర లేదు. ఎలా యిస్తానంటాడు.

'నీ యబ్బ నమ్మి తీసికొనిరా — అన్నాడు ఆ జూదరి.'

'నాకు తండ్రి లేదు'— అన్నాడు పారిపోయి వచ్చిన వాడు.

'నీ యమ్మ నమ్మి తీసికొని రమ్మ్మ—అన్నాడు జూదరి.'

'నా కమ్మయు లేదు – ఓడినవాడు అంటాడు.'

'నీవే అమ్మడుపోయి యమ్మ. ఈ మాటకి పారిపోయి వచ్చినవాడన్న మాట చూడండి యెంత సహజమో !'

'అనుగ్రహించి నన్ను రాజవీధికి కొనిపొమ్మ'... జూదరులు ఎప్పుడూ వుంటారు. వాళ్లు సామాన్యంగా తమ జూదానికి పాడు దేవాలయాలను క్రీడారంగము లుగా ఉపయోగించుకోవడము సార్వత్రికమే. ఇప్పటి కన్న ఆ కాలమే నయమనిపిస్తుంది. చాటుమాటున ఏ పాడు గుళ్లలోనో ఆడేవారు. ఇప్పుడు బాహాటంగా రాజమార్గంలో పగలు చెట్లనీడలలో, రేయి బాటల ప్రక్క దీపాల క్రిందనూ యధేచ్ఛగా జూదం ఆడు తున్నారు. మద్యం తాగకూడదనీ, జూదా లాడకూడ దనీ ప్రజాస్వామిక ప్రభుత్వాలు శాసనాలు చేస్తు న్నాయి. శాసనాలు శాసనాలలాగే వుంటున్నాయి. తెగ తాగేస్తూ తందనా లాడుతూ రాచబాటల మీదనే జూదా లాడుతూన్న జనానికి అడ్డూ, ఆపూ వున్నట్టు అవుపించదు. జాతీయ నైతిక క్రమశిక్షణ లోపించి నప్పుడు శాసనా లేమి చేస్తాయి !

(సశేషము)



# శాకాహారమా? మాంసాహారమా?

శ్రీ వే. వేమూరి

శాకాహారం మంచిదా? మాంసాహారం మంచిదా? అన్న ప్రశ్నలు యీనాటివి కావు! అనాది నుండీ అనేక మతగ్రంథాలు శాకాహారం యొక్క ఔన్నత్యాన్ని పొగిడాయి! మాంసాహారాన్ని నీచపరచేయి. మాంస భక్షణ మంచిదికాదని బైబిలు బోధించింది. బౌద్ధులు జైనులు జీవహింసే కూడదన్నారు. గాంధి మహాత్ముడు శాకాహారానికి ఒక విధమయిన పవిత్రత తీసికొని వచ్చేరు.

'నేను శాకాహారిని, మాంసం తినను' అంటే 'పోనీ! చేపలు కాని గుడ్లు కాని తింటావా?' అని అడుగుతారు చాలమంది పాశ్చాత్యులు. కనుక మాంసాహారమంటే ఏమిటో, శాకాహారమంటే ఏమిటో ముందుగా నిర్వచిస్తాను.' 'ఒక ప్రాణి ప్రాణం తియ్యకుండా లభ్యమయే భోజన పదార్థాలు శాకాహారాలు.' అన్నది వాడుకలోవున్న ఒక నిర్వచనం. చెట్లకి కూడ ప్రాణంవుంది కనుక 'పొన్నగంటి కూరతిన్నా, పంది కూర తిన్నా ఒకటే!' అని కొందరు వాదిస్తారు. కనుక మనకి కావలసిన నిర్వచనాన్ని సాదృశంగా నిర్వచిస్తాను. జంతువుల మాంసం, చేపలు, కోళ్ల గుడ్లు, లేక వీటినుంచి వుత్పత్తి చెయ్యబడే పదార్థాలు మాంసాహారం. పాలు, పెరుగు, పళ్లు, కాయగూరలు, దుంపలు, గింజలు—వగయిరాలు శాకాహారం.

మాంసాహారం మంచిదికాదనే వారంతా వేర్వేరు కారణాలవల్ల మాంసాన్ని విసర్జించేరు. జీవహింస కూడదనే నమ్మకంతో కొందరు, మాంసభక్షణ తమోగుణాన్నిస్తుందని కొందరు, మాంసం మృగత్వాన్ని పెంపొందిస్తుందని కొందరు, మేం ఎప్పుడూ మాంసం తినలేదు, యిప్పుడు మాత్రం ఎందుకు తినాలని కొందరు...యిలా పలువురు పలువిధములయిన కారణాలవల్ల మాంసం తినరు. అనాది మానవుడు మాంస భక్షకుడనీ, సంస్కృతి, సంస్కారం పెరిగినతర్వాత మానవుడు భూమిని సాగుచెయ్యడం నేర్చుకొని శాకాహారి అయేడనీ, కనుక శాకాహారం తినేవారంత సంస్కారవంతులనీ కొందరి వాదం. తెల్లవాడు మాంసం తినబట్టేకదా ప్రపంచాన్ని ఏలుతున్నాడు అని కొందరు అంటారు.

ఈవాద ప్రతివాదాల వెనుక అంతర్వాహినిగా ప్రవహిస్తున్న నమ్మకం ఒకటి వుంది. తినే తిండికి మనస్సుమీద, శరీరము మీద, ప్రవర్తనమీద ప్రభావం వుంటుందనేదే యీ నమ్మకం యొక్క సారాంశం. వ్యాధులని నయం చెయ్యడానికి మందులు వాడతాము. మందులు అంటే ఏమిటి? మోతాదులో భక్షించే పదార్థాలే మందులు! ఈ మందులు ఎక్కడనుండి వస్తాయి? జంతువుల శరీరాలనుండి కాని, వృక్షములనుండి కాని, ఖనిజ లవణముల నుండి కాని తయారు చేస్తారు మందులని. పథ్యం పేరుతో భోజనంనుండి కొన్ని పదార్థాలు నిషేధిస్తాము. కనుక తినే తిండికి శరీర లక్షణాలకి సంబంధం వుంటుందని ఒప్పుకోవాలి.

ఇంతకీ ఎటువంటి ఆహారం మంచిది? మంచి ఆహారానికి కొన్ని లక్షణాలు వున్నాయి: ఆహారం పుష్టికరమయినదిగా వుండాలి. సంతుష్టి కలిగించేదిగా వుండాలి. సమృద్ధిగా దొరికేది అయివుండాలి. పుష్టి అంటే ఏమిటి? శరీరం పెరుగుదలకి దోహదకారి అయి, దైనందిన చర్యలు చేసికొనేందుకు కావలసిన శక్తిని, ఆరోగ్యాన్ని యిచ్చేది పుష్టికరం. జిహ్వకి ఆహ్లాదాన్ని కలిగించేది, ఆకలిని పోగొట్టి, కడుపు

విండిన భావాన్ని కలిగించేది సంతుష్టికరం. ఇటు వంటి పదార్థం తరతరాలపాటు దొరికేది అయి వుండాలి. పుష్టికరమయిన పదార్థాన్ని కృత్రిమంగా ఒక మాత్రరూపంలో తింటే అది సక్రమమయిన ఆహారం అవదు; అటువంటి మాత్ర భోజనంచేసిన సంతుష్టి నివ్వదు కనుక అరటి ఆకులో పోషక పదార్థాలు వున్నాయని భోజనంతో విస్తరివికూడ తినలేము. తినే పదార్థం తినేవాడి జిహ్వకి, చూసేవారి కంటికి యింపుగా వుండాలి.

పుష్టికరమయిన ఆహారంయొక్క లక్షణాలు ఏమిటో ఒకసారి చూద్దాం. ఆహారంలో మాంసకృత్తులు, పిండి పదార్థాలు, కొవ్వులు, విటమినులు, ఖనిజ లవణములు, సరిఅయిన పాళ్లలో వుండాలని బాల్యంలో చదువుకున్నాం. ఇవేమిటో కొంచెం విపులంగా పరిశీలిద్దాం. 'మాంసకృత్తులు' అనే మాట ఇంగ్లీషులోని 'ప్రోటీను' అనే మాటకు ఆంధ్రీకరణం. ఇంగ్లీషులో 'ప్రోటీను' అన్న మాటకి గ్రీకు భాషలో 'అతిముఖ్యమయినది' అని అర్థం వస్తుంది. (ఇంగ్లీషులోని సాంకేతిక పదాలు చాలామట్టుకి గ్రీకు, లాటిన్ భాషలనుండి వచ్చేయి) కనుక ప్రోటీనులు శరీర పోషణకి అతిముఖ్యమయిన పదార్థాలన్నమాట. కనుక యీ మాటని తెలుగులో 'ప్రాణ్యము' అంటే బాగుంటుంది. ప్రాణ్యములు అంటే ముఖ్యమయినవని అర్థం. ఈ ప్రాణ్యము లనే పోషక పదార్థాలు మాంసంలో విరివిగా లభ్యమవుతాయన్నది నిజమే! ఈ ప్రాణ్యములు పప్పులవంటి శాకాలలోను దొరుకుతాయి. కనుక, పాఠకుల అనుమతితో, 'ప్రోటీను' అన్న మాటని 'ప్రాణ్యము' అని తర్జుమా చేస్తాను. పిండి పదార్థాలని ఇంగ్లీషులో 'కార్బో హైడ్రేటు' లంటారు; అంటే, కర్బనము (carbon), ఉదజని (Hydrogen), ఆమ్లజని (Oxygen) కల పదార్థాలని అర్థం. వీటిని తెలుగులో 'కర్బనోదాలు' అందాం. ఈ కర్బనోదాలు వరిపిండి, దుంపలపిండివంటి పదార్థాలలోను, పంచదారలలోను, పిప్పి పదార్థాలలోను దొరుకుతాయి. కొవ్వు పదార్థాలు మాసె, నెయ్యివంటి పదార్థాలలో దొరుకుతాయి. శరీరానికి ముఖ్యంగా కావలసిన ఖనిజ లవణములలో కేల్సియం (Calcium), ఇనుము (Iron) వుండాలి. ఎముకల పోషణకి కేల్సియం అత్యవసరం. రక్త పుష్టికి ఇనుము కావాలి. విటమినులనే పదార్థాలు కొద్ది కొద్దిగా శరీరానికి కావాలన్నది సర్వజన విదితం.

ప్రాణ్యములు, కర్బనోదాలు, కొవ్వులు ఆహారంలో వుంటే, తినే తిండికి రుచి వస్తుంది. కాని తమాషా ఏమిటంటే కర్బనోదాలు, కొవ్వులు ఆహారంలో లేకపోయినా జంతువులు (మనుషులు) బతకగలవు; ప్రాణ్యములు లేకపోతే మాత్రం బతకలేవు. ప్రాణ్యములు బొత్తిగా లేకుండా, వుత్త కర్బనోదాలు, కొవ్వులు, లవణములు, విటమినులు వున్న ఆహారం మీద దీర్ఘకాలం బతికితే శరీరం వ్యాధిగ్రస్తం అవుతుంది. కాని కర్బనోదాలు, కొవ్వులు బొత్తిగా లేని ఆహారం తిని సునాయాసంగా బతక వచ్చు. తగినన్ని ప్రాణ్యములు ఆహారంలో వుంటే తనకి కావలసిన కర్బనోదాలనీ, కొవ్వులని శరీరం వుత్పత్తి చేసికోగలదు. దీనిని బట్టి, ఆహారంలో ప్రాణ్యము లెంత ముఖ్యమయినవో అవగాహన అవుతుంది.

ప్రాణ్యములు శాకాలలోను, మాంసాలలోను లభ్యమవుతాయని కదా అనుకున్నాము. ఇదే విధంగా కర్బనోదాలు, కొవ్వులు, ఖనిజ లవణములు, విటమినులు కూడ శాకాలలోను, మాంసాలలోను లభ్యమవుతాయి. ఇటువంటి సందర్భంలో శాకాహారము తింటె నేమి మాంసాహారమయితే నేమి అన్న భావన వస్తుంది. శాకాహారాలకీ మాంసాహారాలకీ సాంకేతికమయిన తేడాలు లేకపోలేదు. ఉదాహరణకి: శాకాలలో ప్రాణ్యములు లభ్యమయినా దండిగా దొరకవు. అంతే కాదు; సంపూర్ణమయిన పోషక శక్తి గల ప్రాణ్యములు ఒకే ఒక శాకంలో దొరకడం కొంచెం కష్టం. ఇదే విషయాన్ని మరొక రకంగా చెబుతాను. ఏదో ఒక రకం మాంసం (మేక మాంసం అనుకొండి, మచ్చుకి) తింటే శరీరానికి కావలసిన పోషక శక్తి ఆ మాంసం గుండా లభిస్తుంది. ఒకే ఒక శాకం (కందిపప్పు అను

కాండి) తింటే శరీరానికి కావలసిన పోషక శక్తి అంతా ఆ వస్తు ద్వారా లభించడం సాధారణంగా దుర్లభం. కనుక శాకాహారులు రకరకాల వస్తువులని తినాలి. ఈ కారణంవల్లనే మాంసాలలో లభ్యమయే ప్రోటీన్లని మొదటి తరగతి ప్రోటీన్లనీ, శాకాలలో వాటిని రెండవ తరగతి ప్రోటీన్లనీ అంటారు.

పై పేరులో జరిగిన చర్చలో గమనార్హమయిన విషయం ఒకటి వుంది. పరిపూర్ణ-పోషక శక్తివున్న ప్రోటీన్లు, పరిపూర్ణ పోషకశక్తిలేని ప్రోటీన్లు అనేవి రెండురకాల పదార్థాలని గురించి మాట్లాడుతున్నాం. పదహారణాల ఆంధ్రుడికీ పదమూడు అణాల ఆంధ్రుడికీ ఆంధ్రత్వంలో తేడా లేదూ? అలాగే పోషకశక్తి కూడ! పదహారణాల ఆంధ్రుడంటే ఎవరు? పదహార లక్షణాలు వున్నవాడనేగా! తెలుగుదేశంలో పుట్టి, తెలుగుభాష మాట్లాడి, తెలుగు వేషం వేసి...యిలా ఏవేవో 16 లక్షణాలు వున్నవాడు. ఇదేవిధంగా ఒక ప్రోటీన్ నికార్సయిన ప్రోటీన్ అవునా కాదా అని తేల్చడానికి ఒక పద్ధతివుంది. తెలుగువాడిలో అణాఎత్తు తెలుగుతనం ఎలాంటిదో ప్రోటీన్లకి అమ్లములు (Amino acids) అటువంటివి. ఈ ఎమినో అమ్లములు మొత్తం పందొమ్మిది వున్నాయి. ఈ పందొమ్మిది ఎమినో అమ్లములని పందొమ్మిది రంగుల పూసలగా భావిస్తే, ఆ రంగు పూసలతో కట్టిన దండలాంటిది ప్రోటీన్ అంటే! ప్రోటీన్లు, వాటి పోషకశక్తి వగయిరా విషయాల మీద కొంచెం తెలివిగా మాట్లాడాలంటే ఆ ఎమినో అమ్లములగురించి కొంచెం తెలియాలి.

ఎమినో అమ్లములు ఒక రకమయిన రసాయనిక పదార్థాలు. సృష్టిలో మొత్తం 19 ఎమినో అమ్లములు (అంటే మన వుపమానంలో 19 రంగుల పూసలు) వున్నాయని శాస్త్రవేత్తల నమ్మకం. ఎరుపు, పూదా, నీలం...అని పూసలకి రంగులువున్నట్లే ఈ

ఎమినో అమ్లాలకి పేర్లు వున్నాయి. సూర్యనారాయణ గారిని సూర్యం అని పిలిచినట్లు యీ ఏమినో ఆమ్లాలపేర్లకి సంక్షిప్తనామాలు వున్నాయి. ఈ పందొమ్మిది ఎమినో అమ్లాలపేర్లు, వాటి సంక్షిప్త నామాలు పట్టిక 1 లో చూపేను. ఈ పట్టికలో మొదటి పదింటినీ ముఖ్యామ్లాలు(Essential acids) అంటారు. ఈ ముఖ్యామ్లాలు భోజనం ద్వారా మనం శరీరానికి సరఫరాచేస్తే, మిగిలినవాటిని అవసరరీత్యా శరీర వుత్పత్తి చేసికోగలదు. ఒక ప్రాణ్యంలో ఈపది ముఖ్యమయిన అమ్లాలువుంటే ఆ ప్రాణ్యం పదహార ణాల తెలుగునాడు లాంటిదన్నమాట.

ఉదాహరణకి రక్తంలో 'సీరమ్ ఆల్బుమిన్' (Serum albumin) అనే ప్రాణ్యం వుంది. ఈ ప్రాణ్యంలో ఒక బణువు (Molecule) ని పరిశీలిస్తే అది పూసల దండ మాదిరి వుంటుంది. ఈ దండ లోని పూసలు ఎమినో అమ్లాలు. ఒక్క 'సీరమ్ ఆల్బుమిన్' బణువులో 526 'పూసలు వుంటాయి. కానీ మన దగ్గర 19 రంగుల పూసలే వున్నాయి. కనుక ఒకొక్కరంగు పూసలు ఎన్నివున్నాయో తెలిస్తే 'సీరమ్ ఆల్బుమిన్'యొక్క గుట్టు కొంతవరకు తెలుస్తుంది. శాస్త్రవేత్తలు సుదీర్ఘమయిన పరిశోధనలుచేసి 18 రంగుల 'పూసలు' మాత్రమే 'సీరమ్ ఆల్బుమిన్'లో వున్నాయని కనుక్కున్నారు. అంటే 'సీరమ్ ఆల్బుమిన్' అనే ప్రాణ్యం 18 రకాల ఎమినో అమ్లాలతో చేయబడిందన్నమాట. మనం భోజనంద్వారా పది రకాల ఎమినో అమ్లములను శరీరానికి సరఫరాచేస్తే, మిగిలిన ఎనిమిదింటిని శరీరం తనలో తయారు చేసికొని యీ పదునెనిమిది అమ్లాలనీ వుపయోగించి 'సీరమ్ ఆల్బుమిన్'ని తయారుచేసి కొంటుంది.

సరదాకి, యీ 'సీరం ఆల్బుమిన్'లో ఏయే ఎమినో అమ్లాలు ఎన్నేసి వున్నాయో చెబుతాను. 15 గ్లైసీనులు, 45 వేలీనులు, 58 లూసీనులు, 9 ఆయిసోలూసీనులు, 31 ప్రోలీనులు, 33 ఫినైలాలనీనులు, 18 టైరోసీనులు 1 ట్రిప్టోఫేను, 22 సెరీనులు, 22 త్రియోనీనులు, 16 సిస్టైనులు, 4 సిస్టియినులు, 6 మెథియోనీనులు, 25 ఆర్జినీనులు, 16 హిస్టిడీనులు, 58 లైసీనులు 46 ఎస్పార్టిక్ అమ్లములు, 80 గ్లూటమిక్ అమ్లములు వున్నాయి. ఇవన్నీ ఒక్క 'సీరమ్ ఆల్బుమిన్' బణువులో వున్నాయి. అంటే 'సీరమ్ ఆల్బుమిన్' అనే ప్రాణ్యము పొడుగాటి పూసలదండలా వుంటుందన్న మాట. ఈ దండలోవున్నా 526 ఎమినో అమ్లములు పూసలవంటివి అన్నమాట. ఇదేవిధంగా రక్తంలో హిమోగ్లోబిన్ (Hemoglobin) అనే మరొక ప్రాణ్యం వుంది. ఇది కూడ దండలాగే వుంటుంది. ఒక్క బణువు హిమోగ్లోబిన్‌లో 550 ఎమినో అమ్లములు (పూసలు) వున్నాయిట.

ఇదేవిధంగా శరీరంలోని ప్రతి భాగం ప్రాణ్యములనే యిటికలతో కట్టబడ్డ కట్టడమే! జుత్తు, యీకలు, పొలుసులు, గోళ్లు, డెక్కలు వగయిరాలన్నీ కెరటిన్ (Keratin), ఫైబ్రోయిన్ (Fibroin) అనే ప్రాణ్యములతో కట్టబడ్డాయి. ఎముకలు వగయిరాలు కొల్లాజెన్ (Collagen), ఎలాస్టిన్ (Elastin) అనే ప్రాణ్యములతో నిర్మించబడ్డాయి. హిమోగ్లోబిన్ అనే ప్రాణ్యం వుండబట్టే రక్తానికి ఎరుపురంగు వచ్చింది. ఇన్‌సులిన్ అనే ప్రాణ్యం శరీరంలో తగిన మోతాదులో వుత్పత్తి కాకపోతే మధుమూత్రవ్యాధి (Diabetis) వస్తుంది. అప్పుడు ఇన్‌సులిన్ ఇంజక్షన్ పుచ్చుకుంటాం. శరీరం ఇన్సులిన్ తయారు చెయ్యలేకపోతే ఇన్సులిన్ పైనుండి సరఫరా చెయ్యాలి. ఈ పైనుండి సరఫరా అన్నది మందు రూపంలోనా? భోజనం రూపంలోనా? అన్న విషయం పరిస్థితిని బట్టి వుంటుంది. ఆహారం అనేది నోటి ద్వారానే పుచ్చుకోవాలన్న నిబంధన లేదు కదా? ఇదే విధంగా శరీరంలో ఏ ప్రాణ్యం లేకపోయినా చిక్కే! హిమోగ్లోబిన్ అనే ప్రాణ్యం సరిగ్గా తయారవకపోతే రక్త సంబంధమయిన జబ్బులు వస్తాయి.

శరీరంలోని జీవకణాలు ప్రాణ్యములనే యిటికలతో ఎలా నిర్మించబడ్డాయో, అదే విధంగా శాకాల

లోని జీవకణాలు కూడ ప్రాణ్యములనే యిటికలతో నిర్మించబడ్డాయి. ఉదాహరణకి పాలలో 'లేక్టో ఆల్బుమిన్' (Lacto albumin) అనే ప్రాణ్యం వుంది. సోయా చిక్కుడులో 'గ్లైసినిన్' (Glycinin) అనే ప్రాణ్యం వుంది. గోధుమలలో (Glutenin) అనే ప్రాణ్యం వుంది. ఈ ప్రాణ్యాలలో ఎమినో ఆమ్లాలు వున్నాయి. ఈ ఆమ్లాలు శరీరంలోకి వెళ్ళి, రూపాంతరాలు చెంది మన పెరుగుదలకి ఆరోగ్యానికి దోహదం చేస్తాయి.

ఇంత హడావిడిచేసి తేల్చేదేమిటి? శరీరానికి కావలసిన ఎమినో ఆమ్లాలు అన్నీ భోజనం ద్వారా, తగినంత మోతాదులో సరఫరాచేస్తే తినేది శాకాహారమయినా, మాంసాహారమయినా తేడా ఏమీ లేదు. కాని శరీరానికి కావలసిన పది ముఖ్యమయిన ఎమినో ఆమ్లాలు శాకాలలో సులభంగా దొరకవు. కనుక శాకాహారులు తినేతిండిని తెలివిగా ఎన్నుకుని తినాలి. నాలుగు రుచులూ తినడం నేర్చుకోవాలి. అప్పుడే వారికి ఎమినో ఆమ్లాలన్నీ లభ్యమవుతాయి.

ఇప్పుడు శాకాహార మాంసములలో ఏది చవకో చూద్దాం. మాంసం తినాలంటే ఎద్దు, మేక, గొర్రె పంది, కోడివంటి జంతువులని పెంచి, చంపి తినాలి. జంతువులని పెంచడానికి గ్రాసం కావాలి. అంటే గడ్డి, జొన్నలు, వులవలు, తవుడు వగయిరాలు. ఇవి ఎక్కడనుండి వస్తాయి? పంట పండించాలి. ఇప్పుడు ఒక ప్రశ్న ఎదురవుతుంది. గ్రాసం పొలంలో పండించి, ఆ పంటని జంతువులకి మేపి, ఆ జంతువులని చంపి తినడం లాభదాయకమా? లేకపోతే పొలంలో మనకి కావలసిన పంటలే పండించి, ఆ పంటని మనమే తిని, జంతువుల సంగతి మరచిపోవుట లాభదాయకమా? ఏ పద్ధతికి ఫలోత్పాదకశక్తి (Efficiency) ఎక్కువ? ఈ ప్రశ్నలకి సమాధానం చెప్పాలంటే ఫలోత్పాదక శక్తిని కొలిచే పద్ధతిని నిర్వచించాలి. మన శరీర పోషణకి నిజంగా కావలసినది ఎమినో ఆమ్లాలు గనుక యకరానికి ఎమినో ఆమ్లాల దిగుబడి ఎంతో లెక్కవేద్దాం. ఉదాహరణకి, యకరం భూమిమీద బఠానీ, చిక్కుడు, సోయాచిక్కుడు వంటి పంటలువేస్తే సగటున, ఆ పంట దిగుబడిలో 13 పౌనుల ఎమినో ఆమ్లాలు లభిస్తాయట. అదే యకరంలో బంగాళాదుంప, కేరట్, కోసుకూర (Cali flower) కేబేజీ, ధాన్యంవంటి పంటలువేస్తే, ఆ పంట దిగుబడిలో 4.2 పౌనుల ఎమినో ఆమ్లాలు వస్తాయిట. అదే ఎకరంలో పసువులకి కావలసిన గ్రాసం పండించి, ఆ పంటని పసువులకి మేపి, ఆ పసువులని చంపి, వాటి మాంసంలో చూస్తే యకరానికి 1.6 పౌనుల ఎమినో ఆమ్లాలు మాత్రమే దిగుబడి అవుతాయిట. మనిషి ఒక్కంటికి, రోజుకి 2 అవున్సుల ప్రాణ్యములు కావాలిట. ఉరమరగా, రెండు అవున్సుల ప్రాణ్యములో ఒక అవున్సు ఎమినో ఆమ్లాలు వున్నాయనుకుందాం. ఈ లెక్కని ఒక ఎకరం భూమిని సేద్యం చేసి దరిదాపు 150 మంది శాకాహారులని పోషించవచ్చు ఒక రోజు పాటు. కాని యిదే యకరాన్ని సేద్యం చేసి 80 మంది మాంసాహారుల కంటె ఎక్కువ మందిని పోషించలేము. (ఈ లెక్కలో శాకాహారులు, మాంసాహారులు, యిరువురూ, నాలుగు రుచులూ తింటారన్న వూహ వుంది.)

భారతదేశంలో భూమి కరువైపోయింది. దొరికిన భూమిని సాధ్యమయినంతవరకు సాగు చేసేస్తున్నాం. జనాభా పెరిగినకొద్దీ, ఆ ప్రజని పోషించడానికి కొత్తకొత్త భూములు లేవు. ఇలా భూమి కరువయిన రోజులలో మనం మాంసాహారం కొరకు తాపత్రయ పడడం వెర్రితనం! శాకాహారం తినే అలవాటు మన దేశంలో అనాదిగా వుంది. మాంసం తినవద్దని కాదు నే అనేది! మన మాంసాహారం సాగు భూమి మీద ఆధారపడకుండా సంపాదించగలగాలి! దీనికి రెండు మార్గాలున్నాయి. మన మాంసాహారాన్ని వీలయినంతవరకు సముద్రంనుండి సంపాదించాలి. (బెంగాలీవాళ్ళ తెలివయిన ఘటాలు; వాళ్ళు తినే మాంసం అంతా చేపలు. శాకం? అన్నం!) ప్రపంచంలోని అగ్రదేశాలన్నీ (రష్యా, జపాన్, అమెరికా,

ఇంగ్లండు...) సముద్రంలోని 'పంట'ని దోచుకుని తింటున్నారు. మనం వర్షాలు పడలేదని, ఇందిరా గాంధీని తిడుతూ, మీనమేషాలు లెక్కపెడుతూ పదహారణాల తెలుగువాళ్లలా కాలక్షేపం చేస్తున్నాం. కేరళ కోస్తాకి మన కోస్తా రెట్టింపు పైగా వుంది; కాని వాళ్లు చేపలు అమెరికాకి ఎగుమతి చేస్తున్నారు. మనం? ముల్కీ, గిల్కీ అంటూ పళ్లు కొరుకుతున్నాం.

మనకి కావలసిన ప్రాణ్యాలు సంపాదించడానికి మార్గాలు కొల్లలు కొల్లలుగా వున్నాయి. మచ్చుకి కాగితం గుజ్జువంటి పదార్థాలలో బూజువంటి ప్రాణిని పెంచవచ్చు. ఈ ప్రాణులు వాటి బతుకు కొరకు ప్రాణ్యాలు తయారుచేస్తాయి. ఈ ప్రాణ్యాలని బూజు నుండి విడదీస్తే, పొడిగా, రంగు, రుచి, వాసనలేని పిండివంటి పదార్థం వస్తుంది. ఇది పక్కా ప్రాణ్య పదార్థం, ఈ పిండిని వరి, గోధుమ, జొన్నవంటి పిళ్లలో కలిపితే అవి బలవర్ధకం అవుతాయి. బూజు వంటి ఫంగస్‌ని చంపడం పాపం కాదా అని అనుమానం వున్న వాళ్లకి మరొక వుపాయం.

సోయాచిక్కుడు అనే చిక్కుడు ఒకటి వుంది. ఈ చిక్కుడుగింజలలో 46 శాతం ప్రాణ్య పదార్థములే! అసలు సోయాచిక్కుడుని శాకాహారుల మాంసం అనవచ్చు. ఒక వడ్డన మేక మాంసంలో వున్న పోషక శక్తిని ఒక వడ్డన సోయాచిక్కుడుతో పోల్చి చూద్దాం.

రోజుకి కావలసిన అవసరంలో శాతం

| | ప్రాణ్యములు | కేల్సియం | ఇనుము |
|---|---|---|---|
| సోయా చిక్కుడు (3 ఔన్సులు) | 49.3% | 26% | 48.8% |
| మేక మాంసం (4 ఔన్సులు) | 32.4% | 1.67% | 15.38% |

మూడు అవున్సుల సోయాచిక్కుడు గింజలు తింటే వాటిలో రోజుకి కావలసిన ప్రాణ్యములలో దరిదాపు సగం ప్రాణ్యములు వుంటాయి. నాలుగు అవున్సుల మేక మాంసంలో రోజుకి కావలసిన ప్రాణ్యములలో మూడో వంతు మాత్రమే వుంటాయి. సోయాచిక్కుడు మేక మాంసంకంటె మంచిదన్న మాట. పుగాకు పంటకి బదులు సోయచిక్కుడు వేస్తే, పుగాకు అమ్మి, ఆ డాలర్లు పెట్టి గోధుమలు కొనుక్కోడానికి బదులు, సోయాచిక్కుడు తిని బలంగాను వుండవచ్చు, అమెరికావారిని దేహీ అని అడగ నక్కరలేదు. పుగాకు తాగడం మానుకుంటే ఆరోగ్యం కూడాను.

పట్టిక 1 ఎమినో ఆమ్లాల పేర్లు.

| ఇంగ్లీషు పేరు | రసాయనిక సంక్షిప్తం | తెలుగులో |
|---|---|---|
| 1. Phenylalanlne | Phe | ఫీనైలాలనిన్ |
| 2. Leucine | Leu | లూసీన్ |
| 3. Isoleucine | Ileu | ఐసోలూసీన్ |
| 4. Methionine | Met | మిథియొనీన్ |
| 5. Valine | Val | వేలిన్ |
| 6. Lysine | Lys | లైసీన్ |
| 7. Tryptophan | Try | ట్రిప్టొఫేన్ |
| 8. Threonine | Thr | త్రియొనీన్ |
| 9. Histidine | His | హిస్టిడీన్ |
| 10. Arginine | Arg | ఆర్జినీన్ |
| 11. Glycine | Gly | గ్లైసీన్ |
| 12. Proline | Pro | ప్రోలీన్ |
| 13. Tryrosine | Try | ట్రైరోసీన్ |
| 14. Serine | Ser | సీరిన్ |
| 15. Cystine | Cys | సిస్టయిన్ |
| 16. Cysteine | Cysh | సిస్టీన్ |
| 17. Aspartic Acid | Asp | ఏస్పార్టిక్ ఏసిడ్ |
| 18. Glutamic Acid | Glu | గ్లూటామిక్ ఏసిడ్ |
| 19. Alanine | Ala | ఆలనీన్ |

# 'కళాప్రపూర్ణ బిరుద ప్రదానోత్సవము'

[ఆంధ్ర విశ్వకళాపరిషత్తు నలువది యారవ పట్టప్రదాన సభలో 'కళాప్రపూర్ణ' బిరుదు ఇచ్చిన సందర్భంలో శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిని గురించి గత సెప్టెంబరు నెల 29వ పరిషదధ్యక్షుల సమక్షమున శ్రీ పి. జగదీశ్వరరావుగారు చేసిన ప్రఖ్యాపన ప్రసంగ పాఠము: —సంపాదకుడు.]

అధ్యక్ష మహోదయా!

ఆధునాతన కాలమున ఆంధ్రభాషా సాహిత్యముల కనితర సాధారణమగు సేవ గావించినవారును, జంగమ విజ్ఞాన సర్వస్వ పరిశోధన పరమేశ్వరాద్యనేక బిరుద విభ్రాజితులును అగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారిని భవదాజ్ఞానుసారముగ ఈ స్నాతక పరిషన్ముఖమున పరిచయము గావించుచున్నాను.

శ్రీ వేంకటరావుగారు 1904 వ సంవత్సరమున విజయనగరమందు విద్వత్కుటుంబమున జన్మించిరి. విజయనగర మహారాజ కళాశాలయందే పట్టభద్రులైరి. కొంతకాలము తరువాత మదరాసు విశ్వవిద్యాలయమున ఎమ్. ఏ. పట్టముతోపాటు, స్వర్ణపతక బహూకృతినిగూడ నందిరి. తొలుదొల్త వీరు చేపట్టిన యుద్యోగము ధన విషయమున చిన్నదయ్యుఁ బరిశోధన విషయమునఁ జిరస్మరణీయమై, ఆంధ్రశైవ వాఙ్మయ విచారణాత్మక బహువిధ వ్యాసరచనా వ్యాసంగమునకుఁ గారణమైనది. కవిప్రయోగములందీ పండిత ప్రకాండులకు గల యద్భుత శక్తికి శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున వీరు గావించిన కృషి కొంత కారణ మనవచ్చును.

శ్రీ వేంకటరావుగారు ఏకసంధాగ్రాహి. ఆంధ్ర వాఙ్మయమున వీరు చదువని గ్రంథము లేదు; చదివి మరచిన ప్రయోగ విశేషమును లేదు. ఛాయాగ్రహణయంత్ర సన్నిభమగు వీరి మనఃఫలకముపై ముద్రితమైన సారస్వతాంశమునకు క్షతిలేదు. అసాధారణమగు నీ మేధాసంపత్తిని దిలకించియు నపూర్వ



స్నాతకోత్సవపు దుస్తులలో, ఇటీవలే 'కళాప్రపూర్ణ' బిరుదము పొందిన విద్యారత్న శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు

మగు వీరి సాహితీపరిజ్ఞానము నుపలక్షించియు, సమస్త విద్వల్లోకముము వీరిని 'జంగమ విజ్ఞాన సర్వస్వ' బిరుదమున బహూకరించినది.

శ్రీ వేంకటరావుగా రాంధ్రభాషాపోషకు గావించిన సేవ అపారము; అనితర సాధారణము. ఆంధ్రమున వీరు రచించిన గద్య పద్య గ్రంథము లనేకములు

గలవు. అందు తెలుగుకవుల చరిత్ర, దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము, వచన వాఙ్మయము, ఉదాహరణ వాఙ్మయ చరిత్ర మున్నగు గ్రంథములు. ఈ విమర్శకాగ్రణికి సర్వాంధ్రజనతాజేగీయమానమగు మహాకీర్తి నార్జించినవి. వివిధ సారస్వత పత్రికలయందు వీరు ప్రకటించిన వ్యాసములును, పెక్కు గ్రంథములకు వీరు రచించిన విమర్శనాత్మకములగు పీఠికలును, లెక్కకు మిక్కిలిగా నున్నవి. వీరు రచించిన కర్ణాటాంధ్రముల పరస్పర ప్రభావము, విజయనగర సంస్థాన సాహిత్య పోషణము, అను గ్రంథములకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారి బహుమతులు లభించినవి; ఆంధ్ర వచన వాఙ్మయమునకు తెలుగు భాషా సమితివారి బహుమతి లభించినది.

శ్రీ వేంకటరావుగారు కేవలం విమర్శకులే కాదు; కవులు కూడ. వీరి కావ్యనిర్మాణ కౌశలమునకు ఉదాహరణముగ మించుపల్లి యను కావ్యమును గైకొనవచ్చును. వీరు గావించిన వాఙ్మయ సేవ కలరి కొందరు 'మనీషిపుంగవులు,' వీరికి సువర్ణ ఘంటా కంకణమును బహూకరించిరి.

ఏవంవిధ గుణ గణ విశిష్టులును, నిరంతర సాహితీసేవా పరాయణులును అగు శ్రీ వేంకటరావు గారికి 'కళాప్రపూర్ణ' అను డాక్టరు బిరుదమును ప్రసాదింప విశ్వకళాపరిషదధ్యక్షుల నభ్యర్థించుచున్నాను.



# యోగోపక్రమము

## శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

ఆస్తికు లనబడు వారెల్లరు శరీరమున కంటెను, ఇంద్రియముల కంటెను, ప్రాణముల కంటెను, మనోబుద్ధి చిత్తాహంకారముల కంటెను వేరైన జీవాత్మ ఒకటి కలదని నమ్ముచున్నారు. ఈ జీవుడు శాశ్వతుడు, ఆనందమయుడు, జ్ఞానస్వరూపుడు. అనగా ఆత్మడు సచ్చిదానంద స్వరూపుడని సారాంశము[1]. ఇట్టి శాశ్వతాత్మ నంగీకరింపక, శరీరముతో బాటె చైతన్యము పుట్టుచున్నదనియు, మరణముతో ఆ చైతన్య శక్తియు నశించుచున్నదనియు తలంచు వారు నాస్తికు లనబడు చున్నారు. దేహ సంఘాత వ్యతిరిక్తమయి, అనృతము, జడము, దుఃఖమే రూపముగా గలిగిన దేహమునకంటె విలక్షణమయిన సచ్చిదానంద రూపాత్మను లేదను చున్నందున, వారిని నాస్తికులని లోకమనుచున్నది. మొదటివారు, అట్టి ఆత్మ ఉన్నదను చున్నందున ఆస్తికులుగా లెక్కింప బడినారు 'అస్తి' అనగా ఉన్నదనియు, 'నాస్తి', అనగా లేదనియు అర్థము కదా!

> 'జడమునుండి పుట్టు చైతన్యమనియును
> జడము వేఱు, జ్ఞానశక్తి వేఱు,
> అనియు రెండుమతము లలరు నిలోకాన!
> విశ్వహితచరిత్ర, వినర, మిత్ర!'
>
> —మిత్ర పంచశతి.

ఆత్మను, దాని శాశ్వతస్వభావమును అంగీకరింపగనే, ఆ ఆత్మకు సద్గతిని, దుర్గతిని గూర్చు కర్మ (సిద్ధాంతము) ము నంగీకరింపక తప్పదు. జీవులందరును సుకృత దుష్కృత (మంచి, చెడు) రూపములైన కర్మల నొనర్చు చుందురు. గీతాకారుడు చెప్పినట్లు, ఏ ప్రాణిగాని క్షణకాలమేని కర్మచేయకుండ మనజాలదు. (నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠ త్యకర్మకృత్) వారి వారి సంస్కారములకు దగినట్లు, సర్వజీవకోటియు ఆయా కర్మముల నాచరించుచునే యుండును. ఇందు సత్కర్మల నొనర్చిన జీవులు సత్ఫలితములను, దుష్కర్మములను చేసిన జీవులు దుష్ఫలితములను బొందుచుండుట ప్రకృతి విహితమైన నియమము. కుంకుడుచెట్టు నాటినవాడు కుంకుడు కాయలను, మామిడిచెట్టు పెట్టినవాడు మామిడిపండ్లను పొందుట మన అనుభవములో చూచుచేయున్నాము పరోపకారాది సత్కార్యము లొనర్చువానిని సత్పురుషుడనియు పరహింసా చౌర్య వ్యభిచారాదులు చేయువానిని దుర్జనుడనియు ననుట మనమెరింగినదే కదా!

జీవుడు ఆయాకర్మముల నొనర్చుటకు అతనికి కొన్ని సాధనములు కావలసియున్నవి. సాధనములేనిది యేపనిగాని సాధింపబడకుండుట లోకసహజము. సేద్యము చేయవలయునన్న, నాగలి, కాడి, కొడవలి, బండి—మున్నగు సాధనములు వలయును. అట్లే శిల్పాది కార్యములు నిర్వహింపవలయునన్నచో, ఉలి, సుత్తె, పట్టెడ, కుంపటి—మున్నగు పనిముట్లు కావలయును. అట్లే జీవునికిగూడ మంచిదిగానిండు, చెడ్డదిగానిండు— ఏ పనిని చేయుటకైనను, తగిన సాధనములు వలసియున్నవి. సాధనములను కరణములని

---

1. ఆత్మ స్వరూపమును గూర్చిన విశేషములు, నా ఆత్మదర్శనములో విస్తారముగా వర్ణింపబడినవి, చూడవచ్చును. పునరుక్తమగునని యిక్కడ వ్రాయలేదు.

గూడ తువము పిలుచు చుందుము. జీవునికి మొదటి సాధనము లోపలిదైన మనస్సు. ప్రతివ్యక్తియు తన మనస్సుతో సంకల్ప వికల్పములను చేసికొనిగాని, ఆయాకోరికలను కోరుకొనిగాని ఏపని కైనను పూను కొనడు. కనుక మనస్సను నది జీవునికొక లోపలి సాధనము. కావుననే దీనిని అంతఃకరణమని పేర్కొను చున్నారు.

తన మనస్సులో తలచిన తలపులను బయటి వారికి తెలియజేయుటకు వాక్కు రెండవసాధనము. ప్రతివాడును తన ఊహలను, ఉద్దేశ్యములను మాటల తోనే వ్యక్తము చేయునుగదా! నరుడు తన తలపు లను ఆచరణలో పెట్టవలయునన్నచో, కరచరణాద్య వయవములతో గూడిన శరీరముతో పనిచేయవలసి యున్నది. ఈ శరీరములో—చెవి, చర్మము, కన్ను, నాల్క, ముక్కు—అను జ్ఞానేంద్రియ పంచకమున్నది. వీని ద్వారా వెలుపలనున్న శబ్ద, స్పర్శ, రూపరస, గంధములు మనము గ్రహించుచున్నాము. వాక్కు, పాణి (చేయి) పాదము, పాయువు, ఉపస్థ—అనునవి కర్మేంద్రియములు. ఇవి చేయుచున్న కర్మ లేవో కూడ మన మెరుగుదుము. ఈ దశేంద్రియములే కాక, మొదటి సాధనమని చెప్పికొన్న అంతఃకరణము అంతరింద్రియము. జీవునికి కర్మ సాధనములైన ఈ మనోవాక్కాయములనే త్రికరణములని మనము పలుకుచున్నాము. జీవుడనువాడు, సత్కార్యము లొనర్చి సద్గతిని బడయుటకు గాని, దుష్కార్యముల నొనర్చి దుర్గతి (అధోగతి)ని బడయుటకుగాని, ఈ మనోవాక్కాయములు పరమ సాధనములన్న మాట.

జీవుడు, అజ్ఞానము (మాయ)చే బద్ధుడై మోహాంధుడై పుణ్య పాప రూప కర్మముల నొనర్చుచు తత్ఫలితముగ సంసార చక్రమున పరిభ్రమించుచు నానాయోనులందు పుట్టుచు, చచ్చుచు సుఖ దుఃఖములను గుడుచుచున్నాడు. జీవితమున దుఃఖముతో బాటు సుఖము గూడ అనుభవింప బడుచున్నను, ఆ సుఖము శాశ్వతమైనదియు, దుఃఖ స్పర్శ లేనిదియు కాదని తత్వశాస్త్రమును, మహనీయుల అనుభవమును చాటుచున్నవి. ఇది నిజమే. ప్రకృతి సంపర్కమున గలిగిన సుఖము శాశ్వతమును, దుఃఖ దూరమును అగుటకు వీలులేదు. ఆ సుఖము కాలాంతరముననో, అవస్థాంతరముననో మరల దుఃఖదాయియే అగుచున్నది. ఇట్టి స్థితిలో నిరతిశయ సుఖము, శాశ్వతానందము, ప్రకృతి సంబంధము లేని నిర్వికార నిర్వృతి జీవునకు కావలసియున్నది. అట్టి నిరతిశయానందము కొరకే జీవుని తపన. అందుకే అతని ప్రయత్నము. ఇట్టి పరమానంద ప్రాప్తి కలుగుటకు, అతని జీవత్వము నివర్తించి, ఈశ్వరత్వము రావలసియున్నది. బ్రహ్మత్వము సిద్ధింపవలసియున్నది. కావున ఇప్పట్టున జీవేశ్వర స్వరూపములను సంగ్రహముగనైనను తెలిసికొన వలయును.

## జీవుడు

జీవుడుకాని, ఈశ్వరుడుకాని అఖండ బ్రహ్మ పదార్థములోని వారేకాని, తద్భిన్నులుకారు. అయినను, వారు స్వీకరించిన ఉపాధులనుబట్టి భేదము తోచు చున్నది. బింబమును ప్రతిఫలింప చేసికొనుటకు తగిన అద్దము మొదలగు వానిని ఉపాధి అని పిలుచు చుందురు. అద్దముయొక్క రంగులనుబట్టి ఆయా ప్రతిబింబముగూడ ఆయా రంగులు గలదిగానే తోచు చుండును. అట్లే నిర్మలమగు నద్దమున ప్రతిఫలించిన బింబము నిర్మలముగాను, మలిన దర్పణమున ప్రతిఫలించినది మలినముగా నుండుట సహజము. జీవుడనువాడు అవిద్యోపాధియందలి బ్రహ్మప్రతిబింబము. అవిద్యయనగా మలిన సత్వప్రధానమైన ఉపాధి. ఈ అవిద్యోపాధి బ్రహ్మముయొక్క సచ్చిదానందాది దివ్య లక్షణములను కప్పివేసి, తనయొక్క వికారములను గుణములను అతనికొడగూర్చు చున్నది. అందుచే నా బ్రహ్మము కించిజ్జ్ఞత్వము, మున్నగు నల్పగుణములు గలవాడయి జీవుడగుచున్నాడు. అప్పుడు, ఆ ఉపాధియే తన స్వరూపమనుకొని, మాయా (అజ్ఞాన) మోహితుడై అహంకార మమకారములకు వశీభూతుడై నానావిధ కర్మముల నొనర్చుచు, వాని ఫలములను గుడుచుటకై చావు పుట్టుకలనందుచుండును. ఎంత

వరకు జీవునకు స్వస్వరూప జ్ఞానము కలుగదో— అనగా ఉపాధి తాను కాననియు, తాను కేవల సచ్చిదానంద స్వరూపుడనను జ్ఞానము ఉదయింపదో, అంతవరకు ఆతడు కర్మపాశబద్ధుడై సంసారమున తిరుగాడక తప్పదు. జీవునకు తాను, ప్రకృతి అవ్యయము గు మపాధికంటెను భిన్నుడగు సచ్చిదాత్ముడను జ్ఞానము కలిగినచో, ఆతడు జీవత్వము నెడబాసి బ్రహ్మత్వమును భజించును. అంతదనుక క్లేశకర్మ విపాకాశయముల కాతడు వశుడై యుండవలసినదే.

## ఈశ్వరుడు

ఆ అఖండ బ్రహ్మమే మాయోపాధియందు ప్రతిబింబించి ఈశ్వరుడని పిలువబడుచున్నది. మాయోపాధి శుద్ధసత్త్వము ప్రధానముగా గలది. ఆ యుపాధి నిర్మలమైనందున, ఈశ్వరునియొక్క సర్వజ్ఞత్వము, సర్వైశ్వర్యత్వము, సర్వశక్తిమత్త్వము, సర్వాంతర్యామిత్వము మున్నగు దివ్యగుణములను మరుగు పరచదు. కనుకనే ఈశ్వరుడు మాయను వశీకరించుకొని, దానిని ఆడించ గలడు. అవిద్య యనునది మలినసత్త్వము ప్రధానముగా గలదైనందున, బ్రహ్మమునకు తన గుణ వికారముల నాపాదించి జీవ ధర్మములను పట్టుపరచి, వానిని వశ మొనర్చుకొని, చిత్రవిచిత్ర రీతుల నాడించుచు, నేడ్పించుచు నుండును. ఇప్పట్టున పతంజలి చెప్పిన ఈశ్వర లక్షణములు స్మరింప దగినవై యున్నవి.

'క్లేశ, కర్మ, విపాకాశయై రపరామృష్టః
పురుష విశేష ఈశ్వరః'.

క్లేశములు, కర్మములు, విపాకము, ఆశయము— అను నాల్గింటి చేతను తాకబడనివాడే ఈశ్వరుడు. క్లేశాదులు నాలుగును జీవులను బంధించునే గాని, ఈశ్వరుని కట్టివేయ లేవు. అందుకే ఈశ్వరుడు మాయను వశపరచుకొని ఆడింపగలడనియు, మాయ జీవుని వశపరచుకొని యేడ్పించుననియు చెప్పికొన్నాము. క్లేశాదుల స్వరూప మిది:—

క్లేశము లనునవి అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము — అని అయిదు విధముల నుండును. అది లేని దానియందు, అది యనెడు బుద్ధియే అవిద్య. (అతస్మిన్ తద్బుద్ధిః) అనిత్యములైన ఘటపటాదులను నిత్యములుగాను, అశుచియైన దేహాదులను శుచియైనవిగాను, దుఃఖ రూపములైన స్రక్చందనాదులను సుఖములుగాను, అనాత్మయైన దేహాదులను ఆత్మగాను తలంచు బుద్ధియే అవిద్య యని తెలియవలయును. ఈ అవిద్య నుండియే తక్కిన అస్మితాదులు పుట్టుచున్నవి. ఇట్టి అజ్ఞానము వలననే బుద్ధి తత్త్వమును, ఆత్మ తత్త్వమును ఒక్కటే యని మానవుడు పొరబడుచున్నాడు. అనేకులు అంతఃకరణము, లేదా మనస్సు కంటెను భిన్నమైన ఆత్మ యున్నదని గుర్తింప లేకుండుటయే అస్మిత; అనెడి క్లేశము. అనగా దృగ్రూపమైన ఆత్మవస్తువు ద్రష్ట. దర్శనశక్తి బుద్ధి. ఆ దృగ్దర్శన శక్తు లొక్కటియే యని తలంచుటచేత జీవితము పెడదారిని బట్టును. అవి వేరనెడి పరిజ్ఞానమువలన తత్త్వ మార్గములో జీవితము కొనసాగును. కావుననే, ఇట్టి అస్మిత జీవులనే గాని, ఈశ్వరుని బంధింప జాలకున్నది. ఆతడు సర్వజ్ఞుడు కదా!

ఇట్టి అస్మితవలన రాగద్వేషము లేర్పడు చున్నవి. అంతఃకరణమును తాననుకొని, దేహమునం దహంకారమును, తద్భిన్నములందు మమకారమును కలిగించుకొనుటవలననే, ప్రియములపై అనురాగము, అప్రియములపై ద్వేషమును కలుగుచున్నవి. రాగద్వేషములవలన జీవనమే తబ్బిబ్బయి జీవుని కలగుండు పెట్టుచుండుట ఎవరెరుగని విషయము. ఒకానొక సాత్త్విక హృదయుడు, వీనికి దూరుడై లోకవ్యవహారములకు లోబడకుండుట మనము చూచునే యున్నాము.

ఈ రాగద్వేషముల వలన అభినివేశమను క్లేశము పొడముచున్నది. అభినివేశమనగా మరణ భయమని యోగ పరిభాషలో నర్థము. జీవుడితః పూర్వమనేక జన్మములెత్తి మరణమునకు లోనయి యున్నాడు. ఆ స్మృతి సంస్కారము లాతని చిత్తమున వాసనారూపమున ధృవపడియున్నవి. కావున పండితులకు గూడ మరణమన్న భయము కలుగుచున్నది. ఈ అవిద్యాది పంచ

కము సంసార కారణములై జీవులను క్లేశపరచు చున్నందున వీనిని క్లేశములని పేర్కొన్నారు.

ఈ క్లేశముల వలననే జీవులు, కర్మలయందు ప్రవృత్తులగుచున్నారు. శరీర సుఖముల నాశించి, రాగద్వేషములకు వశులై విహిత నిషిద్ధ రూపములును, నిత్యనైమిత్తిక కామ్యాకారములును అగు నానావిధ కర్మలను చేయుచున్నారు. ఆ కర్మలవలన జాత్యాయుర్భోగ రూపమైన విపాకము అనగా కర్మ పరిపాకము కర్మానుభవము కలుగుచున్నది. జీవులు తామొనర్చిన పుణ్య, పాప, మిశ్రరూపకర్మలవల్లనే దేవ, మనుష్య, తిర్యక్, స్థావరాది రూపముల జన్మములెత్తి సుఖ దుఃఖముల ననుభవించుచున్నారు. ఆయా జీవులు ఆయా జన్మములందు పొందెడి సకల ఫలితములకును వారి వారి పూర్వ జన్మములలోని సుకృత దుష్కృత కర్మములే కారణములనుట ఇక్కడ రహస్యము. ఈ విధముగా ధర్మాధర్మ రూపములైన కర్మలుచేసిన పిమ్మట, వాని సంస్కారములు చిత్తమున వాసనా రూపముగా నాటుకొని యుండును. ఆ సంస్కారములనే సూత్రము ఆశయ శబ్దముచేత పేర్కొన్నది. పైన వివరించిన పంచక్లేశములు, పుణ్య, పాప, మిశ్ర రూప కర్మలు, వాని ఫలితములైన జాత్యాయుర్భోగములు, ఆ కర్మలయు విపాకములయు సంస్కారములు ఈశ్వరునికి లేశమాత్రమైన నుండవు. ఈ యంశములను గీతలో భగవానుడిట్లు వాక్రుచ్చినాడు.

(1) 'జన్మ కర్మ చ మే దివ్యం.

(3) 'న మాం కర్మాణి లింపన్తి, న మే కర్మఫలే స్పృహా.'

(2) 'ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా.'

నా జన్మకర్మలు దివ్యములు. అనగా మాయను గెలిచినట్టివని భావము. నేను నా మాయాశక్తి ప్రభావమున, మహదాది రూప ప్రకృతి నధిష్ఠించి జన్మించుచుందును. ఈశ్వరుడు వశీకృత మాయు డనుటలోని రహస్య మిదియే. నాకు కర్మఫలముల మీద కోరిక లేదు. అందుచేత నన్ను కర్మలు బంధింపవు. బంధించుటే కాదు, వాని స్పర్శయే నాకు తగులదు.

ఈ విచారణవలన, క్లేశ కర్మ విపాకాశయము లీశ్వరుని బంధింపవనియు. జీవులకే అవి బంధకారకము లనియు తేలినది. ఏవంవిధ లక్షణములు గల జీవునికి ప్రకృతి (ఉపాధి) కంటెను తాను వేరను జ్ఞానము కలుగవలసియున్నది. ఆ జ్ఞానము కలిగినవాడు, ఆత డీశ్వర లక్షణ లక్షితు డగుటకు యత్నించును. జీవునికి క్లేశాదుల పరిహారము జరిగి, ఈశ్వరత్వ ప్రాప్తి లేదా, ప్రకృతి సంగ రహితమైన కైవల్యము చిక్కుటకే యోగానుష్ఠానము.

ఇంత దనుక ఆతడు శరీరోపాధితో తాదాత్మ్యము నందియున్నాడు. స్థూల దేహమే తాననుకొని కొంతకాలమును, సూక్ష్మదేహమే తానని కొంత కాలమును కారణ దేహమే తానని కొంత కాలమును భ్రాంతిలో చిక్కుకొని యున్నాడు. ఆ భ్రాంతి పోవుటకు, తొలుత మనము చెప్పికొన్న త్రికరణములను (శరీరము, వాక్కు, అంతఃకరణము) పరిశుద్ధ మొనర్చుకొనవలయును. ముందు తన శరీరమును, అవల వాక్కును, పిమ్మట చిత్తమును మాలిన్య రహితములు చేసికొన్నగాని, వానికి సత్యాత్మ సాక్షాత్కారము కాదు. ఆత్మ సాక్షాత్కారము దుఃఖ నివృత్తికి కారణము. 'తరతి శోక మాత్మవిత్.'

సాధనములు బలిష్ఠములును, పరిశుద్ధములును కానిచో సాధ్యమెన్నటికిని సాధింపబడదు. వానినట్లు బలిష్ఠములను సంశుద్ధములకు ఒనర్చు దివ్యసాధనము రాజయోగమే. ఏతదభ్యాసముచేత జీవుడు దివ్యగుణ విలసితుడు, సత్సాధనసంపన్నుడు కాగలడని వేరు వేరు సువిదితము కాగలదు.

వ్యాసారంభమున, ఆస్తిక నాస్తిక ప్రశంస చేయబడినది. ఇంతవరకును ఆస్తికులకు యోగమెట్లుపయోగపడునో అనునంశము మాత్రమే సంగ్రహముగా వివరింప నైనది. కాని, ఆత్మయనునది; లేదనియు, అది కేవలము చైతన్య మాత్రమే అనియు, ఆ చైతన్యముకూడ శరీరము మరణించుటతోడనే నశించు

నవియు నమ్మెడి నాస్తికులకు యోగమువలన కలిగెడి లాభమేమని ప్రశ్న రావచ్చును. అందుకు యోగము చెప్పు సమాధానమిది.

నాస్తికులు, జన్మాంతరమును పొందెడి శాశ్వతాత్మ లేదనుచున్నారేగాని, ఈ జన్మమునందలి మానవ జీవితమును నాస్తి అనుటలేదు. మానవుడీ జన్మములో సుఖములను అనుభవింపవలయుననియు, క్రొత్త క్రొత్త విజ్ఞాన విశేషములను గనిపెట్టి సృష్టికి ప్రతిసృష్టి చేయవలయుననియు, తన్మూలమున బ్రతుకు బాటను నిష్కంటకము చేసికొనవలయుననియు తలంచుచునే యున్నారు. అందుకుకూడ మానవున కున్న దేహసంపద, బుద్ధివైభవము, వాక్పాటవము, ఇంద్రియముల సామర్థ్యము పెంపొందవలసి యున్నది కదా. నరుని శరీరేంద్రియములను, ప్రాణశక్తిని, బుద్ధి సామర్థ్యమును ఇతోధిక బలసంపన్నములు చేయుటకును, వానికి అపార్థివమైన దివ్యత్వమునందించుటకును యోగము పరమ సాధనమే. పృథ్వీతల మాత్ర పరిచ్ఛిన్నుడైన మానవుడు, అపార్థివ దివ్య పరిణామమును చెందుటకును, తన మనశ్శక్తిచే అతీతవ్యస్త సమస్త శక్తులను పిడికిట బట్టుటకును ఏల ప్రయత్నింపరాదు? అట్టి సత్ప్రయత్నమే ఈ యోగాభ్యాసము. ప్రాచీన యోగ పరిభాషలో నుడువవలయునన్న, మరణధర్మియగు మనుష్యుడు, అమృతత్వములోని కేగుటకును, అసద్రూపుడగు నరుడు, సత్ప్రపంచమున విహరించుటకును, అజ్ఞానాంధకార నిమగ్నుడైన జీవి జ్యోతిర్లోకములలో క్రీడించుటకును, అట్లు క్రీడించి అష్టైశ్వర్య సంపత్తిని కొల్లగొట్టుటకును, అనగా అణిమాద్యష్ట విభూతులను అచ్చనగండ్లుగా చేసికొని, ఆటలాడుచు పురుషోత్తము డగుటకును ఈ యోగాభ్యాసము దారి చూపుచున్నది. కనుక ఆస్తికులకే గాక, మానవశక్తియందు విశ్వాసము గల నాస్తికులకును ఈ రాజయోగ ముత్తమోత్తమ సాధనమే. సర్వసిద్ధి ప్రదాయకమే.

'నాస్తి సాంఖ్య సమం జ్ఞానం,
నాస్తి యోగ సమం బలం.'

---



# పండితరాయల అక్షింతలు

డా. మహీధర నళినీమోహన్

## బ్రహ్మదేవుడు

పెరటి దొడ్లో బొగడ చెట్టుకి కట్టిన ఉయ్యాలా మంచంమీద కూర్చుని ఉన్నాడు పండితరాయలు.

ఉదయంనుంచీ లవంగి తనతో మాట్లాడడం లేదు. ఏదో అలక. తాను ఎంత సముదాయించబోయినా ఆమె కోపం తగ్గలేదు.

'మీకు మీ కవితాకన్య అంటేనే ఎక్కువ ముద్దు నాకన్నా' అదే ఆమె ఆఖరుమాట అనాడు.

అది మాఘ పూర్ణిమ.

మునిమాపు వేళ.

చల్లని గాలి తెరలు తెరలుగా వీస్తోంది, సన్నజాజుల పరిమళాలను మిళాయించి. ప్రకృతి అంతా బహు ఆహ్లాదకరంగా ఉంది. జాజి మొగ్గలు సుతారంగా తెంపుతూన్న లవంగి జగన్నాథునివైపు సోగకళ్లతో చూచింది. ఆ కళ్లల్లో కోపచ్ఛాయలు లేవు. రాబోతున్న చిరునవ్వును అణచి పెట్టుకుంటు న్నట్లు పెదవులు బిగించుకుంది.

పండితరాయల గుండె పులకరించింది.

చంద్రోదయం కాబోతోంది.

'రావయ్యా చందమామా! రా. నువ్వువస్తే కాని మిగిలిన ఆ కాస్త బెట్టుసరీ సడలదు.' అనుకున్నాడు.

అంతలో ఏదో మించుకు పోయినట్లు ఓ కారు మబ్బు హడావిడిగా పరుగెత్తుకువచ్చి చంద్రుణ్ణి మూసేసింది.

పండితరాయలకి ఒళ్లు మండింది.

వెన్నెల తాగితేగాని దాహంతీరని చకోరపక్షులు చంద్రుని రాకకోసం తూర్పు దిశగా వెయ్యి కళ్లతో ఎదురు చూస్తున్నాయి.

కొలనిలోని కలువ కన్నెలు ప్రియాగమనం కోసం మోహాలు ఇంతంత చేసుకుని చూస్తున్నాయి. మన్మధుడునారి సారించి, విల్లు ఎక్కుపెడుతున్నాడు. మానవతులలో బెట్టుసరి సడలుతోంది. ప్రియులు చేసిన తప్పిదాలను క్షమించడానికి సిద్ధపడుతున్నారు.

ఇటువంటి మధురాతి మధురమైన క్షణంలో చంద్రుణ్ణి మబ్బులతో కప్పేసి రసభంగం చేస్తావు టయ్యా? బ్రహ్మదేవుడా! నీకు మతిపోయిందా?

## శార్దూల విక్రీడితం

తృష్ణాలోల విలోచనే కలయతి
ప్రాచీం చకోరీగణే
మౌనం ముంచతి కించకైరవకులే
కామే ధనుర్ధున్వతి
మానే మానవతీ జనస్య సపది
ప్రస్థాతు కామేధునా
ధాతః! కిన్ను విధౌ విధాతుముచితో
ధారా ధరాడంబరః?

## ఉత్పలమాల

తూరుపుగా చకోరములు దుస్పహ
దాహముతోడ జూడగా
కైరవ మండలంబులు మొగంబులు
విప్పగ, కౌశలంబువన్
మారుడు నారిమీటు తమ నాథుల
తప్పుల సైచి చెంత కొ

య్యారులు సేర— నేడు తగునా
వలువా! శశి గప్ప మబ్బులన్?

*   *   *

## ఏనుగు

ఓ ఏనుగూ! ఈ తుమ్మెదలు దానార్థులై (మదజలం త్రాగాలని) నీ దగ్గరకు వస్తే వాటి మీద విసుక్కుని చెవిచేటలు దూరంగా తరిమివేస్తున్నావా? ఏమి మదాంధ్యం నీకు! ఆ తుమ్మెదలు వచ్చి వాలితే నీ గండతలములకే శోభ అని ఎరగకుండా ఉన్నావు. నువ్వు రానివ్వకపోతే వాటికి లోటు అనుకుంటున్నావా? వికసించిన తామరలు సరస్సుల నిండా ఉండనే ఉన్నాయి. అక్కడికి వెళ్లి హాయిగా తేనె తాగుతాయిలే, మరేమీ మించిపోలేదు.

ఓ రాజా! విద్వాంసులు దానార్థులై నీ దగ్గరకు వస్తూంటే వాళ్లని విదలించి పారేస్తున్నావా? ఏమి గర్వం నీకు! అటువంటి మహాపండితులు నీ దగ్గర ఉన్నారంటే అది నీకే గౌరవప్రదమైనదన్న సంగతి తెలియకుండా ఉన్నావు. నువ్వు ఆదరించకపోతే లోకం గొడ్డుపోయిందా? వీరిని నెత్తిమీద పెట్టుకునే రసికావతంసులు లోకంలో లేకపోలేదు.

## వసంత తిలక

దానార్థినో మధుకరా యది కర్ణతాలై
ర్దూరీకృతాః కరివరేణ మదాంధ బుద్ధ్యా
తస్యైవ గండ తల మండన హాని రేషా
భృంగాః పునర్వికచ పద్మవనే చరంతి.

## ఉత్పలమాల

దానముగోరి భృంగములు దగ్గర జేర
మదాంధ బుద్ధిచే
ఏనుగు దానినెల్ల విదలించె పిసీ!
చెవిచేటలూపి—అ
ద్దాన కొరంత గల్గు మదదంతి
మనోజ్ఞ కపోల శోభకే
గాని, ద్విరేఫముల్ వికచ కంజవనిన్
విహరించు క్రమ్మరన్.

*   *   *

## పద్మం

ఇదే విధంగా పద్మాన్ని నిందిస్తున్నాడు.

ఓ పద్మమా! తుమ్మెద నీ దగ్గరకువస్తే నీ పుట్టి ఏదో మునిగిపోయినట్లు రేకులు ముడిచేసుకుని లోపలికి వెళ్లనివ్వవూ? దానివల్ల తుమ్మెద కేం లోటూ? అవతల విరియబూచిన తియ్యమామిడి తోపులు లేవా?

## అనుష్టుప్

దళాని ముకుళీ కృత్య
ప్రవేశం నదదాసి చేత్
పద్మ! భృంగస్య కాహానిః
పుల్లే చూతవనే స్థితే?

## ఆటవెలది

తమ్మి! మొగము ముడిచి దారినీయ కపోతి!
వళికులాధి నాధుడరుగు దేర
దాన తేటికేమి హాని వాటెల్లనే
విరియబూచి చూత తరువులుండ?

*   *   *

## మేఘం

ఎండలు పేల్చేస్తున్నాయి. ఆ ఏడు వర్షాలు బాగా ఆలస్యమయ్యాయి. ఎదురుచూడగా చూడగా ఆఖరికి ఆకాశంలో మబ్బు కనిపించింది. అందరి మొగాలూ వికసించాయి. కాని ఏం లాభం? పట్టుమని పది చినుకులైనా పడలేదు. మబ్బులు చల్లగా జారుకున్నాయి.

నెరియలు పడ్డ చెట్ల బోదెలైనా నిండలేదు. శుష్కించిపోయిన చాతక శిశువు గొంతు కూడా తడవలేదు. దావానలంలో మాడిపోయిన చెట్లు చల్లబడనైనా లేదు. ఓరి వారిధరుడా! నీకు ఈ వారి శబ్దం కేవలం బరువు చేటురా!

ఇటువంటి సందర్భాలలో మేఘాన్ని వారిదము అనకుండా వారిధరము అని మాత్రమే అంటాడు.

'వారి పదం'లోని పదం అనే మాటకి శబ్దం అనీ స్థానం అనీ అర్థాలుండడం గమనార్హం.

## వసంతతిలక

నైవాలవాల వలయం భరితం ద్రుమాణాం
నార్ద్రీకృతా పిబత చాత కపోత చంచుః
దావానలా కుల తరుః శమితోన శీఘ్రం
భారాయ వారిధర! వారి పదం తవా భూత్

## తేటగీతి

నీరధర! చెట్ల బోదెలు నిండలేదు
అడవిలోన దవాగ్ని చల్లారలేదు
కడకు చాతకి ముక్కైన తడియలేదు
బరువు చేటయ్యెరా నీకు వారి పదము.

* * *

వాన చినుకులకోసం ఎదురుచూచిచూచి, కళు కాయలు కాచిన చాతకపక్షుల కళ్లనుండి రాలిపడిన కన్నీటి బిందువులపాటి నీటిబిందువు లయినా రాల్చలేక పోయావు. ఎంతటి ఔదార్యమయ్యా నీది—మేఘుడా!

నువ్వు మహాదాతవని విని పది ఆమడల దూరంనుంచి బహుశ్రమపడి వచ్చిన ఈ దీనుడికి దారి ఖర్చులకు అయినపాటి డబ్బులుకూడా విదలించ లేకపోయావు. చాలా బాగుందయ్యా నీ దాతృత్వం.

## అనుష్టుప్

ఆసన్ కణాని యావంతి
చాతకాశ్రుజితే ౽ంబుద!
తావతో౽పి త్వయో దార!
న ముక్తా జల బిందవః

## తేటగీతి

ఎదురు చూచెడు వాన కోయిలలనుండి
ఎన్ని కన్నీటి బిందువు లిలను బడెనొ
అన్ని జలబిందువుల నైతమంబు వాహ!
ఈయ వెటువంటి ఔదార్య మోయి నీది!

* * *

కటిక ఉపవాసాలతో శుష్కించి, కళ్లల్లో ప్రాణాలు పెట్టుకుని వీధి వాకిట్లో చతికిలబడి పోయిన యాచకుణ్ణి చూచి 'చెయ్యి ఊరుకోలేదు' వెళ్లు వెళ్లు. ఆ వారం ఈవారం కలిపి మళ్లీ వారం ఇస్తాంలే. ఇప్పటికి ఫో' అని కసిరి పంపేస్తున్నాడు ఒక ఖామందు. మళ్లీ వారందాకా ఆ వ్యక్తి బతికి ఉండవద్దా? ఆ కాస్త ప్రాణం గుటుక్కుమన్నాక ఎంత శాస్త్ర మాత్రం ఏం లాభం?

ఓ మేఘుడా! చాతకపక్షులకి ఈ వర్షాకాలంలో నీళ్లు ఇవ్వకపోతే ఏం పోయిందీ, మళ్లీ ఏడు రెట్టింపు వర్షం ఇద్దాంలే అనుకుంటున్నావా? మాన ధనులైన ఆ పక్షులన్నీ దాహబాధకి తాళలేక ఈ రోజే చచ్చిపోతాయయ్యా. నీకు కళ కుదిరేదాకా ఒక్కటీ మిగల దయ్యా.

## శార్దూల విక్రీడితం

అస్యాం ప్రావృషి చాతకైర్జలకణా
లబ్ధావచేత్ కిం తతో
భావి ప్రావృషి దాస్యతే ద్విగుణ మి
త్యభ్ర! త్వయా మన్యతే
ఏతే౽ద్యైవలయం వ్రజంతి పృథుకా
ఏతత్కులీ నో౽పి చే
దేకః ప్రాణితి తావదేత దల మి
త్యత్రైవ నః సంశయః

## శార్దూల విక్రీడితం

ఈ వర్షర్తువునందు చాతకికి
నీరీకున్న నేమాయె, పై
ప్రావృట్కాలము రెండురెట్ల జలమీ
వచ్చెంచు జీమూతుడా!
భావింపం దగదోయి, చాతక కుల
ప్రాణంబు లీనాటితో
పోవున్, దక్కడు తత్కులీన విహగ
వ్యూహంబునం దొక్కడున్.

* * *

ఒక మహారాజా ఉన్నాడు. అతడు లోకోప

కారకములైన మంచిపనులు కొన్ని చేస్తున్నాడు—నిజమే. కాని, కవులను, పండితులను పోషించడు. ఆ రసికత అతడిలో లేదు. అటువంటి రాజును మేఘంతో పోల్చి నిందిస్తున్నాడు పండితరాయలు.

కవి అనే మాటకి శుక్రగ్రహం అని మరో అర్థం ఉంది. బుధుడు అంటే పండితుడు అని బుధగ్రహం అనీ అర్థాలున్నాయి. ఈ అర్థద్వయాన్ని ఉపయోగించుకుని చమత్కరించాడు.

ఓ మేఘుడా! హర్షప్రదమైన వర్షాన్ని ఇస్తున్నావు. చాతకపక్షుల చిరకాల దాహబాధను తగ్గిస్తున్నావు. ఎండి బీటలువారిన భూమండలానికి తాపశాంతి కలిగిస్తున్నావు. లోక శోకాన్ని హరిస్తున్నావు. ఇవి అన్నీ బాగానే ఉన్నాయి. పుణ్యకార్యాలే. సందేహం లేదు. కాని, బహు అనుచితమైన పని ఒకటి చేస్తున్నావు. సూర్యచంద్రులకీ, కవి బుధులకీ అవరోధం కలిగిస్తున్నావు. పనికిమాలిన మిడుగురు పురుగులమీద అనురాగాన్ని చూపిస్తున్నావు. ఇదేం బాగుంది చెప్పు. (ఇందులో సూర్యుడు, చంద్రుడు అనే మాటలకు కూడా అర్థద్వయాన్ని కల్పించి ఉంటే ఇంకా బాగుండేది. అనువాదంలో నేనా ప్రయత్నం చేశాను. గమనించవలసింది)

## స్రగ్ధరా

హర్షం వర్షం విధత్సే చిరసమయ తృషా
శుష్యతాం చాతకానాం
భూమేస్తాపోప శాంతిం వితరసి తరసా
లోక శోకం ధునోషి
అంభోదైతత్తదైకం పరమ మనుచితం
యత్పిధత్సే సుధాంశుం
భాసామీశం కవిం వా బుధమపి వహసి
ప్రేమ ఖద్యోత వర్గే.

## మత్తేభ విక్రీడితం

అవనీ తాపము నాహరించెదవు దాహ
గ్లాని శాంతింప జే
తువు సారంగికి, లోకశోక హర
ణోద్యోగంబు గైకొంటి వో
నవ నీలాబ్దమ! మానవైతివి
దురన్యాయంబు—నీకేల స
త్కవి రాణ్మిత్ర బుధావరోధమును,
తటిద్యోత సమ్మోదమున్.

* * *

## కోయిల

ఓయి విద్వత్కవీ! నీ పాండిత్యాన్ని, నీ కవిత్వ సంపదనీ సరసుడైన ఏ మహారాజా దగ్గరో ప్రదర్శిస్తే బాగుంటుంది కానీ, వడ్డీ లెక్కలలో తప్ప మరెందులోనూ ఆసక్తిలేని ఈ గురవయ్య సెట్టి దగ్గర చూపిస్తే ఏం లాభమయ్యా

ఓ కోకిలా! ఏ తియ్యమామిడి చెట్లమీదనో పంచమరాగాలాపనంచేస్తే శోభగా ఉంటుంది. కానీ, మోదుగు చెట్లమీదా చండ్ర తోపుల్లోనూనా నీ గానం?

## అనుష్టుప్

కలకంఠ! యథా శోభా
సహకారే భవద్గిరః
ఖదిరేవా పలాశేవా
కింతథా స్యాద్విచారయ

## స్రగ్విణి

తీయ మామిళ్లపై తీరుగా కూయగా
కోయిలా! శోభ చేకూరు నెంతేనియున్
పోయి గన్నేరులన్ మోదుగుందోపులన్
కూయగా నేమగున్? సుంత యోచింపుమా!

* * *

ఎర్రని చిగుళ్లతో, తుమ్మెదలు ఝుమ్మంటూన్న పూగుత్తులతో బహుసుందరంగా ఉన్న తియ్యమామిడి చెట్లను వదిలిపెట్టి బొంత కాకులకు నివాసమైన చేదు విషంలాంటి ఈ వేపచెట్టుమీద వాలే వెందుకే? కోయిలపిల్లా! మాట్లాడవేమి?

## వసంత తిలక

సంత్యజ్య కోకిల శిశో! మధుర ప్రవాళం
మాకంద బృంద మళిపోత మిళత్ప్రసూనమ్
నింబేతు తిక్తహృదయే బలిభుక్కులాఢ్యే
హావేన తిష్ఠసి యదీహ వదాశు కార్యమ్.

## వసంత తిలక

మాకంద బృందముల మత్తమిళింద పుష్పా
నేక ప్రవాళముల నెల్ల త్యజించి నేడీ
కాకోల విష పరిగంధిల తిక్తనింబ
స్వీకారమేల? పికశేఖర! హావమేలా?

* * *

ఓ కోయిలా! బహుకాలం తియ్యమామిడి చెట్ల మీద మహావైభవంగా కాలం గడిపేవు. ఇప్పుడు ఇతర వృక్షాలను ఆశ్రయించడానికి నీకు సిగ్గెయ్యడం లేదూ ?

ఓ విలాసినీ ! బహుకాలం ఆ రసికాగ్రేసరుని పోషణలో ఇంద్రభోగాలు అనుభవించావు. ఇప్పుడు మరొకణ్ణి ఆశ్రయించడానికి సిగ్గులేదూ?

## అనుష్టుప్

సహకారే చిరం స్థిత్వా
సలీలం బాలకోకిల !
తం హి త్వాద్యాన్య వృక్షేషు
విచరన్న విలజ్జసే

## నవనందిని

సహకార దివ్యతరు సంతతులలో మున్
బహు వాసరమ్ము లతివైభవము తోడన్

విహరింపవో పికము! నేడితర భూవిా
రుహమున్ వరించెద వెరుంగవటె సిగ్గున్

*   *   *

## చిలుక

ఓయి మహానుభావా! పండితులతోనూ, కవులతోనూ, కళాప్రపష్టలతోనూ కలకలలాడే ఆ భువన విజయాన్ని విడిచిపెట్టి, బూతుల పంచాంగం విప్పడంలోనే అపూర్వ పాండిత్యంగల ఈ కొక్కిరాయి పల్లికి వచ్చిపడ్డావేమయ్యా! ఇక్కడ నీ మధురాతి మధురమైన కవిత్వాన్ని వినిపిస్తా వెందుకయ్యా! వృథా కంఠశోష.

ఓ చిలుకా! చిరగ్గాచిన తియ్యమామిడి చెట్లున్న ఆ వనభూమిని విడిచిపెట్టి అతి పరుషరవంతో గూబలు పగలగొట్టే కాకి మూకలకి నివాసయోగ్యమైన ఈ వేప చెట్టుమీాదికవచ్చి, వ్యర్థంగా నీ మధుర వాక్కులను వినిపిస్తావెందుకే?

## మాలినీ

అతిపరుష రవాణాం వాయసానాం నివాసే
ఫలవతి పిచుమందే మందబుద్ధే! కథం వా
స్వనసి మధురవర్ణీం వ్యర్థయన్ రాజకీర!
కుసుమిత సహకార ప్రాంత భాగం విహాయ

## చంపకమాల

పరుషరవమ్ముచే చెవులు బ్రద్దలు
చేసెడు వాయసాళికిన్
ఇరవగు వేపచెట్టు పయికెక్కి
అపూర్వ వచః ప్రసంగముల్
నెరపెద వేలనే తెలివిలేక
వృథాశ్రమ రాజకీరమా!
సరస రసాలసాల పరిసర్పిత
భూముల వీడ నాడుచున్?

*   *   *

(సశేషము)



**కలగూరగంప :**

# తెలుగులో 'వాక్యరచన' పునఃపరిశీలనం

**1973** ఆగస్టు భారతి 'కలగూరగంప'లో శ్రీ కాశీభొట్ల సత్యనారాయణ గారు 'తెలుగులో వాక్యరచన—ఒక పరిశీలన' అనే పేరిట కొన్ని వాక్యాలలోని 'లోట్లు' పరిశీలిస్తూ నా 'కాళిదాస కళామందిరము'లోని ఒక వాక్యం తీసి 'అలవాటు తొందరలో పొరపాటు చేశార'ని వ్రాశారు. ఈ వాక్యం చాలా సొగసైనది. ఈ 'అలవాటు' అనే మాట నా 'తొందర'కు చెందుతుందో 'పొరపాటుకు' చెందుతుందో ఆలోచించవలసి వుంది.

నా రచనను అంతశ్రద్ధగా వాక్యవాక్యమూ చదివినందుకు ముందు నా కృతజ్ఞత చెప్పుకొంటూ ఇక ఆ తప్పేదో దిద్దుకుందామని ఆ పరిశీలనను పునఃపరిశీలిస్తే ఆయన వ్రాతకు నవ్వువచ్చింది. 'గురుతుల్యులు' 'విద్వన్మూర్తులు' అనే మాటలు వట్టి ఉపచార వచనాలు కాకపోతే, మేము కలుసుకున్నప్పుడు ఒకసారి అడిగితే తీరిపోయేది. భారతి దాకావెళ్లి ఆయన శ్రమపడి నన్ను శ్రమపెట్టారు. నా పుస్తకం నిర్దుష్టం అనే అహం నాకు లేనూ లేదు. ఉంటే చెల్లనూ చెల్లదు. మా అబ్బాయి తప్పు చూపించి దిద్దమంటే ఎంత సంతోషమో, సత్యనారాయణగారు చూపి దిద్దమన్నా అంతే సంతోషం.

ఆ వాక్యరచన ఆయనకు సరిగా అవగతం కాలేదని చెప్పడానికి విచారిస్తున్నాను. ఆ వాక్యం 'కుమార సంభవం'లో పార్వతీ సౌందర్య వర్ణన సందర్భం లోనిది.

ఆయన ఒకసారి ఆ వాక్యంపైని ముద్రించి వున్న శ్లోకం చూస్తే 'అలవాటు తొందరలో ఈ పొరపాటు' జరగకుండా వుండేది.

'పాలిండ్ల పొంకముచే బలిష్ఠమైనది' ఆమె 'మెడయే'కాని 'ఆమె' కాదు. 'కంఠస్య తస్యాఃస్తన బంధురస్య, ముక్తాకలాపస్య చ నిస్తలస్య' అనే శ్లోకానికి నేను వ్రాసిన భావంలోది ఆ వాక్యం. 'కంఠస్య' అనే మాటకు 'స్తనబంధురస్య' అనే మాట విశేషణం. అచ్చులో 'ఆమె మెడ' అని తప్పు స్పేస్ పడినందువల్ల ఈ భ్రమ కలిగిందనుకుంటాను. 'పాలిండ్ల పొంకముచే బలిష్ఠమైన కంఠమునుండి ముత్యాల హారము వ్రేలుచున్నద'ని వాక్యార్థము. 'కంఠమునుండి వ్రేలుచున్నది.' అనడంకంటె' మెడనుండి వ్రేలుచున్నది' అనడం తెలుగు నుడి కనుక భావంలో అట్లా వ్రాయడం జరిగింది. ఈ స్వల్ప విషయం ప్రయత్నిస్తే వారికికూడ తెలిసేది.

శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

## పండిత రాయల వెక్కిరింపులు— ఒక అనుమానము

డాక్టర్ మహీధర నళినీ మోహనరావుగారి పండిత రాయల వెక్కిరింపులు చక్కగా పాఠక హృదయములకు హత్తుకొనుచున్నవి. కాని యనువాదములలో నటనట కొంచెము వ్యత్యాస మున్నదని భావించుచున్నాను. సెప్టెంబరునెల భారతిలోని పండిత రాయల వెక్కిరింపులపై నాయనుమానములను మీకు పంపుచున్నాను.

(1) ధుత్తూరమును గూర్చి చెప్పబడినది శ్లోకము కాని యనువాదమున ధుత్తూర ప్రసక్తియే లేదు.

(2) ఏనుగును గూర్చి వ్రాయబడిన శ్లోకము నందలి 'కేళిం కురుష్వ' అను మాట యనువాదమున పూర్తిగా విడువబడినది,

(3) శ్లేషార్థమున చెప్పబడిన 'ఆశాశా శ్యాంబరాఖ్యా' అను శ్లోకమునందలి శ్లేష పదములను దెను గున తెలిపినారు. కాని 'క్షుద్రాశ్మ శర్కరేతి' అను పది విడువబడినది.

(4) కొంగను గూర్చి యనువదించిన పద్యము మూల భిన్నముగా నున్నది.

(5) నందనవనమును గూర్చి చెప్పిన 'స్వర్లోకస్య' అను శ్లోకానువాదమున మొదటి పాదము 'పెరుగున్ వీ యెడ కల్పవృక్షములు వివే వాలివ్యర్వాటికిన్' అనుచో యతి తప్పినది.

(6) సముద్రమును గూర్చి చెప్పబడిన శ్లోకమున 'పీత్వా గర్జంతి' అని యుండగా 'జలదంబుల్ నీ జలంబుల్ చవిగొని' అని తెనిగింపబడినది. చవి గొని యనగా రుచి చూచి యనియే గాని పీత్వాయన్న యర్థము రాదు. మేఘములు సముద్ర జలమును త్రాగి జలరూపమున వర్షించునని ప్రసిద్ధము. అనువాద మున నిది లోపించినది. 'త్రిదశ విటపీనాం' అను బహువచనమునకు 'కల్పవృక్షంబు' అని యేకవచనము వ్రాయబడినది. 'మునిక్షపాదృష్ట్యయః కాలక్షణీయాః' అను దానికి 'మునికృపకున్ పాత్రతన్ కోరుకొన్నా' అను నమువాదమంత సరసముగా లేదు.

(7) కిరాతి ముత్యాల భ్రాంతి శ్లోకమున 'పరికిరతి కిరాతీ హంత కాంతార ఏవ' అను శ్లోక పాదము 'ఉస్సురని దూరమునన్ పడవైచె వానిన్' అనునది. ఇది మూలానువాదమున జెల్లదేమో?

మొత్తము మీద రామమోహనరావుగారి యను వాదము సరసము హృదయంగమము. పండిత రాయల కీర్తి పతాకను తెలుగునాట రెపరెప లాడించుచున్నా రను యశస్సు వీరికి దక్కినది. అది యాంధ్రుల యదృష్టము.

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి.

## అనేకార్థ ద్యోతకం—'మాట'

'శ్రీ' 'పెద్దవారి మాటలకు అర్థాలే వేరులే' అనే సిసీ సూక్తి మనకి సుపరిచితమే. అసలు మాటలకే అనేకార్థా లున్నప్పుడు, అవి ఆల వల వాలికలమీదపడి వేర్వేరు అర్థాల్ని ఇవ్వటంలో ఆశ్చర్యం వుండదు. కావున, ఊనిక, స్వరం — వీటివల్ల మాటకున అర్థాలు మారుతూంటాయ్. ఉదాహరణకి 'ఆ!'ని తీసుకుందాం. ఇది పిలుపుకి జవాబూ కావచ్చు. ఒప్పుకోలుకు చిహ్నమూ కావచ్చు. అలసతకీ, భయానికీ, ఆశ్చర్యానికీ సూచకమూ కావచ్చు, ఇట్లా కాకుండా సందర్భాన్నిబట్టి కూడా అర్థాలు ఒకటికంటె ఎక్కువ ద్యోతకమవుతూంటాయ్. ఉదాహరణకి 'మాపు' 'తిరుగుడు' అనే పదాల్ని తీసుకొని వాక్యంలో ప్రయోగించి చూద్దాం:

'మాపు':—

(1) బట్టల్ని మాపేస్తున్నాడు.

(2) మాపటికి వస్తావా? రావా?

'తిరుగుడు':—

(1) వాడికి తిరుగుడు ఎక్కువయింది.

(2) అయితే, ఇక్కడో తిరుగుడుంది.

గిడుగు వెంకటసీతాపతిగారు 'మాట' అనే మాటకి పదకొండు అర్థాలు ఉన్నాయని తెలిపారు. వాటిని జి. యన్. రెడ్డిగారు తమ సిద్ధాంత గ్రంథమైన 'A study of Telugu Semantics' లో ఉట్టంకించారు (ఎనభై అయిదో పేజీలో.) నా దృష్టికి ఇది వచ్చాక 'మాట' అనే మాటకి ఈ పదకొండర్థాలేగాక ఇంకా వున్నాయేమోనని అన్వేషించటం మొదలు పెట్టాను. నా అన్వేషణ ఫలించినమీదట నేనింకో పదిహేడు కనుక్కోగలిగాను. అంటే 'మాట'కి వున్న అర్థాలు ఇప్పుడు మొత్తం ఇరవైఎనిమిది అన్నమాట. వీటిని గిడుగువారిచ్చిన ఉదాహరణలతోసహా ఈ దిగువ ఇస్తున్నాను. నేను సేకరించిన వాటికి నా శక్తిమేరకు ఆంగ్లంలో సమానార్థకాల్ని ఇచ్చాను. సహృదయులైన భాషాభిమానుల్ని పరిశీలించమని వేడుకొంటున్నా—

| | |
|---|---|
| 1. మాట ఇచ్చాడు | 'He made a promise' |
| 2. మాటపడడు | 'He will not tolerate an abuse' |
| 3. వాడిమాట సాగుతుంది | he is influential' |
| 4. మాటలు లేవు | 'Not on speaking terms or unable to speak.' |
| 5. మాటలు రావు | 'Not able to speak (the child), or dumb founded' |
| 6. వాడిమాట ఏం చేశారు | 'What have you done with regard to his affair' |
| 7. వాడు ఒకే మాటలో వచ్చాడు | He comes in a second' |
| 8. ఏమి నీ మాట? | "What is that you want to speak?' |
| 9. మా అబ్బాయికి మాటలిప్పుడే వస్తున్నాయ్ | 'Our child is now learning to speak' |
| 10. ఒక్కమాటలో చెప్పు | 'Put it briefly' |
| 11. నా మాట విను | 'Listen to my advice.' |

(ఇప్పటిదాకా గిడుగువారి ఉదాహరణ లిచ్చాను. ఈ క్రింది ఉదాహరణలు నావి.)

| | |
|---|---|
| 12. ఆ మాటకివస్తే | if you come to that |
| 13. ఒక మాట చెప్తా | I will tell you one thing (which in secret) |
| 14. వాడుమాటలు నేర్చాడు | |
| 15. మాటలు మిగల మోక | |
| 16. వాడి మాట వాడిదే | 'He is insistent' |
| 17. లేకపోతే మనకి మాట వస్తుంది. | 'Otherwise we will be at fault. |
| 18. అసలు మాట చెప్పాలంటే | 'As a matter of fact' |
| 19. మాట నిలబెట్టుకో | 'Keep your word' (promise) |
| 20. నీ మాట కాదు (నువ్వూరుకో) | 'It's not about you' |
| 21. వాళ్లిద్దరికీ మాటా మాటా వచ్చింది | 'They had a wordy duel or a verbal fight' |
| 22. మాట వరసకి అన్నాను. | 'Said in a casual way' |
| 23. ఎందు కడిగావూ అన్న మాట లేదే? | 'He does not realise the point.' |
| 24. ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి | 'If it were to be spoken in plain terms.' |
| 25. ఆ పని చెయ్యటం మాటలు కాదు | 'It is not an easy task.' |
| 26. మాటకి మాట చెప్తాడు | 'Paid in the same coin.' |
| 27. మనలో మన మాట | 'Just with in ourselves.' |
| 28. నీ మాట నీకే వుంటుంది | 'You can keep your own word or reserve your own word.' |

శ్రీ ద్వా. నా. శాస్త్రి.

---

# గ్రంథ విమర్శలు

## శ్రీ గీత గోవిందము
## గీత శంకరము

(సంపాదన, సంగీత రచన— శ్రీ మంచాల జగన్నాథరావు, ఆకాశవాణి, హైదరాబాదు. రాయల్ సైజు 19+101 పేజీలు. వెల రూ. 3–75. ప్రతులు దొరకు స్థలం— జాయింట్ డైరెకర్, ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యు స్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, అఫ్జల్‌గంజి, హైదరాబాదు—12.

(1) శ్రీ గీత గోవిందము

ద్వాదశ సర్గాత్మకమై, అష్టపదులనే గేయాల తోనూ, శ్లోకాలతోనూ కూడియున్న ఈ చిన్న గేయ కావ్యానికి రచయిత జయదేవకవి. ఇందు ప్రధానంగా రాధామాధవుల శృంగారము వర్ణించబడి ఉన్నది. ఇది దక్షిణ భారతదేశంలో 'అష్టపదులు' అనే పేరుతో బహుళ ప్రచారాన్ని పొందినది. మధురాతి మధురమైన జయదేవ మహాకవి రచన గానం చేసేటప్పుడు ప్రజానీకాన్ని తన్మయం చేస్తుంది. దీనికి ఎన్నో ముద్రణలు వెలువడ్డాయి. తెలుగులో ఎందరో కవులు అనువదించారు. అష్టపదులనూ, శ్లోకాలనూ ఎవరికి నచ్చిన రాగంతో వారు గానం చేస్తున్నారు. సంగీత విద్యలో చక్కని కృషిచేసిన అనుభవజ్ఞులు, హైదరాబాదు ఆకాశవాణి నిలయ విద్వాంసులు అయిన మంచాల జగన్నాథరావుగారు స్వర సంకలితంగా రాగతాళాత్మక కావ్యంగా ప్రచురించారు.

వాఙ్మయ మహాధ్యక్ష, కళాప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు (ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌ల జాయింట్‌డైరెక్టర్) దీనికి తొలిపలుకు వ్రాస్తూ, పెక్కు విషయాలను తెలియజేశారు. యక్షగాన కావ్యాలు సంస్కృత భాషలో క్రీ. శ. 11 శతాబ్దినాటికే వెలువడ్డాయనీ, తెలుగులోని యక్షగానాలకు సంస్కృత యక్షగాన వాఙ్మయమే మూలమై ఉండుననీ, జయదేవకవికృతి గీత గోవిందం యక్షగానమే అని గ్రహించవలసి యున్నదనీ వివరించారు. దీనికి 'గీత గోవిందం' అనే పేరు సరి కాదనీ, రాధామాధవ శృంగార వర్ణనాత్మకమై ఉన్నందువల్ల 'శ్రీ గీత గోవింద'మనే చెప్పవలసి యున్నదనీ, గ్రంథకర్తనామం కూడా 'శ్రీ జయదేవు'డనీ, కొన్ని చోట్ల మాత్రం సంగ్రహంగా 'జయదేవ' నామం కానవస్తున్నదనీ తెలియజేశారు. ఈ 'తొలి పలుకూ' గ్రంథానికి మెరుగుపెడుతున్నది.

గీత గోవిందం ఎందరి చేతనో, ఎన్నోసార్లు సవ్యాఖ్యానంగానూ, వ్యాఖ్యాన రహితంగానూ, సాంప్రదాయవాదంగానూ, నిరనువాదంగానూ ప్రకటించబడింది. దానికి స్వరనిర్ణయం చేసి, రాగతాళయుక్తంగా చూపడమే సంపాదకుని కృత్యం. ఇందు గ్రంథ ముద్రణ ఏమాత్రమూ శ్రద్ధగా జరగలేదు. తప్పులు లేని శ్లోకంగాని, అష్టపదిగాని కానరావడం దుర్లభం. దానికి తోడు పదానికీ, పదానికీ మధ్య ఉండవలసిన స్పేసింగు (విరామం) సరిగా లేక 'రామునితోక పివరుం డిట్లనియె' అనే రీతినే ఉన్నందువల్ల, అర్థావగతి సులభంగా కాకున్నది. ఉదాహరణలను చూపాలంటే ఎన్నో పుటలు వ్రాయవలసి ఉంటుంది. మచ్చునకు తొలి సర్గలోవే కొన్ని చూపబడుతున్నవి.

గ్రంథాదినున్న శ్లోకమే తప్పులతో నిండి ఉన్నది—

'మేఘై ర్మేదుర మంబరం వన భువ
శ్శ్యామా స్తమాలద్రుమైః
నక్తం భీరురయం త్వమేవ
తదిమంరాధే గృహప్రాపయః,

ఇత్థం నందనిదేశ తశ్చలితయోః
ప్రత్యర్థ కుంజద్రుమం
రాధా మాధవయోర్జయంతి
యమునా కూలే రహః కేలయః'

పై శ్లోకం తప్పులతోనూ, తప్పు స్పేసులతోనూ ఉన్నది. అది ఉండవలసిన రీతి యిది—

'మేఘై ర్మేదుర మంబరం
వనభువః శ్యామాస్తమాలద్రుమై ః
నక్తం భీరు రయం త్వమేవ
తదిమం రాధే గృహం ప్రాపయ,
ఇత్థం నందనిదేశత శ్చలితయోః
ప్రత్యధ్వకుంజద్రుమం
రాధామాధవయో ర్జయంతి
యమునాకూలే రహఃకేలయః'

'రాధే' అనుటకు 'రాథే' అనుట తప్పు. 'గృహం ప్రాపయ' అంటే ఇంటికి తీసికొనిపో—అని అభిప్రాయం. 'గృహప్రాపయః' అంటే అర్థం లేదు. అధ్వమంటే మార్గం. 'ప్రత్యధ్వ కుంజద్రుమం'కు బదులు 'ప్రత్యర్థ కుంజద్రుమం' అంటే అర్థమేమిటో? ఇవి పదాల తప్పులు. స్పేసింగు ఎలా ఉండవలసినదీ పైని చూపబడియే ఉన్నది.

మొదటి పుటలోనే రెండవ శ్లోకం మొదటి పాదం—

'వాగ్దేవతా చరిత చిత్రిత పాదపద్మా' అని వుంది. ఇది కర్తయైన జయదేవునికి విశేషణం. 'వాగ్దేవతా—చిత్తసద్మా' అని ఉండాలి. అప్పుడే సరియైన అర్థం వస్తుంది.

మొదటి పుటలోనే నాల్గవ శ్లోకం మూడవ పాదం చివరా, నాల్గవ పాదం మొదటా కలిపి 'గోవర్ధనః స్పర్ధికోపి' అని ఉన్నది. మధ్యమున్న విసర్గం సరి కాదు. 'గోవర్ధనస్పర్ధి' అనేది ఏకపదం. విసర్గ పెడితే అర్థం కుదరనే కుదరదు.

మొదటి పుటలోనే తొలి అష్టపది—2 వ పంక్తి—'విహిత విహ్విత చరిత్ర మఖేదం'—ఇక్కడ 'విహ్విత'కు బదులుగా 'వహిత్ర' ఉండవలెను. 4 వ పంక్తిలో 'తవ లితిష్మతి'కి బదులు 'తవ తిష్మతి' అని ఉండాలి.

5-వ పేజీలో అఠాణీ రాగంలో పాడవలసిన శ్లోకం రెండవ పాదంలో 'ఉద్గీర్ణ'కు బదులు 'ఉద్గిర' అనీ, 3-వ పాదంలో 'పథికైః'కి మారుగా 'పతికైః' అనీ, 4-వ పాద- చివర 'వానరాః'కు బదులు 'వానరః' అనిన్నీ పడినది.

వీటినిబట్టే తక్కిన సర్గల్లోనూ ఊహించుకో వచ్చును.

## (2) గీత శంకరము

గీత గోవిందపు పద్ధతిలోనే పార్వతీ పరమేశ్వరుల ప్రణయ వృత్తాంతం 'గీత శంకరం' అనే గేయ కావ్యంగా రచించబడింది. 17-వ శతాబ్దిలో ఉండవచ్చునని ఊహించబడుతున్న 'పంచరత్నకవి' బిరుదాంచితుడైన 'అనంతనారాయణ కవి' దీనికి కర్త. ఇది ఇంతవరకూ అముద్రితం. దీని వ్రాతప్రతులు తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో ఉన్నవి. వాటి ననుసరించి జగన్నాథరావుగారు ప్రతిని వ్రాయించి, రాగతాళ యుక్తంగా, స్వరబద్ధంగా 'ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ, రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ల' మూలంగా ప్రచురింపజేశారు. అముద్రితంగా ఉండిన గ్రంథాన్ని వెలుగులోనికి తెచ్చినందుకు వయి వంన్ద వారికి ధన్యవాదాలు సమర్పించవలసినదే కాని, ఇందులోనూ గీతగోవిందంలో ఉన్నట్లే ముద్రణ స్ఖాలిత్యాలు అత్యధికంగా ఉన్నవి.

51-వ పుటనుంచి 'గీత శంకరం' ప్రారంభమయింది. గ్రంథాదినే—శ్లోక ప్రారంభంలోనే—

'ప్రారిప్సితస్య గ్రంథస్య నిర్విఘ్నేన సమాప్తయే' అను చోట 'ప్రారిరిప్సితస్య' అని ముద్రితమైఉన్నది.

ఆ పేజీలోనే మొదటి అష్ట పది చివరిపంక్తిలో 'జలధా' అనుటకు 'జలధే' అని ఉన్నది.

52-వ పేజీ 12-వ లైనులో 'కమల భవం తేవ పదకమల కవిత—' అంటే అర్థమేమో?

ఆ పేజీలోనే చివర రెండు శ్లోకాలున్నవి. మొదటి శ్లోకం ఉత్తరార్ధంలో 'మదన ప్రాదుర్భావః' అనుటకు 'మదనః ప్రాదుర్భావః' అనడం సరికాదు. రెండవ శ్లోకం పూర్వార్థంలో 'ఆకలయ్య'కు బదులు 'ఆకల్య' అని పడింది. ఇది సరికాదు.

54—వ పుట శ్లోకం ప్రారంభంలో 'శుశ్రూషయా'కు బదులు 'శుశ్రూషా' అని ఉండడంవల్ల అర్థంతోపాటు ఛందస్సూ చెడిపోయింది.

55—వ పుటలోని అష్టపది చివరి పంక్తిలో 'శమయతు'కు మారుగా 'శ్రమయతు' ఉండి, అర్థాన్ని పాడు చేసింది.

ఇట్టి వాటిని ఎన్నింటినైనా చూపవచ్చును. అచ్చు తప్పులతోపాటు విరామదోషాలూ చాలా ఉన్నవి.

సంపాదకులు జగన్నాథరావుగారు తమ 'ఉపోద్ఘాతము'లో 'సంస్కృతమున—'రామ-రమ' యను పదములకు అర్థములో నెంత భేద మున్నదో, ఒక నడకలోగల సాహిత్యమును వేఱొక నడకగల తాళముతో పాడినచో నంతటి యర్థభేదము వచ్చి సొగసు చెడి సంగీతార్థము మాసిపోవును' అని వ్రాసియున్నారు. అట్టి స్థితిలో అసలే అర్థము కానట్లు చేసే తప్పులతో గ్రంథం ఉన్నప్పుడు దానివల్ల కలిగే ప్రయోజనం ఎట్టిదో ఊహించవచ్చును. సంపాదకులు ఈ గ్రంథాన్ని తగిన రీతిని పరిష్కరింపజేసి, ప్రకటిస్తే ఎంతో ఉపయోగం ఉండేది. ముద్రణ బాగున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. దానికి తగినట్లు గ్రంథం కూడా నిర్దుష్టంగా ఉండాలి. వ్యయ ప్రయాసలతో అందంగా ముద్రించబడిన ఈ గ్రంథద్వయ సంపుటి తప్పులతో నిండియుండడం రిసెర్చి ఇన్‌స్టిట్యూటువారి పరిశోధనకే కళంకదాయకం కాగలదు. ఈ సంస్థవారు ఇకనైనా, తాము ప్రకటించే గ్రంథాల విషయంలో తగిన శ్రద్ధ తీసికోగలరని ఆశిస్తున్నాను.

## భక్తితత్త్వ దర్శనము

(శాండిల్య, నారద మహర్షుల మూలసూత్రములకు ఆంధ్రానువాద వివరణములతోసహా శ్రీ చర్ల గణపతిశాస్త్రి రచన. క్రౌను 82 పుటలు. వెల రూ. 1—50. ప్రతులకు శ్రీ చర్ల గణపతిశాస్త్రి, లలితా ప్రెస్, ఖైరతాబాద్, హైదరాబాదు—4.)

ప్రాచీనులైన మన మహర్షులు సర్వోపయోగార్థం మన దర్శనాలను తొలుత సూత్రప్రాయంగా రచించారు. తర్వాత తర్వాత వాటి వాటికి విపులమైన వ్యాఖ్యానాలూ, భాష్యాలూ వెలువడసాగాయి. ఇవన్నీ సంస్కృత భాషలోనే ఉండడంవల్ల జిజ్ఞాసువుల కందరికీ అందుబాటులో లేక పరిమిత ప్రయోజనం కలిగియే ఉంటున్నవి. సంస్కృతాంధ్రాలలో సమర్థులూ, ఆయా దర్శనాలను చక్కగా అవగాహన చేసుకుని తత్త్వాన్ని గ్రహించిన వారూ అయిన విద్వాంసులు జనసామాన్యపుటుపయోగార్థం ఆంధ్రానువాద, వివరణాలతో ప్రకటించడం జరుగుతున్నది. అట్టి విద్వాంసులలో సుప్రసిద్ధులు గణపతిశాస్త్రిగారొకరు. వివిధ దర్శనాలలో గట్టి పరిశ్రమ చేసి, ఎన్నో గ్రంథాలను రచించి, ప్రకటిస్తున్న శ్రీ శాస్త్రిగారు ఆర్షవిజ్ఞానాభివృద్ధికై బహుముఖాల పాటుపడుతున్నారు. ఇందుకోసం 'ఆర్షవిజ్ఞాన పరిషత్తు'ను స్థాపించడం ఆయన ఉదారాశయాలకు తార్కాణ.

ముక్తిని పొందడానికి ముఖ్యమైన మార్గాలు

భక్తి, జ్ఞాన, కర్మములు ప్రసిద్ధాలు, ఆయా మార్గాలను అనుసరించేవారు ఇతర మార్గాలకంటె తమ మార్గమే మేలైనదని భావిస్తారు. ఇది సహజం. అయినా వీటిలో భక్తిమార్గం మిగిలిన వాటికంటె సులభమయిందని చాలామంది అభిప్రాయం. ఆ భక్తి తత్వాన్ని గురించిన విషయాలు ఈ చిన్న పుస్తకంలో వివరించబడి ఉన్నవి. దీని మూలసూత్రాలు శాండిల్య, నారద మహర్షులు రచించినవి. వాటికి ఆంధ్రాను వాదం, తెలుగు వివరణం గణపతి శాస్త్రిగారు రచించి నవి చేర్చబడి ఉన్నవి. సందర్భానుసారంగా పోతనగారి భాగవతంలోని పద్యాలూ, శ్రీ శాస్త్రిగారి రచన అయిన ఉపనిషత్సుధ, తెలుఁగుగీత, శ్రీ కృష్ణ హృదయామృత ములలోని పద్యాలు, యోగసూత్రానువాద భాగాలూ ఉదాహరించబడి ఉన్నవి. గ్రంథం మొత్తంవిూద—కర్మ, జ్ఞానాలు భక్తిమార్గానికి అంగములనీ, భక్తిమార్గమే ఉత్తమమయినదనీ సప్రమాణంగా చూపబడి ఉన్నది.

ఈ చిన్న గ్రంథంలో పది ప్రకరణా లున్నవి. మొదటి ప్రకరణంలో భక్తితత్వానికి అవతారికా రూపమైన భూమిక వివరించబడింది. రెండవ ప్రకరణంలో భక్తిని గురించిన వివరణ ఉన్నది. మూడవ ప్రకరణంలో భక్తి లక్షణాలూ, నాలుగవదానిలో భక్తి సాధనాలూ తెలుపబడినవి. అయిదవ ప్రకరణంలో భక్తికి పరమేశ్వరుడు ఆశ్రయమని వివరించబడింది. ఆరవ ప్రకరణంలో శ్రీకృష్ణుడు భగవంతుడనీ, ఏడవ ప్రకరణంలో దుస్సంగ త్యాగాది సాధనములను గురించిన్నీ ఉన్నది.

ఎనిమిదవ ప్రకరణంలో ప్రేమ స్వరూపం వివరించబడింది. ఇందులో—తమ సర్వస్వాన్నీ భగవంతునికి అర్పించిన భక్తుల చరిత్రలు చాలా విచిత్రంగా ఉంటాయంటూ—దానికి ఉదాహరణగా రామదాసు చరిత్ర ఇవ్వబడింది. సందర్భానుసారంగా రామదాసు చరిత్రలోని పద్యాలూ, గేయాలూ ఉదాహరించబడినవి. భగవంతుని విషయంలో జరుగకూడని అపరాధాల వివరణ కూడా ఈ ప్రకరణంలోనే ఉన్నది.

ప్రేమ స్వరూపం అనిర్వచనీయమైనదని తొమ్మిదవ ప్రకరణం తెలియజేస్తున్నది. భక్తుడైనవాడు ఎప్పుడూ వాద వివాదాలలో ప్రవేశించకూడదని చివరి ప్రకరణంలో చెప్పబడింది. భక్తి ప్రాప్తికయి ఎట్టి కర్మలు చెయ్యవలసినదీ కూడా ఈ ప్రకరణం వివరిస్తూ ఉన్నది.

శ్రీ శాస్త్రిగారు మూలసూత్రాలకు వ్రాసిన వివరణ సామాన్య పాఠకులకు సుబోధంగా ఉన్నది. ఒక్క ఉదాహరణ—

'సూ. బ్రహ్మకాండం తు భక్తౌ తస్యానుజ్ఞానాయ
సామాన్యాత్' (శా. 26)

'శ్రుతిలోఁ జెప్పఁబడిన బ్రహ్మకాండము భక్తి విషయమైనది. బ్రహ్మకాండము అజ్ఞాత విషయమును దెలుపునట్లే మిగిలిన రెండు కాండములు అజ్ఞాత విషయమునే తెలుపుటలో సమానమెగాని, అవి జ్ఞానమునే తెలుపుచున్నవని కాదు.'

'అంతమాత్రముచేతనే దానిని జ్ఞానకాండమని యన్నచో, ధర్మజ్ఞానమును గలిగించు ధర్మకాండమునుగూడ జ్ఞానకాండమని యనవలసి వచ్చును. భక్తిని దెలుపుటకై ఆరంభింపఁ బడుటచే బ్రహ్మజ్ఞానమును భక్తికాండమనియె యనవలయునని భావము. (పుట. 18)

భక్తితత్వాన్ని తెలుసుకొనగోరువారు దీనిని చదివితే అందలి ముఖ్యాంశాలను సులభంగా గ్రహించవచ్చును.

"ఆంగీరస"

## ధనమూల మిదం జగత్

(న వ ల)

(రచన—రంగధామ్, పబ్లిషర్సు : యం. శేషాచలం అండ్ కో మచిలీపట్నం—మద్రాసు—సికింద్రాబాద్. పేజీలు 200 ఖరీదు : రు. 2–50.)

'డబ్బు అంటే ఏమిటి? మనిషికి కావలిసిన వస్తువుని సమకూర్చిపెట్టే శక్తిగల ఒక దినుసు. అలాగే మనిషికి కావలిసిన సుఖాన్ని, అందులోనూ

డబ్బు ఇవ్వలేనిదాన్ని ఇవ్వగల శక్తి ఈ సాధువుల్లో ఉందని ప్రజల నమ్మకం. సామాన్య మానవుడు డబ్బుకోసం ఆపసోపాలు పడుతూంటే డబ్బు గలవాడు డబ్బు తెచ్చే సుఖాలు అనుభవిస్తూ, తృప్తిలేక అది కాక మానవుడు పొందగలిగిన సుఖమేదో ఉందని ఈ సాధువుల్ని పట్టుకు పాకులాడుతున్నాడు.'

శ్రీ రంగనాథమ్‌గారు కథలు వ్రాసారు. శ్రీదేవి నవలకు ప్రైజు వచ్చింది. కథల్లో ఉండే గమనం వీరు వ్రాసిన 'ధనమూల మిదం జగత్' అనే నవలలో కాన్పించదు. ఈ నవల నిండా ఫ్యాక్టరీ మేనేజర్లు, క్లర్కులు, కార్మికులు మున్నగువారి విషయాలు చెప్ప బడ్డాయి. కథకు ప్రాధాన్యం లేదు.

శర్మ, సేట్ రామదాస్ బిరానీతో ప్రారంభ మైన కథలో లాకౌటులు, యూనియన్‌లు, సమ్మెలు కాన్పిస్తాయి.

సేట్‌గారు బిరానీ ఎంటర్ ప్రైసెస్ అనే కంపెనీ ప్రారంభించారు. ప్రారంభంలో అందరి మీద దయను ప్రదర్శిస్తూ ఉండేవాడు. కంపెనీకి లాభాలు రావటం, మేనేజర్లు మారటంచేత కంపెనీలో పని చేసే కార్మికులపైన దృష్టి సన్నగిల్లింది. దానితో కార్మికుల్లో అసంతృప్తి ప్రబలింది. మేనేజర్ల జులుం ఎక్కువయ్యింది. మేనేజర్లు కార్మికులతో చెలగాటా లాడారు. కార్మికుల వత్తిడికి కొందరు మేనేజర్లు తట్టుకొన్నారు. మరికొందరు తట్టుకొనలేకపోయారు. ఫ్యాక్టరీ స్థాపకులకు ధనదాహమే గాని కార్మిక సంక్షే మాన్ని గూర్చి ఆలోచన లేదు. ధనం ఉన్నప్పుడు పూర్వ జీవితం గుర్తుకు రాదు. కాని ఒకసారి గత జీవితం స్మృతికి తెచ్చుకొంటే పడిన బాధలు, అనుభ వించిన సంతోషాలు గుర్తుకు వస్తాయి. బిరానీ తన జీవితాన్ని ఆలోచించుకొన్నాడు. ప్రయోజనం నాస్తి. తానొక క్రియాశూన్యుడై పోయాడు.

కథలో కథగా శర్మ జీవితాన్ని రచయిత తీర్చారు. అన్నీ ఉన్నా అల్లుడి నోట్లో శని అన్నట్లు అతనికేదీ కలసిరాలేదు క్లర్కు ఉద్యోగం తప్ప. అతడు రాగిణి, లక్ష్మి—లతను ప్రేమించాడు. ఆ ప్రేమ ఫలించలేదు. ఆయా స్త్రీల జీవితాలను చక్క దిద్దాలని ప్రయత్నించాడు. ధైర్యంచేసి ఏ పనీ చేయ లేకపోవటంచేత అతని ప్రయత్నాలేవియు కలసిరాలేదు. దానికి కారణం సమాజమంటే విపరీతమగు భయమే ప్రధానం. చివరికేమీ మిగలలేదు అతని జీవితంలో ఒక్క విరహవేదన మినహా. లక్ష్యం లేదు అతని మార్గాల్లో. రచయిత అతనిని ఒక కీలుబొమ్మగా చేసి నవలలో చూపించారు.

కేవలం రచయిత శర్మ జీవితాన్ని ఆధారం చేసికొని కథను నడిపిస్తే నవల చదవటానికి ఆసక్తిగా ఉండేది. రచనలో రెండు గాథలు కాన్పిస్తాయి. ఒక గాథ బిరానీ ఎంటర్‌ప్రైసెస్‌ది. మరొకటి శర్మలో ప్రియురాండ్రపైన కల్గిన మనోభావాలు. ఈ రెండు గాథలకు మధ్య సన్నిహితమగు సంబంధం గోచరించదు.

పాత్రలలో నారాయణ పాత్ర నియంత లాంటిది. అయితే ఈ పాత్ర కథకు అనుగుణంగానే ఉన్నది. అతడు చేసిన మోసాలకు కార్మికుల జీవితాలు బలియై పోవటం సహజంగా ఉన్నది. కార్మికుల పొట్టలు గొట్టి కంపెనీకి లాభాలు తెచ్చే మేనేజర్లు అంటే కంపెనీ యజమానుల కిష్టం. మేనేజరుగా వచ్చిన త్రినాధరావు కార్మికుల జీవితాలను నాశనం చేసాడు. అయితే అతనివల్ల కంపెనీకి లాభం వచ్చింది. చివర కతడు సెలవుపెట్టి కంపెనీనుంచి వెళ్లిపోయాడు.

బుచ్చిరాజు పాత్ర తమాషాగానే ఉన్నది. కాని ఫ్యాక్టరీలో ఒక కార్మికునిగా అతడు తన పనులను సక్రమంగా నిర్వర్తించలేదు. పని తప్పించుకొని కబు ర్లాడటమే అతడు చేసే పని. బ్రతకనేర్చినవాడు గనుక ఫ్యాక్టరీనే అంటిపెట్టుకొని ఉండగల్గాడు.

కథలో సాధువుని చిత్రించారు. ఫ్యాక్టరీ విష యాలు వర్ణించే నవలలో సాధువు పాత్ర కథకు వికారంగా తయారయ్యింది. నవలలో చాల పాత్రలు వచ్చాయి. ఆయా పాత్రలు మఖలో పుట్టి పుబ్బలో మాయమయ్యాయి. వాని ప్రాధాన్యం నవలలో ఏమీలేదు.

రచయిత నవలకు తగిన ప్లాట్ ఎన్నుకొన్నను ఆ ప్లాట్‌కు తగిన న్యాయం చేకూర్చక విసుగుపుట్టించే విషయాలు కొల్లలుగా వివరించారు. చేయి తిరిగిన రచయిత అయినను తమ లక్ష్యాన్ని నవలలో స్పష్టం చేయకుండా కథను గాలిలో వదలివేసారు. మలి ప్రయత్నంలో నుంచి నవల వ్రాయగలరని ఆశించవచ్చును.

ఎమెస్కో సంస్థ పుస్తక ప్రచురణలో అరిష్టాలను అధిగమించినప్పటికి కొన్ని విషయాలను గమనిస్తున్నట్లు లేదు. ఎందుచేతనంటే ఈ నవలలో అచ్చు తప్పులను సరిదిద్దకపోవటమే. ఉదాహరణకు ఆధ్రదేశవు, ఎటర్, చెయ్యడానిరి, ప్రయొజకత్వం, పాకరీ, మిలు, వనకు, చుట్టుప్రక్కల, తలూరు, ఆచారిగాచారు, నట్టూర్చి, పారీ మొదలగు అచ్చు తప్పులున్నాయి. కనీసం పునర్ముద్రణలో అయినా వీనిని సరిదిద్దితే బాగుండు ననిపిస్తుంది.

## మ ని షి — మ చ్చ
### (న వ ల)

(రచన—వి. వి. యస్. రామదాసు ప్రచురణ: యం. శేషాచలం అండ్ కో మచిలీపట్నం—మద్రాసు—సికింద్రాబాద్. వెల. 2-50 పేజీలు 168.)

మనిషి—మచ్చ అనే నవల కేవలం కాలక్షేపానికే గాక ఆలోచన అనుభూతి కలిగించే రచన.

మనుష్యుల శరీరాలపై కొన్ని మచ్చ లేర్పడుతాయి. అవి బాహిరంగా కాన్పించేవి. అంతర్గతంగా కొన్ని మచ్చ లుంటాయి. అవి మాత్రం పైకి కాన్పింపవు. 'ఒకే రకమైన సంఘటనల్లో సన్యాసయ్య ముఖం అందవికారమయ్యింది. వెంకటరావు మనసుకి నిరంతరం బాధించే గాయం తగిలింది. సన్యాసయ్య ముఖం మీదిది కనిపించే మచ్చ. వెంకటరావు మనసులోనిది కనిపించని మచ్చ.'

పట్టెడు కూడు, డబ్బు సంపాదించ లేని సంసారం ఒకటి రాజమండ్రిలో ఉన్నది. ఆ సంసారానికి యజమాని ధర్మారావు, అతని భార్య సావిత్రి. వీరి కొక వెంకట్రావనే కుమారుడు. ధర్మారావు తాపీమేస్త్రి. కష్టపడి సంపాదించిన దానితో తన చెల్లెలను ప్రభంజనరావుకు యిచ్చి వివాహం చేసాడు. ధర్మారావు—సావిత్రి ఆశామోహాలకు అమడ దూరంలో ఉంటారు. సుభద్ర—ప్రభంజనరావు గాలిమేడలు కట్టుకొని కన్న కూతురుపైన ఆశ పెట్టుకొన్నారు.

ధర్మారావుకు త్రాగుడే పరమార్థం. వెంకట్రావు సంపాదించుకొన్న గోల్డుమెడలుకొరకు తండ్రి తాపత్రయ పడ్డాడు. దానిని జూదంలో పెట్టాలని ధర్మారావు పెనుగులాడాడు. భార్య సావిత్రి అడ్డుపడింది. వారి పెనుగులాట చూచి వెంకట్రావు తండ్రి పైకి తాపీ విసిరాడు. దానితో అతడు కన్ను మూసాడు. సావిత్రి ప్రాణాలు వదిలింది. ఆ దృశ్యాన్ని చూచి న్యాయస్థానం నిర్ణయించింది వెంకట్రావు నిర్దోషి అని. అదే వెంకట్రావులో కనిపించని మచ్చ అయింది.

సుభద్ర—ప్రభంజనరావు దంపతులకు వాసంతి జన్మించింది. స్వేచ్ఛా వాయువులు పీల్చుకొన్నది. సమాజ కట్టుబాట్లకు అతీత మయ్యింది. చరిత్ర హీనురా లయ్యింది. జీవితంలో దగాపడి యిల్లు వదలి పారిపోయింది. అది ఆమెలో కనిపించే మచ్చ అయ్యింది.

ఈ నవలలో ప్రధాన పాత్రలు సావిత్రి—ధర్మారావు, సుభద్ర—ప్రభంజనరావు, వెంకట్రావు—వాసంతి. ఈ పాత్రలు విచిత్ర మనస్తత్వం కల్గినవి.

సావిత్రికి భర్త అంటే పంచప్రాణాలు. పదిండ్లలో పనిచేసి వారు పెట్టిన ఎంగిలికూడు తెచ్చి త్రాగుబోతు భర్తకు పెట్టింది. ఆమెలో ఓర్పు ఉన్నది. ఆ ఓర్పు వల్లనే ధర్మారావు పని మాని జూదంలో పడ్డాడు. అతన్ని నిరోధింపలేదు. కాని అతడే విశ్వాసఘాతకుడై ఆమెను బాధించాడు. ఓర్చుకొన్నది. కాని ప్రయోజనం లేకపోయింది. కొడుకు సంపాదించిన గోల్డుమెడల్ తీసుకొని పోబోతూంటే భర్తకు అడ్డువచ్చింది. ఆమెను ఆవలకు నెట్టాడు. పెనుగులాడింది. కన్ను మూసింది. త్రాగుబోతు ఈ లోకంతో నిమిత్తం లేకుండా బ్రతుకు సాగించాడు.

తనను తాము పరిశీలించుకొనలేని దౌర్భాగ్యుడు. కన్నకొడుకు చేతిలోనే మరణం పొందాడు.

సుభద్ర కరుణకు మరోపేరు. ఆమెలో ఆస్తి అంతస్థుల తరతమాలు లేవు. ఆమె భర్త యీమె గుణాలకు వ్యతిరేకం. అసిస్టెంటు ఇంజనీరనే గర్వం ఉన్నది. ఆ గర్వమే తన కుమార్తె శీలాన్ని చెడగొట్టి యింటినుంచి పంపించింది. ధర్మారావు కొడుకు వెంకట్రావు పేదర్లు యింటింటి కందించి చదువు కొంటూ ఉంటే ఛీ అని చీదరించుకొన్నాడు. నిజంగా ప్రభంజనరావుకు ధర్మారావుకు పెద్ద భేదం లేదు. ధర్మారావు నాటుసారా చాటుమాటుగా త్రాగితే, ప్రభంజనరావు హైక్లాసు బ్రాంది పబ్లిక్‌గా త్రాగే వాడు. అతడు ఏకపత్నీవ్రతుడు. ఇతడు బహుపత్నీ వ్రతుడు. మనసు, మాట విషపూరితం. ధన దాహ మెక్కువ. డబ్బుకు యిచ్చిన విలువ వ్యక్తికి యివ్వలేని హోదా మనిషి. చివరకు యీ హోదా ఈ లోకా న్నుంచి అతన్ని పంపించింది.

వెంకట్రావు ఏమీ తెలియని అమాయకుడు. చదువుమీద ఉన్న ఆసక్తి తప్ప యితర దురభ్యాసాలు లేవు. కష్టపడితే ఏదైనా సాధింపగలమనే ధైర్యం కలవాడు కనుకనే మేనేజింగ్ డైరెక్టరయ్యాడు. పశ్చాత్తాపమే అతన్ని మాటి మాటికి క్రుంగదీసింది. మంచిని ప్రేమించాడు. స్వరూప స్వభావాన్ని బాగుగా ఎరిగినవాడవటంవల్ల వాసంతి చెడిపోయినదని తెలిసినా ఆమెనే వివాహమాడవలెనని నిశ్చయించుకొన్నాడు. ఆత్మవిశ్వాస మెక్కువ.

వాసంతి లోకం పోకడ గ్రహింపలేనిది. తల్లి దండ్రు లిచ్చిన స్వేచ్ఛకు విపరీతార్థాలు కల్పించుకొని జీవితంలో మోసపడింది. తనకేర్పడిన మచ్చను మాపుకొన లేక సతమతమై ఒక స్థిరమైన అభిప్రాయాన్ని నిర్ణ యించుకొనలేకపోయినా వెంకట్రావంటే ఆమెలో చివరకు సిగ్గు, దొంతరులు ముంచుకు వచ్చాయి. వెంకట్రావు లేమిలోనుంచి పైకి వచ్చాడు గనుక అన్నీ తెలుసు కాని వాసంతి కలిమిలో పుట్టి పెరగటంచేత కష్టసుఖాల సంగతి వెంటనే గ్రహింపలేక జీవితంలో పోరాటం సాగించిన తరువాత వాటి అర్థాలు గ్రహించ టానికి ప్రయత్నించినను అడుగు ముందుకు వేయలేని అభాగ్యురాలు.

రచయిత కథను కమ్మగానే చెప్పారు. కథ మధ్యలో సంస్కరణ చూపించాలని ప్రయత్నించి విఫలు లయ్యారు. అందవికారమైన సన్యాసయ్యచేత సర్వాంగ వికృత స్వరూపవరాలైన వి. టి. సుందరి (వయ్యారి త్రిపురసుందరి) మెడలో తాళి కట్టించకపోవటమే విఫలమగుట. ఆ విధంగా చేయకపోవటంచేత ఆ పాత్రల ప్రాధాన్యం నవలలో కాన్పించలేదు. అంతేగాక ఆ పాత్రలను ప్రవేశపెట్టకపోయినప్పటికి కథాకథనానికి యిబ్బంది లేదు.

కథలో అక్కడక్కడ అసహజ ఘటనలు ఉన్నాయి.

తండ్రిపై యోగ్యుడగు కుమారుడు తాపీ విసరి మరణానికి కారణభూతుడని చెప్పటవల్ల వెంకట్రావు పాత్రపైన సానుభూతి కలుగదు.

ప్రభంజనరావు ముద్దులపట్టి జీవిత వైభవాన్ని గమనించకుండా పూర్తి స్వేచ్ఛ యిచ్చి గుడ్డు అప్పగించి చూడటం.

వాసంతి శీలం పోగొట్టుకొన్నది. తరువాత యిల్లు వదలి పారిపోయింది. తల్లిదండ్రులకు దూర మైన తరువాత కన్నతండ్రి కుమార్తెకొరకు అన్వే షింపకపోవుట, మొదలైనవి ఉన్నాయి.

రామదాసుగారు కథను సాఫీగా నడిపించారు. ఈ రోజుల్లో వచ్చే నవలల్లో కాన్పించే అతుకులు యిందులో లేవు. నవలకు మనిషి — మచ్చ అనే దాని కంటే మరో పేరు పెడితే బాగుండు ననిపిస్తుంది.

—శ్రీ రామమోహన్

## అమాయకుడి అగచాట్లు

(నవల)

(రచయిత: శ్రీ నండూరి సుబ్బారావు. పేజీలు 198; వెల: రు. 2–50 లు. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు; రాష్ట్రపతి రోడ్డు; సికిందరాబాద్.)

శంకరం అనే ఒక అమాయకుని జీవితం చుట్టూ అల్లిన కథ ఈ నవలలోని ఇతివృత్తం. ఆస్తి, ఐశ్వర్యం అన్నీ ఉన్న వాడు శంకరం. ప్రపంచ జ్ఞానం ఏమాత్రం లేని అమాయకుడుగా జీవిస్తుంటాడు. తల్లి మరణించేటప్పుడు తన ఆస్తిని, ప్రాణంతో సమానంగా పెంచిన కొడుకుని తమ్ముడు సేతురామయ్య చేతిలో పెడుతుంది. ఆనాటి నుంచి సేతురామయ్య కుటుంబం అంతా శంకరం ఇంట్లోనే మకాం పెట్టారు. సేతురామయ్యకు మనిషికి ఉండవలసిన హృదయం ఉంది. కాని ఆ హృదయం తన భార్య అయిన నాంచారమ్మ గళంలో కూరుకు పోయింది. సేతురామయ్యకు రంగడు, నిర్మల, మీనాక్షి ముగ్గురు పిల్లలు. రంగడు, మీనాక్షి అదుపు ఆజ్ఞ లేకుండా జులాయిగా పెరిగిన సంతానం. శంకరంలో అమాయకతను ఎక్స్ప్లాయిట్ చేస్తూ సేతురామయ్య, నాంచారమ్మ, రంగడు, మీనాక్షి ఎవరి అవసరాలను వాళ్ళు తీర్చుకుంటూ ఉంటారు. జరుగుతున్న అన్యాయాన్ని చూసి ఏమీ చెయ్యలేని అసహాయస్థితిలో దుఃఖిస్తుంది నిర్మల. శంకరం ఇంట్లోంచి పారిపోతాడు. పద్మతో పరిచయ మవుతుంది. మీనాక్షి సంగీతం మాష్టారుతో సినిమా పిచ్చిలో పడి లేచిపోతుంది. రంగడు పట్టణంలో ఎమ్యూజుమెంటు క్లబ్బు పెట్టి దాంతోపాటు దొంగనోట వ్యాపారం కూడా సాగిస్తాడు; తన మార్గానికి అడ్డం గావచ్చిన ఎవరినైనా సరే నిర్దాక్షిణ్యంగా అంతమొందించడం రంగడికి సునాయాసంగా అబ్బిన విద్య. లేచిపోయిన మీనాక్షి షణ్ముగం చేతిలో దారుణంగా మోసగింపబడుతుంది. లేవదీసుకు వచ్చిన సంగీతం మాష్టారు మీనాక్షిని కక్షతో హత్య చేస్తాడు. విటుడుగా తన చెల్లెల్ని మొదటిసారి చూసిన రంగడు ఆమె జీవితాన్ని మార్చుద్దామని చేసే ప్రయత్నం సఫలం కాకుండానే మీనాక్షి కన్ను మూస్తుంది. ఈ ఈ చావుతో రంగడిలో మార్పు ప్రారంభమవుతుంది నిర్మలకు వివాహం ఖాయం చేస్తాడు. ప్రెసిడెంటు పావకాల నాయుణ్ణి హత్య చేసింది రంగడేననే నిజం బయటపడుతుంది. రంగణ్ణి పోలీసులు పట్టుకుబోయేంతలో పారిపోతూ తుపాకి దెబ్బతో నేల కూలుతాడు. నిర్మల, ఆమె భర్త కలుస్తాడు. పద్మకి చిన్నప్పుడే వైధవ్యం ప్రాప్తించినా శంకరం మీద తన కెలాంటి అభిప్రాయం ఉందో తనకే తెలియక తికమక పడుతుంది. చివరక్కు తనకు ఏది కావాలో తెలుసుకుని శంకరాన్ని చేబడుతుంది.

ఈ కథను నడపడంలో శ్రీ సుబ్బారావుగారు లబ్ధప్రతిష్ఠుడైన రచయితగా తన నైపుణ్యాన్ని ప్రదర్శించారు. నవల ప్రారంభంనుంచి చివరిదాకా చదివితే నవల చదివినట్లుగా కాక ఒక సినిమా చూసినట్లుగా ఉంటుంది. పిక్చరైజ్ చెయ్యడానికి వీలుగా నవలను రూపొందించడం ఈ నవలలోని టెక్నిక్.

## హం స గీ తి

### (న వ ల)

(బెంగాలీ మూలం: ధనంజయ బైరాగి, తెలుగు అనుసరణ: వేదాంతం సుబ్రమణ్యం, పేజీలు: 147; వెల: రు. 2—50 లు, ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్; రాష్ట్రపతిరోడ్డు; సికిందరాబాద్.)

ధనంజయ బైరాగి బెంగాలీలో సుప్రసిద్ధ నవలా రచయితనీ, నాటకకర్త అని వేదాంతం సుబ్రమణ్యంగారు ప్రారంభంలోనే చెప్పారు. ధనంజయ బైరాగి వాస్తవనామం తరుణ్‌రాయ్. శ్రీ రాయ్ ప్రస్తుతం కేంద్ర సంగీత నాటక అకాడమీలో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వ ప్రతినిధిగా ఉన్నట్లు ప్రచురణకర్తలు రాస్తున్నారు. 'హంసగీతి' అనే ఈ నవల మనస్తత్వ విశ్లేషణాత్మక నవలగా ప్రకాశకులు పేర్కొన్నారు.

దివాకర్, డాక్టర్ చౌదరి, మణిమాల అనే ముగ్గురు వ్యక్తులచుట్టూ పరిభ్రమించే కథ ఇది. దివాకర్, డాక్టర్ ప్రాణస్నేహితులు. దివాకర్ విచిత్ర మనస్తత్వం కలిగిన మనిషి. తను ఉండే ఇంటినంతటిని ఒక జంతు ప్రదర్శనశాలగా మారుస్తాడు. జంతువుల తత్వాన్ని పరిశోధించడమే ప్రధాన వృత్తిగా పెట్టుకుంటాడు. డాక్టర్ చౌదరివల్ల దివాకర్‌కి మణి

మాలతో పరిచయమవుతుంది. ఆ అమ్మాయి ఎక్కువ కాలం బ్రతకదనే నిజం కూడా డాక్టర్ దగ్గరే వింటాడు. అయినా మణిమాలను వివాహం చేసుకోవ డానికి సిద్ధపడతాడు. మణిమాలను ఉద్ధరిస్తానని, ప్రేమిస్తున్నానని ఇత్యాదులైన భ్రమలు దివాకర్‌కి లేవు. తన జంతుప్రదర్శనశాలలో అనేకరకాలైన పక్షుల్ని, జంతువుల్ని బంధించి వాటి దైనందిన చర్యల్ని ఎలా పరిశోధిస్తున్నాడో అలాగే మణిమాల మనస్తత్వాన్ని కూడా పరిశోధించాలనే విపరీత మాన సికత దివాకర్‌ను మణిమాలను పెళ్ళిచేసుకోవాలనే స్థితికి తీసుకుపోయింది.

మణిమాల మేనమామ జగన్నాథ్ తన స్వార్థంతో ఈ పెళ్ళిని ఆపడానికి ఎంత ప్రయత్నించినా దివాకర్‌తో ఆమె వివాహం అయిపోయింది. భిన్న మనస్తత్వాల సంఘర్షణ నవలలో ఇక్కణ్ణించే ప్రారంభమవుతుంది. మణిమాల సంపూర్ణమైన వైయక్తిక స్వాతంత్ర్యంతో పెరిగిన పిల్ల. అతి సమీ పంలోఉన్న మృత్యువును కూడా గుర్తించకుండా అమాయకంగా, హాయిగా తాను నవ్వుతూ, ఇతరులను నవ్విస్తూ, సునాయాసంగా జీవితాన్ని గడిపేస్తున్న మణిమాల మనస్తత్వానికి, తాను చదివింది చాలా ఎక్కువ అనుకుని, అంతకంటె ఎక్కువగా ఆలో చిస్తూ, తనకంటె అధికుడు లేడనే అంతర్గత అహంతో, పంజరాల్లో హృదయాలను బంధించి, వాటి ప్రవృత్తులను పరిశీలించాలనే రాక్షసవాంఛతో యంత్రాలకిచ్చే విలువనే జీవితానికి కూడా యిచ్చే దివాకర్ మనస్తత్వానికి మధ్య తీవ్రమైన ఘర్షణ వివాహానంతర నవలంతా ఆక్రమిస్తుంది.

తాను గొప్పవాడని, సాధారణ మనుషులకు, వాళ్ల తత్వాలకు తాను అతీతుడనే గర్వం దివాకర్ పాత్రలో అడుగడుగునా కనిపిస్తుంది. మణిమాలకు నాటక ప్రదర్శన సందర్భంగా మోహన్‌తో పరిచయ మవుతుంది. ఆ పరిచయాన్ని, స్నేహాన్ని దివాకర్ అర్థం చేసుకున్న తీరు అతను సామాన్య మానవుని కంటె అధోగతిలో ఉన్నాడని ఋజువు చేస్తుంది. మణిమాలకు మానసిక స్వస్థత లేకపోతే శారీరకమైన స్వస్థత కూడా ఉండదని తనకు తెలిసినా ఆమెను ప్రతి క్షణం తన మాటలతో, చేష్టలతో వేధిస్తాడు. ఫలితం మణిమాల మృత్యువుకు దగ్గరగా వస్తుంది. ఇంక కొద్ది క్షణాల్లో మాల మృత్యువుకి అంకితమై పోతుందనగా దివాకర్‌లో పశ్చాత్తాపం మొదలవు తుంది. ఏ అహంతో అయితే ఇంతకాలం తన్ను తను తెలుసుకోలేకపోయాడో ఆ అహం పూర్తిగా దిగిపోయిన పిమ్మట దివాకర్ మనిషిగా తన్ను తను గుర్తించుకో గలిగాడు. తనలో వచ్చిన మానసిక పరిణామాన్ని మాలకు చెప్పే లోపలే ఆమె మరణిస్తుంది. దివా కర్‌లో వచ్చిన ఈ మార్పు మాల జీవితాన్ని పరిగణన లోకి తీసుకుంటే వ్యర్థమనే చెప్పాలి. దివాకర్‌కి ఈ రకమైన విచిత్ర మనస్తత్వం అలవడటానికి కారణం వారి వంశ లక్షణాలు తండ్రినుంచి కొడుక్కి సంక్ర మించడమే. తండ్రి ఈ అహంకారంతోనే తన భార్యను మేడపైనుండి క్రిందికి త్రోసి చంపేశాడు. దివాకర్ అంత పనిచేయకపోయినా తన ప్రవర్తనతో మణిమాలను హత్య చేశాడు. మాల మరణంతో దివాకర్ కైపు దిగింది. అతనిలో పేరుకుపోయిన జంతు తత్వం దహిం చింది.

ఒక అనువాదం చదువుతున్నట్లుగా కాక ఒక స్వతంత్ర నవల చదువుతున్నట్లుగా ఉండటం వేదాంత సుబ్రమణ్యంగారి అనువాద ప్రతిభకు గీటురాయి. మూలంలోంచి ఇతివృత్తం తెలుగులోకి పరివర్తన

చెందడంలో శ్రీ వేదాంతం సుబ్రమణ్యంగారు అతి జాగ్రత్త వహించి ఉండకపోతే నవల ఈ విధంగా రూపొంది ఉండేదికాదు. ఎమ్. ఎన్. కో వారు మళ్లీ ఇన్నాళ్టికి ఒక ఉత్తమమైన నవలను తెలుగు పాఠకులకు అందించినందుకు అభినందనీయులు.

—శ్రీ టి. ఎల్. కాంతారావు

## భర్తృహరి నిర్వేదము

(సంస్కృత నాటకానువాదము. మూలనాటక కవి. హరిహరకవి. అనువాదకులు, శ్రీ చర్ల నారాయణ శాస్త్రిగారు. వెల 1 రూపాయి.)

## నీలకంఠ విజయము

(సంస్కృత కావ్యము. అనువాదకులు శ్రీ చర్ల నారాయణశాస్త్రి, శ్రీ చర్ల గణపతిశాస్త్రి. వెల 2 రూపాయలు.)

ఈ రెండు పుస్తకాలు దొరికే చిరునామా. శ్రీ చర్ల నారాయణశాస్త్రి. లలితా ప్రెస్, ఖైరతా బాద్, హైదరాబాదు—4.

సంస్కృతరూపక వాఙ్మయంలో 'భర్తృహరి నిర్వేదము' ప్రత్యేకించి పేర్కొనదగిన రచన. ఇది శాంతరస ప్రధానమయిన అయిదంకాల నాటకము. ఈ రసం ప్రధానమయిన గీర్వాణ నాటకాలు చాలా అరుదు. దీనిలో కథ చాలా విచిత్రమయినది.

తన రాణి అపూర్వానురాగం పరిశీలించగోరిన రాజు తాను వేటలో మరణించినట్టు ఒక మిథ్యా వార్త ఆమె చెవిని వేయిస్తాడు. వెంటనే రాణి చని పోతుంది. గోరక్షనాథుడన్న ఒక యోగి పగిలిన తన కుండ తార్కాణంగా పేర్కొని ఆతనికి వైరాగ్యం కలిగిస్తాడు. ఆ తరవాత తన మహిమవల్ల ఆ రాణిని తిరిగి బ్రతికిస్తాడు. అయినా రాజు వైరాగ్యం చెక్కు చెదరదు. ఆ రాజుపేరే భర్తృహరి. కనకనే ఈ నాటకానికి ఈ పేరు పెట్టడం జరిగింది సంగ్రహంగా దీనికి సంబంధించిన ఇతివృత్త మిది.

ఇక నీలకంఠ విజయమన్న సంస్కృత గద్య పద్యాత్మక కావ్యం రచించిన మూలకవి నీలకంఠ దీక్షితులు. ఈ కవి అప్పయ్యదీక్షితుని వంశంలో జన్మించిన శైవవిద్వాంసుడు. సంస్కృతంలోని గద్య పద్యాత్మక మహాకావ్యాలలో నీలకంఠ విజయం సుప్రసిద్ధమయినది. సముద్రమథన సమయంలో సముద్భవించిన హాలాహలం భక్షించి, అసురుల నాదుకుని సంరక్షించిన పరమశివుని పవిత్ర చరిత్రాభి వర్ణనమే నీలకంఠ విజయం ప్రధానేతి వృత్తము. దూర్వాస మహర్షికి శచీపతి చేసిన అపరాధమే ఈ కావ్య కథకొక ప్రధాన కారణమవుతుంది చర్లవా రుభయులు ఈ కావ్యం సముచిత గద్యపద్య రచనలతో యథా మూలంగా అనువదించార.

చర్ల నారాయణశాస్త్రిగారి భర్తృహరి నిర్వేదం అనువాదల కూడా ఇదేవిధంగా సాగింది. ఈ అపూర్వరూపకంతోబాటు నీలకంఠదీక్షితుని కావ్యం యథామూలంగా తెలుగువారి కందించిన ఈ కవు లిద్దరు అభినందనీయులు.

అయితే ఈ రెండు అనువాదాలకు ముందు, హరిహరకవినిగూర్చి నీలకంఠదీక్షితుని గురించి తెలిసిన చరిత్రాంశాలతో ఆయా విశేషాలతో పీఠికను కూడా రచించి ఉంటే బాగుండేది.

—'శాస్త్రి'

## చైతన్యలహరి

(వెల: ఆరు రూపాయలు. యువ భారతి, కింగ్స్వే, సికింద్రాబాద్—3.)

మన ప్రాచీన సాహిత్యాన్ని వర్ధమాన తరానికి పరిచయం చెయ్యాలన్న ఉత్తమ సంకల్పంతో యువ సాహితి చేస్తున్న కృషి ఫలితం ఈ చైతన్యలహరి. వారి కృషి ఫలితంగా 1971 లో కావ్యలహరి వచ్చింది. 1972 లో చైతన్యలహరి వచ్చింది.

కావ్యలహరిలో అయిదు ఆంధ్ర ప్రబంధాలను పరిచయం చేస్తూ శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు చేసిన ప్రసంగాలు కూర్చేరు. పరిచయ కర్తలు ఒక్కరే

బడలేదు.

బహుశా ఆ అనుభవంతోనేమో, 1972 లో పద్ధతి మారింది. విద్వత్తూ విమర్శన శక్తీ గల అయిదుగురు ప్రతిభావంతుల్ని ఏరేరు. ఆచార్య దివాకర్ల వెంకటావధాని, గడియారం రామకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్యులు. మరుపూరు కోదండ రామరెడ్డి, కొత్తపల్లి వీరభద్రరావు, వీరు వరస క్రమంలో తిక్కన సోమయాజి, పాల్కురికి సోమనాథుడు, కృష్ణదేవరాయలు, వేమనయోగి, గురజాడ అప్పారావుగార్ల రచనలను వివిధ కోణాలనుంచి అనుశీలన జరిపి వ్రాసిన ప్రసంగాలను చైతన్యలహరిగా తెచ్చేరు.

దీనిలోని వ్యాసాలలో ఒక విశిష్టత కనిపిస్తోంది. ఒక్కొక్క సమీక్షకుడు ఒక్కొక్క రచయిత వివిధ గ్రంథాలను తీసుకొని పరిశీలన జరిపేరు. తమకు ఆయా రచయితలలో విశిష్టగుణంగా కనిపించినదానిని తమ తమ వైఖరిలో చెప్పుకుపోయేరు. దీని వలన విషయ వైవిధ్యమేగాక, రచనా వైవిధ్యం, ఆలోచనా వైవిధ్యంకూడ కనబడుతున్నాయి.

వేమన హేతువాద దృక్పథాన్నీ, సంఘంలోని దురాచారాల్ని నిరసించడంలో చూపిన విమర్శనైశిత్యాన్నీ శ్రీ మరుపూరు వారు చాల చక్కగా చెప్పేరు. సమాజంలాగే దానిలో ఆలోచనలు, ఆచారాలు, నీతి నియమాలు పరివర్తన పొందుతులటాయనీ, ఒకనాడు పరిణామక్రమంలో సమాజాభివృద్ధికి తోడ్పడిన అంశాలే చరిత్ర గతిలో ప్రతిబంధకాలుగా తయారవుతాయనీ శ్రీ కోదండ రామరెడ్డిగారికి విస్పష్టమూ, దృఢమూనైన ఆలోచనవుంటే ఈ వ్యాసం ఇంకా బాగుండేది.

శ్రీ పుట్టపర్తివారు కృష్ణదేవరాయల ఆముక్తమాల్యదలోని వైష్ణవ సంప్రదాయ చిత్రణనూ, రాయల అనూన పరిశీలనా దృష్టినీ వివరించేరు.

శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు తమ వ్యాసంలో గురజాడవారు తాము జీవించిన సమాజం తెలుగు సాహిత్య ప్రక్రియలకు ఒరవడిపెట్టిన ప్రతిభనూ, వ్యుత్పత్తినీ విశదీకరించేరు.

అలాగే తిక్కన బహుముఖ ప్రతిభను వివరిస్తూన్న శ్రీ దివాకర్లవారి ప్రసంగం, పాల్కురికి సోమనాథుని పాండిత్యం, బహుళ రచనలనూ గురించిన శ్రీ గడియారం రామకృష్ణశర్మగారి ప్రసంగం బహు విషయ బోధకంగా వున్నాయి.

ముఖేముఖే సరస్వతీ. ఈ రచయితల భావాలకు భిన్నమైన దృక్పథాలుండొచ్చు. ఇప్పుడు చెప్పినవానికన్న విశిష్టమైన అందాలు ఎవరికన్నా తోచవచ్చు. వ్యతిరేకాభిప్రాయాలే కొందరి కుండవచ్చు. పది పదిహేనేళ్ల క్రితం గురజాడను 'అకవి'గా ధృవపరుస్తూ సాగించిన వాదనల్ని మనం ఎరుగుదుం.

అయినా ఈ నేళ మనం నిర్మించుకొంటున్న నవ్యసాహిత్యం ఒక్కరోజున మన జ్ఞానవీధిలో వెలసింది కాదు. ఘనకీర్తిగల గతమెంతో వుంది దీనికి. ఎంతో సంప్రదాయం వుంది. చరిత్ర వుంది. ప్రకృతిలో అన్నింటిలోనూలాగే ఆ గతంలో, సంప్రదాయంలో చరిత్రలో మంచీ చెడ్డా రెండూ పక్కపక్కలనే వున్నాయి. ఈవేళటి మన సాహిత్యంలోని మంచి, చెడ్డలు రెంటికీ ఎంతో బలమైన పునాదులే వున్నాయి. అవేమిటో, ఎల్లాంటివో, తెలుసుకొనేందుకైనా యువ సాహితివారు చేస్తున్న ఈ మాదరి ప్రయత్నం అవసరం

—''అవంతి'

## ప్రఖ్యాత శాస్త్రవేత్తలు

(రచన : డా. ఎ. ఎస్. రాజ్ ప్రచురణ: మానవ విజ్ఞాన మందిరం, హైదరాబాదు. పేజీలు 120. ధర. రు. 7–50.)

డా॥ ఎ. ఎస్. రాజ్‌గారిచే రచించబడిన 'ప్రఖ్యాత శాస్త్రవేత్తలు' అనే గ్రంథం శాస్త్రవిజ్ఞానంలో ఆసక్తి కల్గిన ఆబాలగోపాలం చదివి ఆనందించ దగినది. విజ్ఞాన విషయంగా లోతుకు పోనవసరంలేని విధంగా

కేవలం కొంతమంది ప్రఖ్యాత శాస్త్రవేత్తల జీవితాల గురించి, వారి కృషిలో గల ముఖ్యాంశాల గురించి, వారి సందేశాల గురించి కుతూహలకరంగా చర్చించారు. అందువల్ల పిల్లలు సైతం సామాన్య పాఠకులు సరదాగా చదువుకోగల్గుతారు. వ్యాసాలు చక్కగా, చిన్నవిగా ఉన్నాయి.

సుమారు 24 శతాబ్దాల కిందట జన్మించిన అరిస్టాటిల్ దగ్గరనుంచి 17 వ శతాబ్దంలోని హార్వే వరకు గల కొంతమంది యూరప్ ' మధ్యఆసియా శాస్త్రజ్ఞుల జీవిత విశేషాలను వారు రూపొందించారు. పుస్తకం గెటప్, ప్రింటింగ్ ఉన్నతంగా ఉన్నాయి. చాలవరకు శాస్త్రజ్ఞుల ఫొటోలు ఇవ్వడం ఒక ఆకర్షణ. అయితే ధర అందుబాటులో లేకుండా ఉంచారు.

ఇంత ఉన్నత ఆదర్శం, సంపత్తి కల్గిన గ్రంథంలో అడపా తడపా తప్పులు దొర్లడం అపశ్రుతి వింటున్నట్లుగా ఉంది. అంతేకాక తప్పొప్పుల పట్టికకు అందకుండా కూడా మిగిలిపోయాయి కొన్ని. వాటిలో

ఉదాహరణగా:— 39 వ పేజీ—పక్షులు;
40 వ పేజీ—వక్షలు; 42 పేజీ— సంవవ్సరాలు.
49 వ పేజీ—హోలెమీ; 53 పేజీ—ప్లైఖోబ్రాహి;
53 వ పేజీ - ఫార్మద్రోలి; 76 పేజీ—అంతర్దేహ.
107 వ పేజీ—నేరకొన్నందుకు;
113 పేజీ శతబ్దపు.

ఇలాటివే కాక పారిభాషిక పదాల సందర్భంగా ఒక విషయం. పారిభాషిక పదాల పట్టికను ఇచ్చారు. అయితే అందులో కొన్నిటికి సరియైనవి, వాడుకలో మన్నవి వేరే పదాలు ఉన్నాయి. కొన్ని ఉదాహరణగా:—

Atrium — అత్రియము — కర్ణిక
Milky way — ఆకాశగంగ — పాలపుంత
Nerves — నరాలు — నాడులు
Capillary — రక్తనాళాలు — కేశనాళికలు
Anatomy — అంతర్గత శారీరక శాస్త్రము— శరీర నిర్మాణ శాస్త్రము
Science of Biology—Science of అనేది అనవసరం.
Pulmonary artery—నాడీధమని—పుపుసధమని.
Complexity of structure —దేహనిర్మాణము— నిర్మాణక్లిష్టత

మొత్తంనిూద శ్రీ ఎ. ఎస్. రాజ్‌గారి శైలి సులభంగా, సూటిగా ఉంది. వీరి కలంనుంచి కొన్ని శాస్త్రీయ గ్రంథాలు వస్తాయని ఆశించవచ్చు.

—శ్రీ జమ్మి కోనేటిరావు

## ఆంధ్ర సంఘము—కలకత్తా

పై సంఘమువారి 20 వ వార్షిక సంచిక మా కార్యాలయమునకు చేరింది. ఇందులో పది ప్రసిద్ధ కవుల కవితా ఖండికలు, పది వ్యాసములు, ఏడు కథానికలు, మూడు సంస్మరణలు, ఒక నాటిక, రెండు స్కెచ్‌లు—సంపాదకీయం ఉన్నాయి.

ఇవిగాక ఆంగ్ల రచనలు పదిహేడు, హిందీవి రెండు వ్యాసాలు, బెంగాలీవి రెండు పద్య ఖండిక లున్నాయి.

ముఖచిత్రం సర్వాంగ సుందరంగా హావభావాలతో శ్రీ బాపు చిత్రించారు. ఈ సంచిక ప్రవాసాంధ్రుల సాహితీ కృషికి ఉన్నత సోపానం.

## శ్రీ వేమన గ్రంథాలయము

కృష్ణాజిల్లా తేలప్రోలులోని శ్రీ వేమన గ్రంథాలయము వారి 40 వ వార్షికోత్సవ సంచిక మా కార్యాలయానికి చేరింది. 48 పుటలు గల ఈ గ్రంథము వివిధ రచయితల రచనలతో ఒప్పారుతూంది.

## నియోగి మహాసభ (మద్రాస్)

పై సంఘమువారి ఐదవ వార్షికోత్సవ సంచిక మా కార్యాలయానికి చేరింది. 62 పుటలతో ఒప్పారే ఈ సంచిక ఆంగ్ల, తెలుగు రచనలతోపాటు, ఆ సంఘం నిర్వహిస్తున్న కార్యక్రమ వివరాలతో సుశోభితంగా వుంది.

## యక్ష విరహము

(కాళిదాసు మేఘదూత కావ్యమునకు స్వేచ్ఛానువాదం)

(కృతికర్త : శ్రీ పి. విజయభూషణశర్మ, వెల : 3—50 ప్రతులకు : రచయిత పేర ఆకాశ వాణి నిలయ రచయిత, విజయవాడ)

'మేఘదూతం' కాళిదాసుని ప్రతిభా ప్రాగల్భ్యానికి నికషోపలం. కాళిదాసుని మేఘదూతం ఒకే వృత్తంలో నడిచింది–అదే మందాక్రాంత.

ఇక మక్కీకి మక్కీ అనువాదాలు, ఛాయానువాదాలు, స్వేచ్ఛాను వాదాలు—తెలుగున ఎన్నో వెలిశాయి. శ్రీ విజయభూషణ శర్మగారి అనువాదం. హృద్యంగానూ, శ్రావ్యంగానూ రమణీయంగానూ ఉన్నది 'యక్ష విరహము'.

మచ్చునకొక్క ఉదాహరణమును చూడుడు. మూలంలోని 'మందం మందం నుదతి పవనశ్చాను కూలో యథాత్వాం' అన్న శ్లోకానికి క్రింది భావాను వాదం చూడుడు.

'చాతకపక్షి పల్కులు ప్రసన్నముగా
మధురంబుగా శ్రవః
ప్రీతిని గూర్చు చున్నయవి
పేరిమి పెంపున ఆ వలాకముల్
నూతన కాంజితంబుల
వినోదము గూర్చి శుభంబు చాటెడిన్
ఈతమి తీర్పుమా! అంటులు డియ్యెడ
నీ కనుకూలుడే గదా!

ప్రతి పద్యంలోనూ - ఎక్కడా వ్యర్థ పదములు లేక మూలమునే మ(ము)రిపించేట్లుగా ఉంది!

## సుయోధనుడు
## చారుదత్తుడు

(పై రెండు గ్రంథముల రచయిత శ్రీ నండూరి ఉదయభాస్కర్, వెల ఒక్కొకటి రూ 2/, ప్రతులకు విశ్వోదయ పబ్లికేషన్స్, ప్రగడవరం, ప॥ గో॥ జిల్లా.)

(1) సుయోధనుడు–దుష్ట చతుష్టయంలో మొదటివాడు, ధృతరాష్ట్రుని ముద్దుల కుమారుడు. అంతేకాదు అభిమాన ధనుడున్నూ. ఆంధ్ర మహాభారతము ఆధారంతో 'సుయోధనుని' చరిత్రాన్ని పాఠ లోకాని కందించారు–శ్రీ ఉదయభాస్కర్. 60 పుటలు గల ఈ పుస్తకము ఆబాలగోపాలం చదువ తగ్గది.

(2) శూద్రకుని మృచ్ఛకటికం ఆధారంతో 'చారుదత్తు'డనే గ్రంథాన్ని 75 పుటలలో వ్రాశారు శ్రీ ఉదయభాస్కర్. ఈ గ్రంథానికి 'అభినందన' వ్రాస్తూ శ్రీ సి. నా. రె. 'ఈ పుస్తకంలో చదివించే లక్షణముంది. చదివిన తర్వాత చవులూరించే గుణమూ వుంది.' అన్న మాటలు ఒప్పి ఉంది.

## నవజ్యోతులు

(గేయ సంకలనం)

(వెల: రూ. 1—00, ప్రతులకు, కర్నూలు జిల్లా రచయితల సంఘం ప్రచురణ—3, కర్నూలు.)

'నవజ్యోతులు (గేయ సంకలనం) 33 వివిధ శీర్షికలతో— వివిధ రచయితల, రచయిత్రుల కవనాలున్నాయి. యువభావకులకు చక్కని అవకాశం కల్పించి— వారి రచనలను వెలుగులోనికి తెస్తూన్న కర్నూలుజిల్లా రచయితల సహకారసంఘం కృషి ప్రశస్తమూ, ప్రశంసనీయమూ అయినది.

---

# గ్రంథ స్వీకారము

## స వి త

(వచనకవితా సంపుటి)

(రచన: కీ॥ శే॥ వే. నరసింహారెడ్డి వెల: రూ. 4-00 పుటలు 74. ప్రతులకు: సాందీపని ప్రచురణలు, 5-1-1841 జాంబాగ్, హైదరాబాదు—1.

## మల్లారెడ్డి మాట

(శ త క ము)

(రచన: శ్రీ బిల్లకంటి మల్లారెడ్డి వెల: 50 పైసలు, పుటలు 20. ప్రచురణ: ఆంధ్రసారస్వత పరిషత్తు, సదాశివపేటశాఖ, మెదకుజిల్లా)

## త ల పో త లు

(ఖండకావ్యము)

(మూల్యం: రూ. 1-50, పుటలు 62.)

## సంగమేశ్వర శతకము

వెల: రూ. 1-00, పుటలు 24, పై రెండు గ్రంథములకు, కృతికర్త ప్రకాశకులు: శ్రీ బైరపు రెడ్డి రెడ్డినారాయణరెడ్డి రాయవరము, రాయచోటి తాలూకా, కడపజిల్లా)

## శ్రీ శంభులింగ శతకము

(రచన: శ్రీ నీర్ల మదనయ్య, వెల: రూ. 1, పుటలు 64. ప్రతులకు: శ్రీ దేవీ ప్రచురణలు—చెన్నూరు. (వయా) మంచిర్యాల్, ఆదిలాబాదుజిల్లా)

## క ళా కే ళి

(రూపక సంపుటి)

(వెల: రూ. 1—50, పుటలు 49. రచన: శ్రీ నేమాని సంగమేశ్వరరావు ప్రతులకు: కళానికేతన్, సి· 1151 ఇ, ట్రాఫిక్‌కాలని ఖురదారోడ్డు రైల్వే స్టేషన్, జట్నిపోస్టు (ఒరిస్సా)

## క వి తా శా ర ద

(కావ్యఖండికలు)

(రచయిత: శ్రీ కె. టి. ఎల్. నరసింహాచార్యులు, వెల: 1—50, ప్రతులకు: గోదా గ్రంథమాల, మునునూరు, కృష్ణాజిల్లా.)

## శ్రీ లక్ష్మీనృసింహ స్తోత్రములు

సేకరణ; సమర్పణ: భక్తిప్రబోధమండలి, 15 పైసలు తపాలబిళ్లలు పంపినవారికి పై పుస్తకము ఉచితముగా పంపబడును. ప్రతులకు: హరేరామనగర్, కోరుకొండ, తూ—గో—జిల్లా.

## శ్రీ నామ రామాయణమ్

(పై గ్రంథము 20 పైసల పోస్టేజిస్టాంపులు పంపినవారికి ఉచితముగా పంపబడును· ప్రతులకు. ఆర్షసాహితి, 25-7-18 ఆమంచివారివీధి, విజయనగరం—2.

## శ్రీ గోదాష్టోత్తర శతనామ స్తోత్రము

(సాంధ్ర వివరణము)

(వివరణకర్త: శ్రీ ఇరంగంటి రంగాచార్య. వెల: రూ· 1—00, పుటలు 37, ప్రతులకు: గ్రంథకర్తపేర,! 5-551, కిషన్‌పుర, వరంగల్—1)

## చి త్ర శ త క ము

(తెలుగు సేత: శ్రీ కృష్ణావఝల వేంకట నరసింహం, మూల్యం 50 పైసలు, పుటలు 20 ప్రాప్తిస్థానము: శ్రీ కె. రూబెన్, ఎం. ఏ; హిందీపండిట్, మార్కాపురం.)

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1 Editor : S. Radhakrishna.